మనసులో మన్ననైన మంజరి, కనులముందు
శిల్పసుందరిగా జక్కన్న మలచిన
మనోహర కళా ఖండమే!





విక్రమ్ ప్రొడక్షన్స్

# అమరశిల్పి జక్కన్న

పూర్తి ఈస్ట్‌మన్ కలర్ చిత్రం

నిర్మాత. దర్శకుడు!

**B.S.రంగా**



# ఆడంబరాలను విడనాడండి
# దేశసంపదను వృధా కానీయకండి








# ఉత్తరాలు

## క థ

"కె. వి. యస్. శర్మగారు వ్రాసిన "మరుపు రాని ఉగాది" ఎంత బాగుంది అనుకున్నారూ ? ? అది చదువుతున్నంత సేపూ నవ్వుతూనే ఉన్నాను. మరో విశేష మేమంటే కథలోని శేషగిరి పరిస్థితే నా పరిస్థితీ (నూటికి తొంభై పాళ్ళు)—మా అత్త గారి వూరికి వెళ్తే ! ఒంటెద్దు బండి తప్పదు! కథ నాబోటి వాళ్లకు జరిగే, వాస్తవాల్ని హాస్యాల్ని బాగా అందించింది. సారధి "అక్కయ్యనూ, బావనూ, మేనల్లుడినీ తీసుకు వెళ్ళానికి" అనే బదులు "అన్నయ్య' అని పడింది. బహుశా అచ్చు పొరపాటేమో ! ఇలాంటి హాస్య కథల్ని వరుసగా ప్రచురించ వలసిందిగా సంపాదకుని కోర్తున్నాను. శర్మ గారికి నా అభినందనలు—

సూర్యారావ్, సింగులూరి (గుంటూరు)

## రా జ ధా ని క బు ర్లు

ఈ వారం రాజధాని కబుర్లు, అక్కినేని అమెరికా పయనంతోనే నిండినట్టున్నాయి. అక్కినేని అమెరికా పయనం గూర్చి ప్రత్యేక వ్యాసం బాగుంది. కాని రాజధాని కబుర్లు కూడా దాంతోనే నింపేయడం బాగా లేదు. రాజధాని కబుర్లలో ఇంకేమైనా రాయవలసింది.

వి. లక్ష్మి ((శ్రీకాకుళం)

*        *        *

ఈవారం సంచికలో రాజధాని కబుర్లలో వ్యాసకర్త నాగేశ్వరరావుకు జరిగిన సన్మానం గూర్చి వ్రాస్తూ చాలామంది ప్రేక్షకులు తమ అభిమాన సినిమా నటుని చూడడానికి, చూసి తమ జన్మను సార్థకం చేసుకోవాలని వచ్చారు అని వ్రాశారు. ఇది చాలా నీచం. సినీ నటులను చూస్తే జన్మ సార్ధక మవుతుందా! ఈ దేశంలో చాలామంది సినిమా నటులందరినీ చూసిన వారున్నారు. అంత మాత్రానికి వారి జన్మ సార్థక మవుతుందా. నటులు కూడా మన లాగే మనుషులే. ఒక మనిషి ఇంకొక మనిషిని చూస్తే జన్మ సార్థకము అవుతుందా? వ్యాసకర్త సినీ నటులను ముఖ్యంగా నాగేశ్వరరావుగారిని దేవతల మాదిరి భావించారు. ఆనాడు సభకు నేనూ వెళ్ళాను. కాని నా జన్మ సార్థకం కావడానికి కాదు. కేవలం సినీ నటులను చూడటానికి మాత్రమే.

ఒక ప్రేక్షకుడు.

*        *        *

అక్కినేని తెలుగు సినిమా రంగపు బిడ్డగా అమెరికా పయనం ఆంధ్రుల వీడ్కోలులతో—పూర్వకాలపు పగటి వేషాలకు కూడా చోటిచ్చిందని నా కెంతో గర్వంగా ఉందని చెబుతోంటే ఆశ్చర్య పోరనుకుంటా......!

కాదంబరి (కాకినాడ)★

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 17—4—'64
క్రోధినామ సం॥ నిజ చైత్ర మాసః శుద్ధ షష్ఠి
సంపుటము : 56 సంచిక : 33

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

## ఒక సంవత్సరం చందా వివరాలు

ఇండియా రూ 15.60. ఇతర దేశాలు ఓడమీద (Sea Mail) రూ. 28.60. విమానం ద్వారా (Air Mail) (బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120.00. అమెరికా రూ. 176.80. ఆస్ట్రేలియా రూ. 148.20.

విడి ప్రతి 30 న.పై.
సంవత్సర చందా 15.60 న.పై.
6 మాసాల చందా 7.80 న.పై.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1




"మరే...మీరు...సిగరెట్లు తాగితే 'కేన్సర్' వస్తుందన్నారుగా, అందుకే నేను చుట్టలు కాలుస్తున్నా..."

## మన లో మాట

మధ్య పేజీలలోని వ్యాసం, చిత్రాలు శ్రీ ఎస్. వి. రామారావుగారివి, వీరిది గుడివాడ. బి. ఎ; బి. కాం. పరీక్షలు పాసయిన తర్వాత మద్రాసు లలితకళల కళాశాలలో డిప్లొమా తీసుకున్నారు. 1960 నుంచి లండన్‌లో ఉంటున్నారు. త్వరలో అమెరికాకి వెళ్ళిపోతున్నారు. బ్రిటన్‌లో వారి బొమ్మలు మంచి ప్రశంసలు అందుకున్నాయి.



* * *

వచ్చేవారం షేక్‌స్పియర్ పుట్టి సరిగ్గా 400 సంవత్సరాలు అవుతుంది. ఈ సందర్భంలో ఆంధ్ర సచిత్ర వారపత్రికలో కొన్ని ప్రత్యేక వ్యాసాలు వేస్తాము. ఈ వారం షేక్‌స్పియర్ కాలంలో లండన్‌ని గురించిన వ్యాసం ఒకటి ప్రచురించాము.

ఈ సంచికలో వేసిన 'గతజల సేతుబంధనం' కథతో బొంబాయి ఆంధ్రమహాసభ పోటీ కథలు ఐపోయాయి.

పై వారమే హావిస్, ఆదివిష్ణు, సింగరాజు, రామచంద్రమూర్తి, పెద్దిభొట్ల సుబ్బరామయ్యగార్లు కలిసి వ్రాసిన గొలుసు కథ ప్రారంభం అవుతుంది.

ఆ సంచికలో అందరికీ ఆనందం కలిగించే విశేషం ఒకటి ఉంటుంది...

## విషయానుక్రమణిక

ముఖచిత్రం: నటి షీలా.


**కథలు :**

గత జల సేతుబంధనం — 10
ఓ తెలుగు సినిమా కథ... — 16
రేయి విడిచిన నక్షత్రం — 25

**సీరియల్ కథలు :**

ఎండమావులు — 14
సంపెంగ పొదలు — 30
రామచరిత మానస్ — 46

**వ్యాసాలు : శీర్షికలు : సినిమా.**

ఉత్తరాలు — 3, ఊమెన్ కార్నర్ — 6 న్యూఢిల్లీ లేఖ — 7, రాజధాని కబుర్లు, ఎంటెంటి వజ్రాలు—9, సరాగమాల—12, సినిమా—13, వనితాలోకం — 20, మనసులోమాట — 21, వారఫలం — 22, మహానగరం లండన్ — 32, షేక్‌స్పియర్ లండన్—58 ఇరుగు పొరుగుభాషల చిత్రాలు— 59, బొమ్మల కథ - 64.

# భోపాల్ కార్మికలోకంలో కల్లోలం

# విఫలమయిపోతున్న పాలసరఫరా పథకాలు

భోపాల్‌లోని ప్రభుత్వంవారి భారీ విద్యుత్పరికాల కర్మాగారం 'లాకౌట్' ప్రకటించటం జరిగింది. స్వాతంత్ర్యానంతరం మనం అమలుపరచుకున్న కార్మిక విధానమూ, కమ్యూనిస్టుల విజృంభణను అణచివేయటానికి జరిగిన ప్రయత్నాలూ, వీటికి తోడు 'ఫెడరల్' అధికారాలు బలహీనమైపోవటం........ఇవన్నీ కలిసి ఆ 'లాకౌట్'కు దోహదమిచ్చాయేమో!

కార్మిక సంఘాలలో, ఇతరులు జోక్యం కల్పించుకోవటం హానికరమన్న విషయాన్ని, కేంద్ర ప్రస్తుత కార్మికమంత్రి, వారి పూర్వీకులు శ్రీ లాలాగుల్జారీలాల్‌నందా పదిహేడు సంవత్సరాల తరువాత గుర్తించారు. ఏమయితేనేం! అలాంటి జోక్యాలు కొన్నిమార్లు జాతి వ్యతిరేక పరిస్థితులకు కూడా దారి తీస్తాయని వారిరువురూ అంగీకరించారు!

భోపాల్‌లో తలలెత్తిన ఈ కార్మిక సమస్య, వల్ల భారతప్రభుత్వపు కార్మిక విధానాల్లోని లోపాలెన్నో వెలుగులోకి వచ్చాయి. ఇండియాలో ప్రధానమైన కార్మిక సంఘాలు మూడు' ఉన్నాయి: (1) ఆలిండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు(కమ్యూనిస్టులు) (2) ఇండియన్ నేషనల్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు (కాంగ్రెసు) (3) హిందీమజ్దూర్ సంఘ్ (సోషలిస్టు). మూటల్లో, ఇండియన్ నేషనల్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు ఘనమైనదే. వాస్తవంలో మాత్రం, కమ్యూనిస్టుల యూనియన్‌కు ఏంతో పలుకుబడి ఉంది. ముఖ్యంగా, బ్యాంకు ఉద్యోగులలోను, రైల్వే ఉద్యోగులలోను, రేవు కార్మికులలోను, పెట్రోలియం కార్మికులలోను కమ్యూనిస్టుల యూనియన్ బాగా ప్రచారాన్ని సంపాదించుకొంది.

భోపాల్‌లోమాత్రం కమ్యూనిస్టులయూనియన్‌కు ఎంతో పలుకుబడి ఉన్నది. కాంగ్రెసువారు నడుపుతున్న యూనియన్‌లోమాత్రం ఎక్కువగా మోటారు డ్రైవర్లే! కాంగ్రెసు యూనియన్‌కు ప్రభుత్వవారి గుర్తింపు కూడా లభించింది. తమ యూనియన్ బలపరచుకోవటం, కాంగ్రెసు వారికి చేతనే కాదు.

ఒక్కసారి గతంలోకి చూదాం. కాంగ్రెసు వాళ్లు నడుపుతున్న యూనియన్‌కు వెంటనే ఏం అవసరమో తెలిసికోవాలి. నిజం చెప్పాలంటే, స్వాతంత్ర్యానికి పూర్వం కూడా కమ్యూనిస్టుల ప్రభావం కార్మికసంఘాలలో ఎక్కువగా ఉండేది. క్రమేణా, కాంగ్రెసు అధికారంలోకి రావటంతో వ్యవహారం తలక్రిందులైంది. కాంగ్రెసువారి 'ఐ.యన్.టి. యు.సి' అధికారంలోకి రావటం, ప్రభుత్వం వారి గుర్తింపు సంపాదించుకోవటం జరిగిపోయాయి. కాంగ్రెసులో ఒక భాగమై కూడా ఈ సంస్థ కార్మికుల సౌభాగ్యంకోసం కమ్యూనిస్టులు పోరాడినంత విరివిగా, దృఢంగా పోరాడలేకపోయింది. పైగా, ఆ ప్రభుత్వంయొక్క ఆదరణ పొందటం వల్ల 'ఐయన్‌టియుసి' కార్మికులంతా, ప్రభుత్వ పక్షంలోనే భాగస్వాములుగా మారిపోయారు. కమ్యూనిస్టులు, యీ ప్రభుత్వ పక్షపాత వైఖరిని చూసి అసూయపడలేదు!—కారణం వాళ్లు నిజమైన కార్యకర్తలు కావటమే.

ఏమో! కమ్యూనిస్టులు దేశ ఆర్థిక పరిస్థితిని స్తంభింప చేయ గలరని భోపాల్ నిరూపిస్తుందా!

* * *

కేంద్రంలో, పబ్లిక్ అకౌంట్స్‌కమిటీ నివేదిక వెలువడింది.! అందులో ఎన్నో కుతూహలమైన విషయాలు కూడా వెల్లడయ్యాయి.

హిందుస్థాన్ మెషిన్‌టూల్స్ కర్మాగారమని ఒకటున్నది. అందరికీ తెలిసిందే! ఈ కర్మాగారం 1962, జూలై 21 నుంచి అశోకా హోటల్‌లో రెండు రూములను శాశ్వతంగా అద్దెకు తీసుకున్నది. దీని ఖర్చు నెలకు రు 1,750 లు. సీనియర్ అధికార్లు పర్యటనల మీద ఢిల్లీ వచ్చినప్పుడు ఉండటం కోసం ఇలా, రూములను శాశ్వతంగా అద్దెకు తీసుకోటం జరిగింది. పైగా, రూములను అద్దెకు తీసుకున్న నాటి నుంచి, నెలకు పదిహేను రోజులు, సరాసరిన, అవి ఖాళీగానే ఉన్నాయి...... కాని విచిత్రం ఏమి కాదు అట్లా ఖాళీగా ఉన్నా, కంపెనీకే లాభం అన్న వాదన ఒక విశేషం. ఎప్పటికప్పుడు డబ్బు చెల్లిస్తే, నెలకు నాలుగు వేలరూపాయలు ఖర్చు అయ్యేదట.

పబ్లిక్ అకౌంట్సు కమిటీ ఈ సమస్యను చర్చించింది. ప్రభుత్వం వారి డబ్బు ఇలాంటి కంపెనీలలో పెట్టుబడి పెట్టినప్పుడు, ఆ కంపెనీలు అతి సామాన్యంగా ఉంటూ, ఆదర్శప్రాయం కావాలన్న భావాన్ని కమిటీ వ్యక్తపరచింది. ఖరీదైన హోటల్లో "సీనియర్ అధికార్లకోసం, రెండు రూములను శాశ్వతంగా అద్దెకు తీసుకొనటం ప్రజల దృష్టితో చూస్తే అంత ఔచిత్యంతో కూడినదిగా కనుపించక పోవచ్చును" పైగా, ఇతర అధికారుల పట్ల పక్షపాత వైఖరి చూపించినట్లు తేలపోతున్నది. హెచ్. ఎం.టి. కంపెనీ అధికారి ఒకరు ప్రస్తావించినట్లు, 'అశోకా హోటల్'లో రూములను అద్దెకు తీసుకోటానికి మారుగా, వేరే గెస్టున్'హౌసు నెలకొల్పటం కూడా, బహిరంగ విమర్శలకు గురికావచ్చు. ఇలాంటి సంఘటనలు, ఇతర కంపెనీలు కూడా ఆచరించే ప్రమాదం ఉన్నది. అందువల్ల అశోకా హోటల్‌లో 'రూం'లను తీసికొన్న సమస్యను మళ్లీ పరిశీలించాలని పబ్లిక్ అకౌంట్స్ సిఫార్సున్నది.



ప్రధాని నెహ్రూ ఢిల్లీలో సోవియట్ సర్కస్ చూడవెళ్లినప్పటి చిత్రం.

# న్యూ ఢిల్లీ లేఖ

ఇకదేశం మొత్తంలో, ఇలాంటివే ఎన్నో కంపెనీలు ఉన్నాయి. ఢిల్లీ, కలకత్తా, బొంబాయి, మద్రాసు నగరాలలో ఉన్న కంపెనీల ప్రధాన కార్యాలయాలు వాటి శాఖలు కలిపి మొత్తం 24.71 లక్షల చదరపు అడుగుల మేరను ఆక్రమించుకున్నాయి. ఏటా ఈ కంపెనీలు 88 లక్షల రూపాయిల అద్దెను చెల్లిస్తున్నాయి.

పబ్లిక్ కంపెనీలయితేనేమి, పరిపాలనా శాఖలయితేనేమి, ప్రణాళికా అంచనా లేకుండానే 'వసతి' కోసం ఏర్పాట్లను చేసికొన్నారని పబ్లిక్ అకౌంట్సు కమిటి ప్రస్తావించింది. "ఏదో ఆ వేళకు ఏది వచ్చితే, అది తీసికోవటం జరిగిపోతున్నది."

ఎప్పటికప్పుడు అద్దెలను చెల్లించుకోవటం కన్నా ఒకమారు పెద్ద భవనాలను నిర్మించుకోవటం మంచిదన్న సూచనను పబ్లిక్ అకౌంట్సు కమిటీ వ్యక్తం చేసింది. అందువల్ల కంపెనీలకు ఆర్థికంగా లాభదాయకంగా ఉండటమే కాకుండా, ఆయా నగరాలలో ఇతర కంపెనీలకు వసతులకు అవకాశాలుంటాయని, పెరిగిపోయిన అద్దెలు తరిగి పోగలవని ఆ కమిటి పేర్కొన్నది. పైగా, అలాంటి కంపెనీలన్నీ ఒక చోటే ఉండటం వల్ల, ప్రజలకు ఎంతో సౌకర్యమని, రవాణా బాధలుండవని, పబ్లిక్ అకౌంట్సు కమిటి ప్రస్తావన.

* * *

1963 ఏప్రిల్ 1 నాటికి పబ్లిక్ కంపెనీల అధీనంలో ఉన్న వాహనాల సంఖ్య 4391. నూరుకంటే ఎక్కువ వాహనాలను నడుపుతూన్న కంపెనీలు ఇవి: (1) హిందుస్థాన్ స్టీల్ లిమిటెడ్ 1102, (2) నూనె, సహజవాయువు శాఖ 781, (3) జాతీయ బొగ్గు అభివృద్ధి కార్పొరేషన్ 288, (4) భారీఇంజనీరింగ్ కార్పొరేషన్ 264, (5) హిందూస్థాన్ ఎయిర్ క్రాఫ్ట్ 222, (6) నైవేలీ లిగ్నైట్ కార్పొరేషన్ 216, (7) ఫెర్టిలైజరు కార్పొరేషన్ ఆఫ్ ఇండియా 189, (8) ఇండియన్ రిఫైనరీస్ లిమిటెడ్ 171, (9) హెవీ ఎలక్ట్రికల్స్ 141.

పబ్లిక్ అకౌంట్సు కమిటి నివేదిక ప్రకారం, పై వాటిలో కొన్ని కంపెనీలో నడుపుతున్న వాహనాల సంఖ్య అధికంగా ఉన్నది. అందుకు, అవసరమైన వాటికంటే ఎక్కువ వాహనాల అవసరం ఉన్నదని అంచనా వేసికోవటం, "ప్రయారిటీ" పద్ధతిలో అవి లభించటం — కారణాలు కావచ్చును. ఒక్కమారుగా అధిక సంఖ్యలో వాహనాలను కొనటం ఆయా కంపెనీల పెట్టుబడి ధనం తరగిపోవటానికి, వాటి నిర్వహణకు అయే ఖర్చు పెరగటానికి తోడ్పడతాయి. కొత్త వాహనాలను కొనదలచుకొన్న ప్రతి సందర్భంలో ప్రతి కంపెనీ పొదుపును, ఔచిత్యాన్ని గమనించాలనీ కూడా పబ్లిక్ అకౌంట్స్ కమిటి సూచించింది. ఏమైనా, వాహనాల సంఖ్యను తగ్గించటానికి కంపెనీలన్నీ ఒక్కమారు వాటి, వాటి అవసరాలను పర్యావలోకనం చేసికోవాలి.

శ్రీకృష్ణ.

రాజధాని కబుర్లు:

# మంత్రుల మీద సినిమాల ప్రభావం?

ఆట్టే చూస్తుంటే మన మంత్రులకు సినిమాలకు ఎప్పటినుంచో అవినాభావ సంబంధం ఏర్పడి ఉన్నట్టనిపిస్తుంది. అందులోనూ ప్రభుత్వం వారు సినిమా పరిశ్రమ పట్ల చూపెట్టిన ఆదరాభిమానాలవలన, ఈ సంబంధం మరింత ప్రగాఢమయింది. ఈమధ్య జరుగుతున్న సమావేశాలు చూస్తుంటే ఈ విషయం సుస్పష్టమవుతుంది. హైదరాబాదు రాష్ట్రంలో ఒకానొక డిప్యూటీ మంత్రి తెగ సినిమాలు చూస్తుండేవాడు. ఎవరైనా ఆయన్ను పసికడతారేమో అన్నట్టు, సాధారణంగా నడిచే సరాసరి సినిమాహాలుకు వెళ్లిపోయేవాడు. అప్పటికీ అడపా తడపా, ఆయన్ను కొంతమంది చూస్తూనే ఉండేవాళ్లు. ఈనాటి మంత్రివర్గంలో కొంతమంది సభ్యులు బహిరంగంగానే ప్రకటించుకున్నారు. తమకు సినిమాలంటే సరదా అని. మన గవర్నరుగారు సరేసరి, ఇంగ్లీషు సినిమా ఒక్కటీ వదిలిపెట్టరు. ఈవిధంగా ఉంది ఆదరణ. సినిమా, మన దేశంలో పెద్ద పరిశ్రమల్లో ఒకటి. దానికి ఎంత సహాయపడితే అంత లాభం కూడా. ఈ విషయం ఆ పరిశ్రమలో పెద్దలకీ తెలుసు, రాష్ట్ర ప్రభుత్వానికీ తెలుసు, కాని, చొరవ చేసుకుని ముందడుగు వెయ్యటంలోనే ఉంది. ఆపని మన ప్రభుత్వం వారు చెయ్యటం వలన, దేశ వ్యాప్తంగా, ఎనలేని గౌరవం పొందగలిగింది. ఇంతవరకు బాగానే ఉంది. కాని, ప్రతి చిన్న, పెద్ద సమావేశంలోనూ మంత్రివర్యులు ఓపిగ్గా హాజరు కావటం, సినిమా ప్రపంచంలో మునిగిపోవటం, కొంత విడ్డూరంగానే కనిపిస్తోంది. గంటల తరబడి ఈవిధంగా కాలక్షేపం చేస్తుంటే ప్రజలమీద ఎలాంటి ప్రభావం పడుతుందో ఆలోచించాల్సి ఉంటుంది. అసెంబ్లీలో కూడా దీని విషయం ప్రస్తావన జరిగి, కేవలం దండలు వేయించుకోవటానికే 72 నిమిషాలు పట్టిందనీ, మంత్రులు, సినిమా సభల్లో హాజరుకావటాన్ని గురించి పత్రికల్లో రాకుండా ఉంటే బాగుంటుందనీ అన్నారు. దీంట్లో కొంత చమత్కారం లేకపోలేదు. ఏమయినప్పటికి ఈ 'తన్మయత్వం' శ్రుతిమించి రాగాన పడ్డట్టు పరిణమించకుండా చూడాలి. ఇలాంటి అనుబంధాన్ని గురించి, మా 'శ్రీనివాస్' కు విపరీతమైన అభిప్రాయా లున్నాయి.

మొత్తంమీద, ప్రతి సభకూ, సమావేశానికి, మంత్రులను పిలవటం పరిపాటయిపోయింది. రాజధానీ నగరంలో, అందుబాటులో ఉండటం ఒక కారణం కావచ్చు. అందరికీ తెలిసిన మరొక కారణం, వారి అభిమానాన్ని చూరగొనటానికి, ఆశ్రయాన్ని పొందటానికేను. మాజీ ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు అదివరలో అనవే అన్నారు, మంత్రులను చీటికి మాటికి సమావేశాలకు పిలవకూడదని వాళ్లు వచ్చినంత మాత్రానే ఆ సంస్థలకు సహాయం లభిస్తుందని అనుకోకూడదని. నిజమే, కాని వాళ్లు పిలుస్తూనే ఉంటారు. వీళ్లు వెళుతూనే ఉంటారు. నిజానికి దీంట్లో తప్పేమీ లేదు. అయితే అతి పనికిరాదంటారుగా! ప్రస్తుతం ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారికి వూపిరి సలపటంలేదు. ఆయనగారే ఎన్నో సమావేశాలకు హాజరవుతున్నారు. లలితకళా అకాడమీవారు నిర్వహించిన చిత్రకళావిష్కరణ నుంచి, వీధుల వెంబడి వూరేగటం వరకు, వారే భారం వహిస్తున్నారు. వారిని అభినందించటానికి అనేక సంస్థలవారు, పురప్రముఖులు ముందుకు వచ్చి, తమ అభిమానాన్ని గౌరవాన్ని వ్యక్తపరిచారు. ముఖ్యమంత్రిగారు సామాన్య ప్రజానీకం పట్ల, తమకున్న బాధ్యతలను విశదీకరించారు. ప్రణాళికల రూపేణా, ఖర్చు అవుతున్న సొమ్ము, బీద ప్రజలకు చేరేటట్లు చూస్తామన్నారు. అందరికీ తిండి, బట్ట, ఇల్లు లభించేటట్లు చూడటం, ధర్మ మార్గాన ప్రభుత్వ నిర్వహణ జరిగేటట్లు ప్రయత్నించటం తమ కర్తవ్యంగా ప్రకటించారు.

మంత్రుల ఉపన్యాసాల్తో విసిగెత్తిపోయిన ప్రజలకు ఓ సాహిత్య సమావేశం, వారు లేకుండా జరగటం విశేషమే. అలాంటిదే, ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనాల్లో జరిగింది. తాపీ ధర్మారావు నాయుడుగారు అధ్యక్షత వహించటం, మరింత ముదావహంగా ఉంది. స్వర్గీయ త్రిపురనేని గోపీచంద్ గారి నవల 'పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా'కు కేంద్ర సాహిత్య అకాడమీవారు అయిదువేలు బహుమానంగా ఇచ్చారు. ఏటేటా దేశీయ భాషల్లో అత్యుత్తమ గ్రంథానికి ఇలాంటి బహుమానం ఇస్తూ ఉంటారు. ఈతడవ గోపీచంద్‌గారి నవలకు ఈ బహుమతి లభించటం ఎంతో సముచితంగా ఉంది. ఈ బహుమతిని వారి సతీమణికి, శ్రీయుతులు బెజవాడ గోపాలరెడ్డిగారు అందచేశారు. సాహితీవేత్తలు, సాహితీ బంధువులు చాలామంది హాజరయిన ఈ సమావేశంలో ఈ నవల విశిష్టతను గురించి ప్రస్తావించబడింది. వ్యక్తి జీవించి ఉండగానే, ఆయన

57 వ పేజీ చూడండి

## ఇంటింటి పద్యాలు

ఆరుద్ర

### సరళీస్వరాలు - వక్రభ్రమణాలు

హార్మణీ వాయిస్తూ పాడే వీధి గాయకుడు
అవుతాడా ఎప్పటికైనా కాంగ్రెసు నాయకుడు
ఆనాడు రేడియో పెడుతుంది హార్మణీకి నమస్కారం
ఆనాడేనా తొలగిస్తుందా ఈ నాటి బహిష్కారం
వింటున్న రేడియో మానేసి మా సుబ్రమనియం
వింటాడు వీధిగాయకుడి హార్మోనియం
ఏతత్సమయంలో ఏతద్వాద్యం
ఏవన్నందికీ ఎంతెంతో హృద్యం
మా పొరిగింటి అమ్మాయి హార్మణీ పాఠం
మా చెవుల్లో బాదుతున్న ఇనుప గూటం
ఆ సంగీత బుల్‌డోజరు హోరు ముంచడానికి మా సుబ్రహ్మణ్యాం
అంటాడు మనకు ఆకాశవాణి సంగీతమే శరణ్యాం.



# గత జల సేతు బంధనమ్

సి. కనకాంబరరాజు

వ్యక్తిని ద్వేషించేందుకు సాదృశ్యమైన' ఒకే ఒక దుస్సంఘటన చాలు. మంచి, చెడుల సంఘర్షణమధ్య బలహీనమైన మానవ మానసిక ప్రభావం చెడుపైనే కేంద్రీకరింపబడి స్థిరీకరిస్తుంది. దానికి సంఘబలంతోడైతే మరీ అధోగతికి దిగజారి పోతుంది. నిజానిజాల విచక్షణా జ్ఞానం నశిస్తుంది. తాను ఎవరినైతే ద్వేషిస్తున్నాడో, తనకు ఎవరి తలపై అయితే ఏహ్యాభావాన్ని కలిగిస్తుందో—, వారెంత సత్శీలురైనా మనో నిర్భలత్వం దానికి ఒప్పుకోదు. పైగా విరుద్ధ బావాల్ని కల్పించి పూర్వ సాన్నిహిత్యాన్ని విరచేందుకు ప్రయత్నిస్తుంది. దానితో కుటుంబాలు కూలి పోతాయ్. జీవితాలే నాశన మవుతాయి. ఇట్టి దారుణ పరిణామాలకు దారి చూపిన నిశ్చలతత్త్వం ఎప్పుడో ఒకప్పుడు తప్పిదాన్ని గుర్తింప జేసే ఏదో ఒక ప్రక్రియతో వలింవి తిరిగి మానవత్వాన్ని పొంది సుజ్ఞానుడయ్యేసరికి కాలం మించిపోతుంది.

సాయంత్రం ఇంటికి రాగానే గుమ్మంలో పడి ఉన్న ఉత్తరం మీది అక్షరాల్ని చూసి, అదెవరి దగ్గర నుండి వచ్చిందో వూహించుకుని కాలితో ప్రక్కకు నెట్టేశాడు 'అంబరం'. మరికాసేపటికి మనోవ్యథ నివారణకై చేతులోకి తీసుకోక తప్పలేదు.

'ప్రియమైన శ్రీ అంబరం గారి పాద పద్మాలకు నమస్కరించి కడ సారిగా వ్రాయులేఖ, నా జాబుల్లో మొట్ట మొదటిసారిగా మీ పేరున సంభోదించి వ్రాస్తున్నందుకు ఈనా సాంప్రదాయ విరుద్ధమైన చివరి లేఖలో నన్ను క్షమించండి.'

ఈ క్రొత్తదనానికి ఇంకా ముందుకు చదవాలనే అనిపించింది.

'పుట్టింటి కొచ్చిన లగాయితూ వారానికో ఉత్తరం చొప్పున వ్రాస్తున్న నా ఉత్తరాల్లో ఏ ఒక్కదానికి నీ నుండి సమాధానం లేక పోయినా ఇంకా క్షీణించని ఆశ నన్నెందుకో పురికొల్పుతోంది. నా శక్తిని పరీక్షించేందుకు మీరిచ్చిన కఠిన పరీక్ష అని ఇన్నాళ్ళ వరకు వోపిక పట్టగలిగాను. ఎంత కఠినత్వానికైనా ఒక హద్దు ఉంటుంది. క్షమించండి, హృదయంలో రంపపుకోత నోర్చలేక నేను ఎంత వద్దనుకుంటున్నా కలం ఏవేవో మాటల్ని ఉపయోగించేస్తోంది. మీ నుంచి వినగల్గే ఏదైన ఒక్క మాటకోసం క్షణక్షణానికి కళ్ళు కాయలు కాచేలా ఎదురు చూస్తున్నాను. ఈనా నిరీక్షణలో నీరసించిన నా కళ్ళల్లో నీళ్ళు కూడా నిలవడం మానేశాయి. దినదినానికి నీరులేని, నారులా కృశించి వాడిపోతున్నాను. ఎన్నటికైనా నా 'దేవుడు' కరుణించక పోతాడా ? అని కాని, నాకా అదృష్టం లేదనే నిశ్చయం ఇప్పుడిప్పుడు నాటుకు పోతోంది. నా కోసం కాకపోయినా 'మీ పాప' కోసమైనా— కనీసం శుభాశీస్సులను పంపవచ్చునే ? దానికి కూడా నోచుకోలేదా నేను ? అంత తగనిదా మీ పాప ?

ఒక నాడు జరిగిన అత్యాచారానికి నేను నిర్దోషినని మీకు తెలుసు. దానికి ఆపై చూపిన మీ ఆదరాభి మానాలే తార్కాణం. అది ఇంకా మీ మనసులో మెదులుతుంటే నేను నిష్కల్మషనని విన్నవించుకుంటున్నాను. ఈ విషయ మెందుకెత్తుకో వలసి వచ్చిందీ అంటే, మీ ఉదాసీనతకు ఏ కారణం దొరకక పోగా నేను మీతో సహచరించిన జీవిత పరిధిలో నా చిన్ని చిన్ని తెలియక చేసిన దోషాలనే నెమరు వేసుకుని అందులో నా పాత్ర ఎలాటిదో, దానికి మీ పరిగణన ఎలా ఉంటుందో వూహించుకుంటున్నాను. నేను ట్రైనెక్కుతున్నప్పుడు మీరన్న మాటలు హృదయ స్పందన మాగేవరకు నీడిపోవు. "లలితా, 'నా' అన్నవారందర్నీ వదలి నిన్ను కావాలని చేసుకున్నాను.— అంటే నిన్నెంతగా ప్రేమించానో మరచి పోగలవా ? అహా.... మరేం లేదు, ప్రకృతి— కాలం— మనుషులు వీటికి చాలా దగ్గర సంబంధముంది. కాని, వాటితో పాటు స్వచ్ఛమైన ప్రేమ భ్రమించబోతే పతనమైపోతాం కదూ ? మళ్ళీ ఎప్పటికో మనం తిరిగి కలుసుకునేది ? ఆ రోజు కోసం ఇద్దరం ఎదురు చూద్దాం." నా మీద నున్న అనురాగమే ఈ మీ మాటలకు కారణమని పొంగి పోయాను. అప్పటిలో ఎంతో మనస్సంతుష్టిని కల్గించినా, ఇప్పుడు వాటిలోని గూఢమైన విచిత్ర భావం గోచరిస్తోంది. మనసు వికలమైపోగా గుండె తరుక్కు పోతుంది. వయసుకు మించి చదువుకున్నవారు, సంస్కారులు, మనస్సులను చదువ గల్గినవారు, సద్బోధకులైన మీరు చిర పరచితమైన ఒక అబల మనస్సు నర్థం చేసుకోలేక పోయారంటే నేనెలా నమ్మేది ? మీలో అల్లుకుపోయిన ఈ వికృత లతా వికల్పానికి హేతువేమిటో ఎంత తల బద్దలు చేసుకున్నా బోధపడదు. నమ్మకంలో ఇంత ద్రోహ ముంటుందని, అమాయకత కింత క్రూర శిక్ష విధింప బడుతుందని కలలో కూడా అనుకోలేదు.

ఉత్తరం నిడివిగా ఉందని, క్రిందటి ఉత్తరాల్లోని సారాంశాన్నే ధోరణి మార్చి విపులీకరిస్తున్నానని విసుగు చెందక ఈ దీనురాలి మీద కొంచెం దయ ఉంచి చివరి దాకా చదవమని కోరుకుంటున్నాను. ఇక మీద ఇలాటి ఉత్తరాలు వ్రాసి మిమ్మల్ని బాధించ దలచుకోలేదు. నా ప్రార్థన మన్నించమని వేడుకుంటున్నాను.

మీపై కేంద్రీకరించిన మనసు మరోవిధంగా ఎటూ మరల్చుకోలేక పోతున్నాను. అర్థం తెలియని అమ్మ అంటుంది—నే సత్యాగ్రహం చేస్తున్నానని. తడారి పోయిన పెదవులు బీటలువారి నా స్థితిని గుర్తు చేస్తుండగా పెదవి విరుస్తాను. దాన్ని నవ్వుగా భ్రమ పడుతుంది అమ్మ. అమ్మ నా నుండి అంతకంటే ఏమీ ఆశించదు. వాళ్ళకు కావలసింది నా నవ్వు. దాని కోసం ఎంత తాపత్రయ మన్నా పడతారు. ఎంతసేవైనా చేస్తారు. కాని, నాది మొక్కవోయే జీవితమని, దాని 'ప్రాణం' లేకుండానే పూవు పూయదని వాళ్ళ కెలా తెలుస్తుంది ?

పాప పుట్టగానే మీరు తప్పకుండా వలిస్తారని, మీరు తప్పక వస్తారని, కనీసం ఉత్తర ప్రత్యుత్తరాలన్నా జరుపుతారని ఆశించాను. సంసారం సుఖమయ మవుతుందని సంతోషంతో ఎదురు చూసాను క్రొత్తలో, ఆ తర్వాత ఘోర తపస్సే చేస్తున్నాను. పాప కల్గిన సంతోషానికంటే దుఃఖమే అదిక మవుతోంది. బ్రతుకు ఇంకా భారమైపోయింది.

కన్నీళ్ళనే సిరా చేసుకుని సవిత్రతను మీ పాదాల ముందుంచుదామనుకున్నాను ముందు చెప్పినరీతిగా ఎండబారి శుష్కించిన కళ్ళల్లో నీళ్ళెక్కడుంటాయి ? "బహిర్ప్రాణం" యోగక్షేమాలు తెలియకుండా యింకా పిచ్చిధైర్యంతో జీవిస్తున్నాను అంటే దానికి కారణం 'పాప'. మిముపోలిన పాప ముఖంలో మీరు కనిపిస్తున్నారు. అదే నాకు ఎక్కడ లేని ధైర్యాన్ని ప్రసాదిస్తోంది. అందుకే కృశించిన చేతులు కదలాడుతున్నాయి. పాపలో మీ ప్రతిబింబం తోచినంతదాక గుండె అల్లల్లాడుతూనే వుంటుంది. అయినా, యీ ఉద్వేగాన్ని ఆపేందుకు చిన్ని చెలియకట్ట ఏ మాత్రమాగుతుంది ?

'విలాపవతి 'గా సృజింప బడడానికి నే చేసిన ఘోరపాప మేమిటి ? ఏమిటి నే చేసిన పాపం ? ఆడదానిగా పుట్టడమే తప్పా ? ఒకప్పుడు అధరాల్లో మధురానుభూతుల్ని చవిగొంటూ నీవేనాల కిష్టమన్న భర్తను పొందడం తప్పా ? నా కోసం, ఉన్నత వంశంలో నుండి మెట్టుదిగి కులాంతర వివాహం చేసుకున్న ఒక ఆదర్శమూర్తిని నేను పతిగా పొందింది మూడు రోజుల ముచ్చట కోసమేనా ? ఎంత తర్కించుకున్నా నా నేరం, నా అపరాధమేమిటో తెలియడం లేదు. హృదయాని కెంతని సర్దిచెప్పుకోను ? పుట్టింటికి వచ్చిన నేను మీకు కొంచెం తెరపివ్వగానే, అంత త్వరలో మన బాంధవ్యాన్ని ఎలా మరచిపోగల్గారు మీరు ?

వివాహ పూర్వం, వివాహానంతరం ఎన్ని సాయంత్రాలు మనం బీచ్‌లో గడిపాం ? అక్కడివి రోజూ కూర్చునే యిసుక తిన్నెలే. రోజూ వీచే కెరటాల మీది చల్లని గాలే. మీరన్నట్లు నా అధరాల్లో రోజూ కనిపించే అరుణారుణ అస్తమయ సూర్యుడే అక్కడ వుండేవి. ఏరోజు మనం క్రొత్తదనాన్ని చవి చూడకుండా పోయింది ? వింత ఆనందాన్ని అందిస్తూ మనల్ని పరవశింపజేసే వాతావరణాన్ని ఇంత తొందరలో ఎలా విస్మరించ గలిగారు మీరు ?

గతాన్ని ఒక్కసారి స్మరించండి. నన్ను మీ సాధ్యాపకుడి చెల్లెలిగా యదార్థాన్ని గ్రాహించుకోండి. మొదటిసారిగా మనమధ్య నిలిచిన తీక్ష దృక్కుల్లోని మవునాన్ని, మూగ భాషను గుర్తు తెచ్చుకోండి. మీ మనస్సును సాక్ష్యమడగండి. ఎవరు ఎవరిని కావాలనుకున్నారో ? అప్పటిలో లోకమెరుగని ముగ్ధను నేను. ఇప్పుడైతే మీరన్నట్లుగా కాలం — దానితోపాటు భ్రమణమొందే జీవన నిర్వచనాన్ని వెతుక్కుంటూ ప్రకృతి సహజాన్నెరిగిన మోదితనయ్యాను.

మీమిత్రుడు మా అనుయా మన వివాహా

బొంబాయి ఆంధ్రమహాసభ కథలపోటీ
కన్సొలేషన్ బహుమతికథ

విషయంలో ఏ మన్నారు ? కులాంతర వివాహాలు మా వంశంలో లేవని, అంత తెగించలేమని అనలేదూ. అప్పుడు మీరేమన్నారు ? ' లలితను భార్యగా స్వీకరించే భాగ్యం నాకు లేకపోతే యిలానే బ్రహ్మచారిగా వుంటానని, నేనసలు పెళ్ళిమాటే తలపెట్టనని '. మరో ఐదు సంవత్సరాలు అన్నమాటపై నిలబడి మావారిని ఒప్పించి కులాంతర వివాహం కావాలని చేసుకోలేదూ ? ఒకవేళ యిప్పుడు కులాధిక్యత తెల్లనై మనసు మార్చుకున్నారా ? దీనికెవరు కర్తలు ? ఎవరు బాధ్యులు ? ఎవరు దీని పరిణామానికి వ్యధితులు ?

నన్ను వియోగంతో హింసించడానికా మీరు నన్ను అర్ధాంగిగా చేసుకుంది ? నామీద జన్మజన్మల పగతీర్చుకునేందుకేనా నన్ను మీ భార్యగా కట్టుకున్నది.? కారణం లేకుండా నన్నింతగా హింసించడం న్యాయమేనా ?'

అక్కడ వరకు చదివి — ' హు .... ' అని హుంకరించి ఉత్తరాన్ని విసరి కొట్టేశాడు. ' కారణం లేదట యీ హింసకు ...... ఆ సమయంలో నిజంగా చిత్రవధ చేసి వుండాల్సింది. ఎంత నిలద్రొక్కుకో గల్గితే యీ రోజు తాను భూమ్మీద నిలబడిందో గ్రహించుకోలేక పోతోంది........ ''

లేఖలోని విషయాల్లో నిజానిజాలను విచారించడం పోయి "ఆడది ..... ఛీ ... ఛీ !" అని చీదరించుకున్నాడు.

"ప్రతిష్ఠ మంటకలుపుకొని, కులాన్ని కుంపటిలో పెట్టి ఎంత త్యాగం చేశాను ? చివరకు నా కెలాంటి మచ్చ తెచ్చిందీ ' తుచ్ఛ ' ? తెల్లనివన్నీ పాలు, నల్లనివన్నీ నీళ్ళు అని ఎంచుకుని, అలానే ప్రేమించి ' దీన్ని ' చేసుకోబట్టి కదా నలుగుర్లో తలెత్తుకోలేక, పోతున్నాను ? అటు కుటుంబ మర్యాదకు నోచుకోలేక, ఇటు సంసారిక సుఖాన్ని పొందలేక రెంటికీ చెడ్డ రేవడిలా భ్రష్టుడ్నయాను. దీనికెవరు కారకులు ? — హృదయాన్నర్పించి నీవేనా సుఖంగా, నా జీవన జ్యోతిగా వెలుగు చూపిస్తావని భావించు కున్నానే ..... ! అందుకు ఇదేనా ఫలితం ...... ? నన్నీస్థితికి త్రోసి ఇంత నికృష్ట జీవితం గడపమని వెళ్ళిపోయి ఉత్తరాల్లో ఉపశమనం చేసేందుకు చూస్తున్నావా లలితా ....... ! నీవే నా సర్వస్వంగా నమ్ముకుని నిత్యం నీ నామస్మరణాన్నే చేస్తూ, నిత్యం నిన్నే ఆలోచించుకుంటూ కాలం వెళ్ళబుచ్చే వాడినే ........ ? నన్ను కృంగదీసేందుకు నీ మనసెలా.. ఒప్పింది ? ఎంత అన్యాయం చేశావు లలితా, ఎంత అన్యాయం చేశావు ?"

టేబులు మీద తలవుంచి విలపించాడు పిచ్చివాడిలా తనలో తాను మాట్లాడుకుంటూ అంబరం.

అప్పుడే ప్రవేశించిన ' రాజు ' అతని భుజం మీద చేయి వేయగా, కళ్ళు తుడుచుకుంటూ అతని వైపు తిరిగాడు.

" ఏమైంది అంబరం .... లలిత దగ్గర నుంచి ఉత్తరమొచ్చిందా ? "

' ................ ' అంబరం మాట్లాడలేదు.

నలిగి మూలగా పడివున్న ఉత్తరం మీద దృష్టి కరించాడు అంబరం కలత తెలిసిన రాజు.

" అంబరం ......., లలిత నీకు తీరని ద్రోహం చేసిందని పట్టరాని కోపంతో విడువరాని వేదనతో సతమతమై పోతున్నావు. అది సరే ....., నీ మనసులో ఆమెపై ఎంత ద్వేషమున్నా ఉత్తరాల్ని చదవకుండా ఉండ గలుగుతున్నావా ? దీన్నిబట్టి నీ మనసునే సాక్ష్యమడుగు నీ వెంతగా లలితను ప్రేమించావో .......... ? అంత గాఢంగా నాటుకున్న తల్లి వేరును పెరికి వేసేందుకు ఎలా ప్రయత్నించ గల్గుతున్నావ్ ................ ? ఒకవేళ ప్రయత్నించినా ఎంతవరకు సఫలమవుతుంది నీ యత్నం... నీ ఆత్మహత్యా ప్రయత్నంలో ప్రాణాలకు తెగించి సముద్రంలో పడి జన సహాయంతో నిన్ను రక్షించ గల్గిన లలితనా నీవు శంకించేది ? నువ్వు అంటావు అది ఆత్మహత్యా ప్రయత్నం కాదు ప్రమాదవశమని. పోనీలే ......... అలానే అనుకుందాం. ఆమె అనురాగాన్నవలోకించి కించిత్తు నిజాన్ని గ్రహించగల్గేవాడవైతే యీ మనస్తాపమే వుండదు. కాని, దేవుడు నీకా శక్తి నివ్వలేదు కాబోలు ! లలిత నా చెల్లెలనే అభిమానం కొద్దీ ఎలానైనా కాపురం నిలబెట్టాలనే వుద్దేశ్యం కొద్దీ నేనిలా బోధిస్తున్నానని నువ్వనుకోవద్దు. నా మనసు నీకు బాగా తెలుసు. నేనవునన్నదాన్ని నువ్వెప్పుడు కాదనలేదు. లలితను నువ్వు ద్వేషిస్తున్నావంటే అర్థం లేదు."

" రాజూ ........ " గర్జించాడు అంబరం.

" ఈ జన్మలో నాకు సుఖం లేదు. నేను సర్వనాశనమై పోయాను. ఇంకా ' దాని ' పేరెత్తి నువ్వు మన స్నేహానికి దూరం కావడం నా కిష్టం లేదు. నన్ను మన్నించు రాజూ ......... ! "

56 వ పేజీ చూడం



# సరాగమాల — వి.ఎ.కె. రంగారావు

శ్రీ తిరుపతమ్మ కథ జి ఇ 35412

కొన్ని పాటలలో రచన అత్యుత్తమంగా ఉండి వరస అదొక మాదిరిగా ఉంటుంది. మరికొన్ని పాటలలో ఈ సూత్రం తారుమారై యింపైన వరసలో నింపబడిన మాటలు పేలవంగా ఉంటాయి. మరికొన్ని అరుదైన సమయాల్లో రెండూ సమాన స్థితిగతుల్లో నడుస్తూ సన్నివేశానికి అత్యంత సన్నిహితంగా, జరుగుతున్న కథలో ఒక భాగంగా ఉంటాయి. ఇటువంటి పాటలే "పిలిచిన బిగువటరా" "మనసున మల్లెలు" మొదలైనవి. ఇంకా కొన్ని తరహాల పాటలు సాహిత్యం వరసా సరిగా కలిసినా సందర్భోచితంగా చిత్రంలో ఉండకపోవటం వలన తమ ఉత్కృష్టతను కొంతవరకు కోల్పోతాయి. ఈ కోవకు చెందిన పాటే నార్ల చిరంజీవి రచన "తీయని విరాళికి" అన్నది. కోరిన మగవానికిగాని మగువకుగాని మరులు కొల్పటానికి మందులున్నాయని అంటారు. ఉంటే అవి వేర్లు, మూలికలు కావు. ఇటువంటి రచనలే అయివుంటాయి.

"తీయని విరాళికి నీవెలి నివాళిరా
దాచుకున్నాను నీరూపే నామనసులో
వేచియున్నాను యిన్నాళ్ళు నీకోసమే
కన్నుల కైపు, తీయని వలపు
నీదనుకో కాదనకు రావేరా"

అయిదు పంక్తులలో యింతటి శృంగారం అమరించిన నార్ల చిరంజీవి ఘనుడు. సంగీతానుసరణ, స్వరక్రమం పూర్తిగా పాశ్చాత్య పద్ధతిని రససిద్ధి కలిగిస్తున్నాయి. ఇది రికార్డుగా వినటానికి యింపుగానే ఉన్నా చిత్రంలో సందర్భ శుద్ధి లేకపోవటం మూలాన కంటగింపుగానే ఉంది. దీనికి మరొక కారణం పాట మొదట్లో కొంత "కహి దీప్ జలీయం" కొంత ఉండటం. సంగీత దర్శకులు, అందులో పామర్తి వంటి శాస్త్రీయ సంగీత పారీణులు యింత పనిచేశారంటే విచారించదగ్గది. ఇక పాడిన సుశీల గురించి ఒకే ఒక వాక్యం. ఆమె స్వన మాధురి ముందు గంధర్వులే తలవంచాలి.

రెండవ ప్రక్క పి.లీల పాడిన విషాద గీతం "పూవై విరిసిన పున్నమి వేళ నా కనులందే చీకటులేలా". ఈ పాట జాలిగా సారంగి విలాపాల విన్నపాలతో మొదలవుతుంది. శాస్త్రీయమైన నడకతో కూర్చబడిన విషాద గీతాలను పాడటానికి లీల సాటి గాత్ర లీల మరి లేదని బుజువు చేస్తుంది. సి.నా.రే కలం శృంగారమే కాక విరహంకూడ ఇంత మనోజ్ఞంగా ధ్వనించటం "ఒంటరినై పోయాను యిక యింటికి యేమని పోనూ" తరువాత యిదే ప్రథమం.

* * *

3—4—64 పత్రికలో ప్రచురింపబడిన వాల్తేరు సోమసుందరంగారి లేఖ చదివాను. వారి భావం నాకవగాహన కాలేదు. నేను విమర్శించినది "మదనా మనసాయెరా" పాటలో సాహిత్యాన్ని కున్నంత స్థాయి ఆ వరసకు లేదని. వారి ఉత్తరంలో ఉన్న మరొక వాక్యంలో అసలే అర్థం కనపడటం లేదు.— మరి ప్రత్యేకం డబ్బుకోసం నీచమైన వృత్తి చేస్తూ పాటలుపాడే ఒక సాధారణ వేశ్య అంతకంటే మంచి పాట పాడుతుందని ఎలా అనుకున్నారు మహాశయా—అని వారి ప్రశ్న. ఒక పాత్ర వృత్తి నీచమైనదా కాదా అని నిర్ణయించే హక్కు విమర్శకులకూ లేదు పాఠకులకూ లేదు. సినిమాలలో గాని, రచనలోగాని, ఆఖరికి సమాజంలోగాని నీచమైన వృత్తి అని నిర్ణయించగలిగినది ఆ వృత్తి చేస్తున్నవారేగాని పైవారు కాదు. 'దాని వృత్తి చేద్దామనే నిర్ణయం నీచమైనది కావచ్చు కొందరి దృష్టిలో. కాని ఆ నిర్ణయానికివచ్చిన తరువాత సామాన్యులలో రసికానుభూతి కలిగించటం,— రసికులను విటులుగా మార్చటం, ఆ విటులను తన వలలో చిక్కించుకొనటం, యివన్నీ నీచమైనవి కావు. త్రికరణ శుద్ధిగా చేస్తే, పాప పుణ్యాల సంగతి దేవుడెరుగు, దేవాలయంలో పూజారి చేసే అర్చనాదులకూ, వారకాంత శృంగార క్రీడలకూ, కొందరి రచనా వ్యాసంగాలకూ, యింకొందరి హరి కథా కాలక్షేపాలకూ ఉచ్చ నీచాల తేడా యేమీ లేదు. వీటికి సమాజం నిజం తెలుసుకోకుండా, తెలుసుకున్నా నిజాన్ని మరుగుపరచాలని, ఆపాదించే రంగుల్లో తేడా ఉండవచ్చు. ఇదీ సంగతి.

కాగా తన 'విటుని' చిత్తాన్ని కొంతవరకు పరోక్షంగా తెలుసుకున్నది కాబట్టి నీలనాగిని ఆదినే "శివ దీక్షా పరురాలనురా" అనే నెపంతో శృంగారాభినయం చేసింది. ఏకాంతగా అద్దంలో తన సహజ లావణ్యాలను ప్రదర్శిస్తూ "మంచి దినము నేడే" పాడింది. ఈ స్తోత్రమత గల వేశ్య, యెంత డబ్బుకోసం వృత్తి చేసేదయినా (డబ్బు కోసం యేదో ఒక వృత్తి నవలంబించని వారు యెందరున్నారు?) హిందీ పాట వరస అనుకరిస్తుందంటే, అందులో అంత ఎక్కువ సాహిత్యం పాడబోతున్నప్పుడు, పాత్రోచితంగా లేదు. ఈ పాత్రల సంగతి అంతా మరచి చూద్దామన్నా, ఆ సాహిత్యానికి ఉన్న విశిష్టత ఆ పల్లవి వరసకు లేదు. ఇదే వరసకు "మనసులాగే ఆ నాతనువూగే" వంటి డబ్బింగ్ పాటలుంటే ఈ ప్రశక్తి వచ్చేది కాదుమరి.

ఉత్తరం చివరన "పాటలోని సాహిత్యం యెటువంటిదైతే గాక" అన్నారు. అంటే ఆ సాహిత్యం చిన్నచూపు చూడ దగిందని అభిప్రాయమైతే దానిని నేను తీవ్రంగా ఖండిస్తాను. ఆ పాటలో మెరిసేది యేదయినా ఉంటే అది సాహిత్యమే.

* * *

గుడిగంటలు జి ఇ 35431

రచనలో శృంగార రసానికి మరో పేరు సి.నా.రే. కలం అని యెందుకన్నారు? ఇందుకు!

"నీలి కన్నుల నీడలలోనా
దోర వలపుల దారులలోనా
కరిగిపోయే తరుణమాయే
అందుకో నన్నందుకో

ఇంతే కాదు. "నీడని జంటగ రమ్మని, పసివాడని పూలై పొమ్మనీ పచ్చిక పానుపు వెచ్చగా పిలిచిందట. ఈ పాటంతా వింత పులకింతలు కలిగిస్తూ ముందుకు సాగుతుంది. ఎప్పటిలాగానే హిందీ వరసను తీసుకున్నా ఉన్నంతలో అందంగా చేశారు



బొంబాయి ఆంధ్ర మహాసభ వారు గత బుధవారం శ్రీ అక్కినేని నాగేశ్వరరావుకు సన్మానమిచ్చినప్పుడు తీసిన ఫోటో. ఎడమనుంచి కుడికి: శ్రీయుతులు లోవెల్, వి. ఆర్. స్వామి, శ్రీమతి అన్నపూర్ణ, నాగేశ్వరరావు, పృథ్వీరాజ్ కపూర్, బందూక్‌వాలా.

ఘంటసాల. వరసకు వ్రాయటమైనా అంత అందమైన మాటలు ఒడిపినందుకు సి.నారాయణ రెడ్డి అభినందనీయులు. ఎప్పటిలాగా సినిమాకొక (రాజా— శ్రీ, లక్ష్మి సంస్థల) యుగళ గీతంపాడే సుశీల శ్రీనివాసులే ఈ పాట పాడారు. ఇక ఈ జంటకు వసంతకోయిల లంటేనే బాగుంటుంది. మరో పేరు వారికిన్యాయం చేయదు.

రెండవ ప్రక్క సుశీల పాడిన ఆరుద్ర రచన ఆ కలానికి ఉండవలసిన బలం లేదు. అయితే, ట్యూన్‌కి వ్రాయబడిన పాట మరి. ఈ ఒకింత లోపాన్ని సరిజేసింది సుశీల 'హోహో హో' అనటం.

* * *

మర్మయోగి ఎస్ 69797

ఈ మధ్య జమునారాణి పాడిన ప్రతి పాటా ఆనోటా-ఈనోటా ప్రాకి పెద్ద 'హిట్'లై పోతున్నాయి. అందులో ఘంటసాలతో పాడిన యుగళ గీతం "రావాలి రావాలి" అనే దొకటి. ఆరుద్ర రచనలో పెద్ద కొత్తదనం లేదు. కొంత నాజూకైన మెత్తదనం ఉంది. ఘంటసాల వరసలో గాని వాద్య గోష్ఠిలోగాని నవ్యత లేనేలేదు. ఏనాడో విన్న మనసులు దోచుకున్నా, హాయికి ఆనాడు పర్యాయపదమైన, పాటలా, జ్ఞప్తికి వచ్చీరాని మధుర స్మృతిలా, తీయని కలల అలలలో తేలిపోతున్నది. ఇంత వింత సొబగుకు కారణం జమునారాణి, ఘంటసాల అని వేరే అననక్కరలేదు. విన్న ప్రతి వ్యక్తికీ ఆ విషయం తెలిసే ఉంటుంది. మండు టెండ, మంచి గంధం, వేసవి రేయి — వెన్నెల హాయి, మల్లెల మాలలు — మనోరమణుని సాన్నిధ్యం, తీయని మోవి—తీరని యావి — వీటి కలయిక; ఘంటసాల జమునారాణి కలయిక.

రెండవ ప్రక్క చాలా సున్నితమైన, సుందరమైన, సురుచిరమైన, స్నిగ్ధమైన, పడవ పాట "నవ్వుల నదిలో పువ్వుల పడవా" పి.లీల కంఠంలో యీ పాట యెంత ప్రశాంతతను, ప్రణయ కాంతులను, ప్రేమ లీలలను సంతరించుకున్నదీ తెలుసుకోవాలంటే పాట వినాలి మరి.

## మద్రాస్ సినిమా వార్తలు

### సెట్టుమీద శ్రీ "సింహాచలక్షేత్ర మహిమ"

అనవసరం పురూరవ చెలికాడు. ఇద్దరూ వేటకు బయలుదేరుతారు. అనవసరం స్త్రీ సామ్రాజ్యంలో ప్రవేశిస్తాడు. అనవసరాన్ని స్త్రీ సామ్రాజ్య సైనికులు బంధిస్తారు. స్త్రీ సామ్రాజ్య మహారాణి ముందు దర్బారులో హాజరు పరచడానికి తీసుకు వెళ్తారు.

"శ్రీమత్ ప్రతాప— మంత్రీ సమేత— శృంగార వదనా— రాయుంచగమనా— తారాచకోరీ బాలకుమారీ ..... శ్రీ శ్రీ శ్రీ పురుష ద్వేషిణీ మహారాణీవారిరాక— బహు పరాక్

బహు పరాక్...— "ధ్వనుల మధ్య మహారాణి సింహాసనాన్ని అలంకరిస్తుంది. అనవసరాన్ని హాజరు పరుస్తారు. మొగవాడంటే తెలియని అమాయక స్త్రీ సామ్రాజ్య మహారాణి అనవసరాన్ని చూసి "ఈమె ఎవరు? విచిత్రముగ నున్నదే? ఏమే నీవు కూడ నీ భర్తకు కొరకు కలవరించుచుంటివా?"

"లేదు మహారాణి మీరు చెప్పిన దానికి తారుమారు."

"అనగా?"

"అనగా భర్తకోసం గాదు— కాబోయే భార్య కోసం కలవరిస్తున్నా......."

"కటా. కటా! బల్ ముచ్చటగ నున్నదే."

మంత్రి కలుగజేసుకుంటుంది. " 'ఉన్నదే' కాదు మహారాణీ! 'ఉన్నాడు' వాడు "స్త్రీ" కాదు. పురుషుడు."

"ఇదిగో ఫడాల్— ఫడీ— వీడూ— వాడూ అని ఏక వచనం ప్రయోగించావంటే మర్యాద దక్కదు."

"కటా. కటా! పౌరుషము కలవాడేనే......."

"ఆఁ పురుషుణ్ణేగా! వీరుణ్ణికూడా.————"

"వీరుడో — బోరుడో— ముందు వాడిని విచారించి శిక్ష వెయ్యండి." మంత్రి సలహా ఇచ్చింది.

"అటులనా. అందగాని అపరాధమేమి?"

"మన రాజ్యంలో ప్రవేశించనడమే ఘోరాపరాధం"

"కటా! కటా! నీ పేరేమి?"

" అనవసరం"

63 వ పేజీ చూడండి



"అమరశిల్పి జక్కన్న"లో బి. సరోజాదేవి.

# ఎండమావులు

### హరికిషన్

## జ రి గి న క థ

జానకిరాం ఎం. ఏ. పాసయినా ఉద్యోగం చెయ్యకపోవటం అతని భార్య గౌతమికే కాక తలిదండ్రులకు కూడా బాధ కలిగిస్తుంది. జానకిరాం అన్న కృష్ణమూర్తి జబ్బు మనిషి. అతని భార్య స్వాతి ఉద్యోగంచేసి ఇద్దరినీ పోషిస్తూ ఉంటుంది. స్వాతిని వివాహంచేసుకోవటంవల్లనే కృష్ణమూర్తి తలిదండ్రులకు దూరమవుతాడు. స్వాతి ట్యూషన్ చెప్పే తాసిల్దారుగారి కూతురు జ్యోతి మేనత్త కొడుకు మురహరి. తల్లిపోయిన తర్వాత జ్యోతిని పెళ్ళిచేసుకొనవలసిందని మేనమామ కేశవరావు మురహరితో చెబుతాడు. విశాఖపట్నంలో పరిచయం అయిన జయలక్ష్మి పట్ల ఆకర్షింపబడుతాడు మురహరి. గౌతమి కోపం వచ్చి పుట్టింటికి వెళ్ళిపోతుంది. కాని అక్కడ తగిన ఆదరణ లభించదు. మురహరి జయలక్ష్మి సామీప్యానికి చాలా సంతోషిస్తాడు. జానకిరాం తన అన్న కృష్ణమూర్తి యింటికి వెళ్తాడు. అన్నా, వదినెలు చాలా మంచివారని చెల్లెలితోనూ, తల్లితోనూ చెప్తాడు. స్వాతి విషయం తనవద్ద తేవద్దని తల్లి మండిపడుతుంది. నగేంద్ర బాల గౌతమికి తన కథ చెబుతుంది. పరిషత్తులో ప్రయోగించని వీణకు బహుమతి లభిస్తుంది. మురహరి జయలక్ష్మి పెళ్ళిచేసికొనలేకపోతాడు. స్వాతి తాసిల్దారుగారింట్లో సమస్యలనెదుర్కొంటుంది. పుట్టింట్లో బాధల ననుభవిస్తున్న గౌతమి ఉద్యోగం చేయాలనే నిశ్చయానికి వస్తుంది. జయలక్ష్మి తన వైధవ్యపు గాథనంతా మురహరికి చెపుతుంది. తన ఇంటికి వచ్చిన జ్యోతిని, స్వాతి సముచితంగా సత్కరిస్తుంది. అస్వస్థుడైన మురహరికి, జయలక్ష్మి సేవలు చేస్తుంది. సెలవులివ్వగానే, ఇరువురూ స్వగ్రామాలు చేరుకొన్నా, ఒకరిని ఒకరు కలుసుకోలేకపోతారు... గౌతమి తాను చేసినపనికి చింతిస్తూ, భర్త జానకిరాంకు ఉత్తరం వ్రాస్తుంది. అప్రయోజకుడై పోతున్నాడని, జానకిరాంను తండ్రి మందలిస్తాడు. జానకిరాం ఇంట్లో చెప్పకుండా వెళ్ళిన నగేంద్రబాలను కల్సుకొని ఆమె ద్వారా అన్ని విషయాలు తెల్సికొంటాడు. తనకు తానుగా గౌతమివస్తే స్వీకరించటానికి సిద్ధంగా ఉన్నాననికూడా చెప్తాడు.

(గత సంచిక తరువాయి)

జ్యోతి ఆలోచనలో పడ్డది. తల్లి మనోకాంక్షకు ఈ సంఘటన అగ్నికి ఆజ్యం తోడయినట్లయింది. ఈ సంఘటనని సంపూర్తిగా వినియోగించుకుని ఆమె భర్తతో చెప్పి ఇంక మేనల్లుడి విషయంలో అభిప్రాయం మార్చుకోమని చెపుతుంది. జ్యోతి ఆలోచన ఇంకా ముందుకు పోయింది. ఇద్దరూ మూడేళ్ళనుంచీ కలిసి చదువుకోటం చేత తప్పక బావ జయలక్ష్మిని ప్రేమించే ఉంటాడు. అందుకనే ఇన్ని నెల్లనుంచీ కూడా తనంటే ముభావకంగానే ఉంటూ వచ్చాడు. అందుకనే మురహరిని చూడాలనే వంకతోనే జయలక్ష్మి పదేపదే వస్తున్నదేమో, ఈ రాక అతనికోసమే కాని తనతో స్నేహం కోసం కాదు.

ఎవరూ ఊహించనటువంటి ఈ సందర్భాలన్నీ తన మనస్సులో చిలవలు పలవలుగా ఊహించుకుంది జ్యోతి. జయలక్ష్మి మీద ఆమెహృదయంలో క్రోధం పొడచూపింది. అసలీ జయలక్ష్మి ఎవరు. ఆమె పుట్టు పూర్వోత్తరాలేమిటి? మానవుని జీవితంలో తనకు అత్యంత ప్రేమగల వస్తువు ప్రాప్తించటంలో ఏదైనా ప్రతిష్టంభన వస్తే సందేహాలకు అంతు ఉండదు. అవే జీవిత గమ్యాన్ని మార్చి వేసే సంఘటనలయితే ఇంక ఆ వ్యక్తి పడే ఆత్మక్షోభకు అంతు ఉండదు.

మళ్ళా మళ్ళా ఆలోచించింది జ్యోతి. సంగతి సందర్భాలు తెలుసుకోకుండా తల్లి మాదిరే తను కూడా అనుమానాల ఆధారంతోనే మనస్సుని కలుషితం చేసుకుంటే ప్రతి చిన్న సంఘటనా కాలుష్యంగానే కళ్ళకు కనిపిస్తుందనుకుంది. ఆ అద్దానే తన విస్తట్లోకి దొర్లిస్తే బావ తనను నిజంగా ప్రేమిస్తున్నట్లేనా? స్వాతి విస్తట్లోకి దొర్లితే ఆమెను వాంఛిస్తున్నట్లేనా? అద్దాం దొర్లినంత మాత్రంచేత మానవ హృదయాలూ, మనస్తత్వాలూ తెలిస్తే ఇంక జీవితంలో తెల్సికొలేని సంఘటన అంటూ ఏదీ ఉండదు. ఒక సంఘటనకు అనేక అభిప్రాయాలు, అనేక ఆలోచనలు, అనేక వ్యాఖ్యానాలు.

తనలో తను నవ్వుకుంది. నిరాశ ఎక్కువైనపుడు, మానవుడు వంటరిగా ఆలోచిస్తూ ఉన్నపుడు పేలవంగా నవ్వుకుంటాడు. ఆ నవ్వు మబ్బుల మీద మెరపుల్లా కనిపించినా అందులో విషాదవిచారాలే పొడచూపుతయ్యిగాని సంతోషాతిశయాలు కాదు.

మధ్యాహ్నపుటెండ మండి పోతున్నది. రోహిణీ కార్తె ఆ రోజే ప్రవేశించింది. ఈ చెవులో గాలుపు ఆ చెవిలోకి కొడుతున్నది. ఆ వైశాఖ మాసపు రోహిణీ కార్తె ఎండలో ఎక్కడికో వెళ్ళిన మురహరి చెమటలు కారుకుంటూ వచ్చాడు.

వంటరిగా కూర్చున్న జ్యోతిని చూసి క్షణం ఆగి తన గదిలోకి వెళ్ళబోయాడు.

"బావా"

తలెత్తి చూసి జ్యోతి వద్దకు వచ్చాడు.

"నీతో మాట్లాడాలి. అట్లా కూర్చో"

ఎదురుగా సోఫాలో కూర్చున్నాడు మురహరి. ఇటీవల ఎన్నడూ జ్యోతికి అంత దగ్గరగా, వంటరిగా కూర్చోలేదు మురహరి.

"ఏమిటి జ్యోతీ"

నిరాశగా, నిర్జీవంగా అతని వైపు చూస్తూ "నా ప్రశ్నలకు సరయిన సమాధానం చెపుతావా బావా" అన్నది.

విచారితుడయ్యాడు మురహరి.

"చెపుతాను జ్యోతి, అడుగు"

"నేనంటే నీకు ఇష్టం లేదా"

"అని నేనన్నానా జ్యోతీ"

"నన్ను చూడంగానే ముభావకంగా వెళ్ళిపోతావ్ గాని ఒక్కసారయినా నీ అంతట నువ్వు నన్ను పలకరించి మాట్లాడవేం"

"ఏమున్నయ్యి కబుర్లు మాట్లాట్టానికి. ఒక వేళ మాట్లాడుదామన్నా అత్తయ్య వూరుకోరుగా"

జ్యోతి మనస్సులో ఏదో ఒక ఆశ పొడ చూపింది.

"అమ్మ వూరుకోదని నన్ను దూరం చేసుకుందామనుకున్నావా"

"ఆ ఉద్దేశ్యం నా కెప్పుడూ లేదే"

"జయలక్ష్మి అంటే నీకు బాగా ఎరిక కదూ"

"మూడేళ్ళుగా చదువుకుంటున్నాం గనక ఒకరికొకరం బాగా పరిచయమే."

సూటిగా చెప్పాడు సమాధానం. ఆమె హృదయంలో వేడి రక్తం పొంగులెత్తుతున్నది. అతని ఒక్కొక్క మాట మంచు గడ్డలా పడి రక్తాన్ని విరిచేసినట్లుగా ఆమె హృదయం బలహీనపడ సాగింది. హతాశమైన ఆమె మనస్సులో ఇంక రెండు ప్రశ్నలు మాత్రమే మిగిలి ఉన్నయ్యి. ఆ రెండు ప్రశ్నలూ వేసి వాటి సమాధానాలు వింటే ఇంక ఏ ప్రశ్నకూ, ఏ [illegible]కూ తావుండదు. ఆ రెండు ప్రశ్నలూ వేసి బ[illegible]ట పడాలా లేక కాలానుగతంగా వాటికి సమాధానాలు ఆచరణలో చూసి తెల్సుకోవాలా అని ఆలోచించి ఒక్క ప్రశ్న మాత్రమే వెయ్యాలనుకుంది.

"మీ ఇద్దరి మనస్సులూ కలిసినయ్యామ కుంటాను"

వీపు మీద ఛెళ్ళున చరిచినట్లయింది మురహరికి. "అవును" అంటూనే తన గదిలోకి వెళ్ళిపోయాడు మురహరి.

హృదయాంతరాలలో పరవళ్ళు తొక్కుతున్న దుఃఖం ఒక్కసారి వెల్లువలా బైటికొచ్చింది. ఇంత కాలంనుండి నిద్ర మత్తులో ఉండి, ఏవో కలలు గన్నాననుకుంది జ్యోతి.

ఆ కలల ఫలితాలు ఇప్పుడు తెల్సుకుంది. ఇన్నా

క్కా నా మనస్సులో, హృదయంలో నిండి ఉన్న ఆకాంక్షలన్నీ పొరపాట్లేనా? నా కోరికలన్నీ మిధ్యా ప్రపంచంలో కలిసి పోయినవా? వాస్తవ జగత్తులో నా జీవితంలో ఆశించిన ఈ ఒక్క కోరికా గగన కుసుమమే అయిందా? నా ఈ హృదయ కుసుమం వాడి, నలిగి, నశించి పోవలసిందేనా?

ఆలోచనలతో ఆమె కోమలమైన ముఖం ఎర్రబడి పోయి కళావిహీనమై పోయింది. నా పుట్టిన రోజుకు బావ నాకిచ్చిన బహుమానం ఇదా అని ఆమె హృదయం ఆక్రోశించింది. ఆమె స్మృతి పథంలో జయలక్ష్మి సర్వలక్షణ శోభితమై ముగ్ధ మోహన సౌందర్యాతిశయంతో హొయలు వలక పోస్తున్నట్లుగా కనిపించింది.

ఆ సోఫాలో అట్లాగే దిగాలు పడి కూర్చుండి పోయింది జ్యోతి. ఆ పరిస్థితిలో ఆమెను చూస్తూనే మళ్ళా బయటికి వెళ్ళి పోయాడు మురహరి.—

## 28

ఆ రోజున జయలక్ష్మి స్వాతితోబాటుగా వాళ్ళ ఇంటికే వెళ్ళింది. వాళ్ళు వెళ్ళే సరికి జానకిరాం వచ్చి ఉన్నాడు. విందు సందర్భంలో జరిగిన సంఘటనలతో స్వాతి మనస్సు బాగుండలేదు. అందుచేత జానకిరాంను ఎక్కువగా పలకరించలేక పోయింది. మామూలు కుశల ప్రశ్నలు వేయటం మినహా ఇంకేమీ మాట్లాడలేదు. స్వాతిని చూడగానే జానకిరాం తను గత నాలుగైదు రోజుల్నీ ఎందుకు వూరు విడిచి చెప్పకుండా వెళ్ళిందీ చెపుదామనుకున్నాడు. తన మాటలేవీ స్వాతి వినేటట్లుగా లేకపోయేసరికి "మళ్ళీ వస్తానమ్మా వదినా" అంటూ వెళ్ళిపోయాడు.

పెరటి తలుపులు తీసుకుని ఇద్దరూ వంటింట్లో కూర్చున్నారు స్వాతీ, జయలక్ష్మీ.

51 వ పేజీ చూడండి






"విప్లవం వర్థిల్లాలి. నేతెచ్చిన విప్లవం పది కాలాలపాటు నిలిచిపోవాలి. మానవాళి భూమిమీద వున్నంతకాలం నేను మార్గదర్శకుణ్ణి కావాలి. ఇది నా చిరకాల వాంఛ— నెరవేర్చుకునే రోజొచ్చింది. దురదృష్టం పారిపోతోంది వస్తున్న అదృష్టాన్ని చూసి." స్వగతం అనుకున్నాడు ఆ కవి పుంగవుడు. చాలా నెమ్మదిగా అనుకున్నాననుకున్నాడు.

కాని — అదికాస్తా వినేశాడు ఆయనకెదురుగా కుర్చీలో కూర్చుని వున్న ఓ లావుపాటి ఆకారం. దవడలు వూడల్లా వ్రేలాడుతున్నాయి. వూరిపోయిన బుగ్గల్లో కళ్లు యిరుక్కుపోయాయి.. ఆలోచనల్తో మరీ ఆవగింజంత అయిపోయింది ఒక్కొక్క కన్నూ. చీకి పారేసిన తాటికాయలావుంది ఆయన బుర్ర. మరిదాంట్లో ఏమైనా వుందీ లేనిదీ ఆయనకే తెలియాలి. ఒక విషయం మాత్రం నిజం—ఎప్పుడూ ఆలోచిస్తున్నట్టే కనిపిస్తాడు. కానైతే గట్టి పిండం అని పేరు సంపాదించుకున్నాడు అక్షరం ముక్క చదువుకోకపోయినా.

"విప్లవం అనుకుంటున్నాడేమిటి చెప్మా!" అని విస్తుపోయి, ఆ తర్వాత దాని గురించి ఆలోచన సాగించాడు.

అంతసేపూ ఆ కవిపుంగవుడు పొడుగ్గా నిటారుగా నిల్చునే ఉన్నాడు. కొంచెం సేపయినాక— తనను గురించే ఆలోచిస్తున్నాడని నిర్ధారణ చేసుకున్నాక— ధైర్యంగా 'ఏమండీ' అని పిలిచాడు.

"ఆఁ ఏమండీ!—". వూకొట్టాడన్నమాట.

"మరి — నేనండీ — ఉదయం మీకు — నేనండీ — ఫోన్ చేశానండీ — మీరు......."

నీళ్లు నమిలాడు. మాటలు నాన్చితేనయినా త్వరగా బైటికొస్తాయని. బట్టతలమీద ఓ సారి తక్కున కొట్టుకుని ఆ లావుపాటి ఆకారం మరోవైపుకు సర్దుకుని కూర్చున్నాడు.

"ఇందాక — విప్లవం అన్నారు ఏమిటది?."

ఫ్రెంచి విప్లవం గూర్చి కొంచెంగా వినివున్నాడు. అటువంటిదేమన్నానేమో — డబ్బున్న వాళ్ళలోపాటు తనూ గోవింద కొడ్తాడని భయం వేసుంటుంది.

"ఇప్పుడు వస్తున్న సినిమా కథల్లో విప్లవం తీసుకురావాలనే ప్రయత్నం ఈ కథగా పరిణమించింది.—" ఇంకా ఏదో చెప్పుకోబోయాడు ఆ కవిశ్రేష్ఠుడు.

"అంటే —" మొహమాటం లేకుండా నిర్వచనం అడిగాడు.

"అంటే —ఇప్పుడు వస్తున్న కథలకూ దీనికీ ఎక్కడా పోలిక ఉండదు. అంత బావుంటుంది. అహాఁ నాకథను గురించి నేనే ఎక్కువగా చెప్పుకుంటే బహుశా అసందర్భముగా ఉంటుంది మరి— మీరేమంటారు?"

నిక్కచ్చిగా నుడివాడు. "వద్దు పొమ్మంటాను."

తెల్లమొహం వేశాడు కవి.

"మరీ అంత తేడా— పోలికలు లేని — విప్లవం తీసుకొచ్చే ఘనత మా సినిమాకొద్దు. ఆ కథ మరోచోట అమ్ముకోండి."

"అట్లా అంటే ఎలాగండీ? ఎంతో ఆశతో వచ్చాను. ఎంతో బరువైన డైలాగులు వేశాను. మరుపురాని సన్నివేశాలలో నింపివేశాను కథనంతా. ఎంత శ్రమపడి వ్రాశానో మీకు తెలియదు— మీకు హృదయముంటేగా తెలియడానికి!" ఆక్రోశించాడు కవి, హఠాత్తుగా ఉన్నట్టుండి పెద్ద సినిమాకవి ఐపోవాలనే పేరాశతో.

లావుపాటి ఆకారానికి కరుణ కూడా ఉంది.

"అయితే— నా మాట వింటారా?"

"ఓ. తప్పకుండా వింటాను."

"మీ కథకు మీరు ఎంచుకున్న వస్తువు బాగుంది. కాని— ఆకథకు కొన్ని మార్పులు చెయ్యక తప్పదు నాలుగు రాళ్లు మిగలాలంటే—"

కవి కంగారుపడ్డాడు. "స్వామీ— మీలోనలు ఇంతవరకూ నా కథ చూడందే— అప్పుడే మార్పు అంటున్నారు !—"

ఆ ఆకారంలో చలనం లేదు. "అబ్బే !—చూసినా చూడకపోయినా లాభనష్టాల్లేవు. అయినా— మిమ్మల్ని చూశాక, మీ కథను చూడనక్కరలేకుండా దానికి మిషనుపని అవసరమని తేల్చుకోవచ్చు. ఇంతకూ— మేము చేయబోయే మార్పులూ మా డైరెక్టరుగారు చేసే మార్పులూ— సినిమా పూర్తయేలోగా ఇతరులు అనగా తారామణి, హీరో వగైరాలు — కోరుకునే మార్పులూ— మనపాలిటి యముడు సెన్సార్ మార్పులూ— ఇన్ని మార్పులూ అంగీకరించాలి. మీ కిష్టమైతే చెప్పండి—"

ఆ కవి ఎగిరి గంతేశాడు.

"తప్పకుండా అలాగే జరుగుతుంది." అన్నాడు కవిపుంగవుడు.

ఇలా జరిగింది ప్రొడ్యూసర్‌తో ఇంటర్వ్యూ.

'డైరెక్టరుకు కాకాపట్టాలి' అనుకున్నాడు కవి. అనుకున్నాడో లేదో రంయిన డైరెక్టరు తలుపు ముందు వ్రాలాడు. 'కమిన్' అనగానే, లోపల నెమరు వేసుకునుంచుకున్న డైలాగును అప్ప చెప్పాడు కవి.

"విప్లవాత్మక— మరియు సృజనాత్మకమైన కథను పామర జనులకు కూడా అర్థమగు విధంబున సులభ శైలిలో రచియించిన వాడను. మీరు ఎప్పు డైనా కొళంబు తిన్నవారైతే దీని రుచి మీకు బాగా తెలుస్తుంది. సాంఘికంలో ప్రబంధ ప్రణయాన్ని నానబెట్టాను. చారిత్రక ప్రాకృతిక దృశ్యాలను మేళవించి సాంఘికాన్ని మరింత తీపిజేసి— చివరకు పౌరాణికంగా కూడా కన్పించే ఈ కథను మీ ప్రొడ్యూసర్ అంగీకరించి మీ వద్దకు పంపారు. నేను—" ఫలానా అని పరిచయం చేసుకున్నాడు ఆ కవి.

అంతలోనే ఆ ప్రొడ్యూసర్ కాస్తా ఆ గదిలో కొచ్చాడు. ఏదో అడగాలన్నట్లు చూశాడు.

"ప్రయోగాలరావ్! ఈ కథ విందామంటావా? చదువుదామంటావా ?" అనడిగాడు. డైరెక్టరూ ప్రొడ్యూసరూ కవీ కూర్చుని ఎలాగైతే నేం కథను చదివారు. ప్రొడ్యూసర్ 'ప్చ్' మని చప్పరించాడు. అలాగే తన కథ కాగితాల్నికూడా ఎక్కడ చప్ప రిస్తాడోననే భయంతో కవిపుంగవుడు ఉలిక్కి పడ్డాడు— కాగితాలను దాచుకుంటూ.

"ఇందులో పద్యాలెక్కడ పాడిస్తారండీ?" అనడిగాడు ప్రొడ్యూసర్. డైరెక్టరు మాట్లాడ కుండా కూర్చున్నాడు. ఆయన తెలివిగలవాడు తను చెప్పినవి ప్రొడ్యూసర్ ఎలాగా వినడు. అందుకనే ఆయన ఎక్కువగా పట్టించుకోడు—కథ విషయం. ఎందుకంటే— ఆ ప్రొడ్యూసర్ చేతుల్లో ఇవ్వాళ ఉన్న కథ రేపుండదు.

కవి ఆలోచించి చెప్పాడు. "అమ్మాయికి (హీరో యిన్) ఓ కల వచ్చినట్లుగానూ — అందులో ఓ స్వర్గం కన్పించినట్లుగానూ — తద్వారా దేవ దానవుల యుద్ధమో— మోహినీ రుక్మాంగదో— ఏదో ఒక పౌరాణికం సీనుపెట్టి— నారద ప్రవేశంగా గావింపజేసి వాడి చేత ఓ అరడజను పాడించేస్తే సరి." అతని బుర్ర అమోఘంగా పనిచేసింది ఆ సమయాన్న. అందుకే రాణించింది అతని బుర్ర.

ప్రొడ్యూసర్ తనే నారదుడైనట్లు సంబర



కట్నాలు. "కోటీశ్వర్లా ఉంటి మా తెలివి. బాక్సాఫీ ఫలితాలు. మరి—హీరోకి—హీరోయిన్‌కి కారు ప్రమాదంలో దెబ్బలు తగలొద్దు టండీ !— ప్రేక్షకులు తాళలేరండీ—".

"ఓ అలాగే. జరిగితీరాలి. లేకపోతే— పిలవ్వట్లు అవకాశం ఉన్నట్లు నవ్వొచ్చే ఉండదు. అయితే— హీరోను దొంగలు కొట్టినప్పుడు గాక, దారిలో నెమ్మదిగా కారు ఏక్సిడెంట్లు.... ఇలా మారుద్దాం కథను. ఏమంటారు ?"

"ఏమండీ—కవిగారూ ! మీ బుర్ర అమోఘంగా పనిచేస్తోందండీ. సినిమాటిక్ ఎఫెక్ట్సు అంటారు చిటిని—పెద్ద పెద్ద ప్రయోగాలరావ్ లాటి వాళ్లకే తొరగా తట్టవు—మీకు అవి అతువుగా వస్తున్నాయి. భలేవారండీ—అయితే,

"మీ కథను అంగీకరించినట్లే" అన్నాడా ప్రొడ్యూసరు.

ఆ కవి ఎగిరి గంతేసి, ఆఫీసు బల్లమీద కథాకళి నృత్యంచేసి, ఆ సంతోష సమయంలో కూడా సభాపటమేదా అనుకుని నడవకుండానే భరత నాట్యంలో మెట్లన్నీ జారి— అర్జెంటుగా భారా కిళ్లి నమిలేశారు బస్సుకోసం ఎదురుచూస్తూ. ఆ నమలడంలో ఉన్న రెండూ పళ్లూ కిళ్లితో సహా తోసలి కెళ్లేవే—అదృష్టవశాత్తు బస్సులో ఖాళీ దొరక్క రెండవ బస్సులో పోవాల్సిన దుర్గతిని తిట్టుకున్నారు నమలడం ఆపేసి.

*   *   *

కథను ప్రొడ్యూసరాదులు కోరిన మార్పులు చేసి కెమెరాలోకి ఎక్కించారు. జీవంలేని కెమెరా మొహమాటపడకుండా — హాయిగా — ఎక్కించుకుంది ఆ కథను.

పొడవు మమూలుగా మూడున్నర గంటలుంటుంది. ఇంత పొడుగు చిత్రానికి — సినిమా చరిత్రలోనే విప్లవం తెచ్చి స్వర్ణయుగాన్ని ప్రారంభించ గలదని చెప్పి సెన్సార్‌వారిచే స్పెషల్‌గా తన ప్రభావం చూపించి అనుమతి పొందాడు ఆ ప్రొడ్యూసర్!!

# ఓ తెలుగు సినిమా కథ

ప్రివ్యూ తోజన దాన్ని చూసిన ఓ విమర్శకుడు కథను టూకీగా వివరిస్తూ పడిన ఆవేదన ——

*   *   *

ఒక వూళ్లో ఒక అమ్మాయీ ఒకబ్బాయీ ఉన్నారు. ఆ వూరు అంత పెద్దదీ కాదు అంత చిన్నదీ కాదు.

ఆ వూరుకు దగ్గరగా కోయలూ, పులులూనివసించే ఓ కొండ ప్రాంతం ఉంది. ఇంకా — సింహాలూ, యోగులూ, ఋషులూ, మనుష్యులను బలిచ్చే కొండజాతి మనుష్యులూ — వారి బారినుండి రక్షించగలిగిన ఒక రకం కోతులూ (హాలీవుడ్ చింపాంజీలు) — చాలా వున్నాయని ప్రతీతి.

వాళ్లు ఏదో పండగ జరుపుకుంటూ, తప్పెట్లూ తాళాలతో దూరంగా అందమైన నది ఒడ్డుకు విహారానికి వచ్చిన కాలేజీ విద్యార్థుల గుంపుకు విన వడేలా మోతజేస్తూ నృత్యం చేస్తున్నారు. గానంతో సహా. ఇకనేం — ఆ శబ్దం వచ్చిన వైపుకు కాలేజీ పిల్లలంతా బైల్దేరి వెళ్ళారు. వింతలు చూడబోతూ వింతను ఎదుర్కొన్నారు.

కోయవారి ఉత్సవాన్ని మిక్కిలి ఆనందంతో తిలకించిన అనంతరం — అంటే — ఉత్సవం నృత్యాల మధ్య ఆ అమ్మాయీ ఆ అబ్బాయీ ఒక ర్నొకరు కంటి కొలకుల్లోంచి చూసుకున్నాక — కలల్లో మునిగిపోయాక — వెనక్కు తిరిగారో లేదో — ఇట్టే బోల్డుమంది కోయ వాళ్లు అనే ఎక్‌స్ట్రాలు — ఈటెలూ, కత్తులూ, డాలులూ, మరచిపోయిన రిస్టువాచీల్తోనూ కాగడాలు పట్టుకు వచ్చేశారు. అంటే — అప్పటికి చీకటి పడిందను కోవాలి.

పిల్లందర్నీ బంధించి పట్టుకుపోయారు కాళికాలయానికి. 'ఉత్సవాన్ని చూడనిచ్చినవాళ్లకు ఇది న్యాయమేనా' అని ఆక్రోశించింది ఓ అమ్మాయి. వెకిలిగా అద్భుతంగా నవ్వాడు కోయుల్లోని ఓ ఎక్స్‌ట్రా ప్రముఖుడు.

అక్కడ — పిల్లు దొరుకుతారని ముందే తెలిసో ఏమో అక్కడి వాళ్ళందరూ బలి సన్నాహాలు చేస్తున్నారు. గంగ్రడగొడ్డళ్లకు సానబెడుతున్నారు. మంటల చుట్టూ అందమైన కోయ ఆడవాళ్లు నృత్యం చేస్తున్నారు. వాళ్లు ఎంత వికృతంగా గెంతుతున్నారంటే సెన్సారుకు కళ్లు మూసుకు పోయేట్లు గెంతుతున్నారు. ఎవళ్లో డప్పులు వాయిస్తున్నారు. కోయ పెద్ద మంత్రాలు చదువుతున్నాడు మీసాలు దువ్వుకుంటూ.

ఇదంతా చూసి — హీరో కొంచెం ముందుకూ వెనక్కు గింజుకున్నాడు. అతన్ని పట్టుకున్న వాళ్ళిద్దరు మరింత గట్టిగా పట్టుకు తీసుకెళ్ళి, గుంజకు కట్టేసి — హీరోను పెద్ద పెద్ద చారలూ, చెమటా — అతడి వంటిమీద కన్పించేవరకూ బాదారు, కొరడాలతో. ఇది చూడలేని హీరోయిన్ కళ్లు మూసుకుంది.

కళ్లు మూసుకుందికదా — అప్పుడు ఆమె అంతకు క్రితం జరిగినదంతా ఫ్లాష్‌బాక్‌లో జ్ఞాపకం తెచ్చుకుంటుంది—

ఆ అమ్మాయి ఇంటి ప్రక్కనే ఉంటున్న ఆ అబ్బాయిని మనస్సులోనే ప్రేమించుకుంది. ఆ అబ్బాయీ అంతే. వాళ్ళ వాళ్ళ మేడలమీద నిల్చుని ప్రేమ పాటలు పాడుకున్నారు. ఆ అమ్మాయిని కాలేజీలోకూడ ఒకే క్లాసులో కలుసుకుని తన వయోఆధిక్యతను త్యాగంచేసి, పుణ్య చరితుడైనాడు హీరో.

ఒకనాడు ఆ అమ్మాయి మెట్లుదిగుతూ కాలుజారి క్రిందకు దొర్లిపోయింది— పోబోతుండగనే హీరో ఆమెను గట్టిగా వాటేసుకుని రక్షించాడు. 'థాంక్సు' అన్నదామె. 'ఎవరైనా చూస్తే' అన్నది. "అబ్బ—పొండి" అంది. అన్నిటికీ ఆ అబ్బాయి చిరునవ్వుతోనే సమాధానం యిచ్చాడు.

"మీ పేరు" అనడిగాడు తనకేమీ తెలియనట్లు. "అబ్బ — ఏమీ తెలియనట్లు నటన—" అనేసింది ఆ అమ్మాయి.

"మీపేరు నా కెట్లా తెలుస్తుందండీ" అన్నాడతను అదోలా మొహంపెట్టి. "మీరు మా ఇంటి ప్రక్కనే ఉంటూ నాపేరు తెలియకుండా ఉన్నారంటే నేను నమ్మలేకపోయాను. క్షమించండి ఐయామ్ వెరీ సారీ— నాపేరు సుజాత," అందామె ఆ అబ్బాయికి ఏ భాష అర్థమైతే ఆ భాషలోనే క్షమిస్తాడని రెండు భాషల్లోనూ క్షమించమంది.

"మరి — మీ పేరో—" అనడిగింది సుజాత.

ఆ అబ్బాయి ఆ అమ్మాయి అన్న మాటల్నే త్రిప్పికొట్టాడు. ఇద్దరూ గలగల నవ్వుకున్నారు గవ్వల్లా. "విజయ్" అన్నాడు.

ఇంతలోనే ప్రిన్సిపాల్ అటుగా వచ్చి, వీరిని చూసి కోపంగా తనతో తీసుకెళ్ళాడు.— ఇద్దర్నీ!! కొంచెం సేపు—కాలేజీ ఆవరణలోనే ఇద్దరూ దగ్గరగా నిల్చుని మాట్లాడుకుంటూ ప్రేమించుకోవడం — వారి ప్రణయావేశాన్ని ఇక్కడే తీర్చుకోవబోవడం—అన్యాయమంటూ రూల్సుకు వ్యతిరేకం అంటూ ఆక్రోశించి, తర్వాత —'మీ వర్ణాంతర వివాహానికి నా శుభాశీస్సులూ' అనేసి 'నాకు క్లాసుంది. వెళ్ళొస్తా' అని వెళ్ళిపోయాడు.

40 వ పేజీ చూడండి





# మీ బిడ్డ పెరుగుదలను అరికట్టే అజీర్తిని అలక్ష్యం చెయ్యకండి!

మీ బిడ్డ పాకటం, కూచోటం, నిలబడటం, నడవటం నేర్చుకోవాలి, తూకం రెట్టింపు పెరగాలి–అన్నీ తొలి యేడాదిలో! మీ బిడ్డ ఆరోగ్యంగా పెరగటానికి జీర్ణశక్తిలో స్వల్పలోపం కూడా అభ్యంతరం కలిగించకుండా మీరు శ్రద్ధ వహించాలి.

అజీర్ణ సూచన కనిపించగానే మీ బిడ్డకు అమృతాంజన్ గ్రైప్ మిక్శ్చర్ ఇవ్వండి. దానివల్ల, పళ్లు వచ్చేటప్పుడు కూడా ఏమీ చిరాకు కలగకుండా ఉంటుంది.

జ్ఞాపకం ఉంచుకోండి, అమృతాంజన్ గ్రైప్ మిక్శ్చర్ తయారు చేస్తున్నవారు సుప్రసిద్ధమైన నొప్పుల నివారిణి అమృతాంజన్ తయారు చేసే వారే. మీరు నిస్సందేహంగా వాడవచ్చు.

అమృతాంజన్ లిమిటెడ్, మద్రాసు
బొంబాయి, కలకత్తా, న్యూ ఢిల్లీ.

## అమృతాంజన్
లిమిటెడ్ వారి
## గ్రైప్ మిక్శ్చర్




JWT/AM/G/2615

## వనితాలోకం

# కోడిగుడ్డు లేని కేక్‌లు!

సుశీలా రామశేష

## దోసకాయతో రవ్వతో కేకులు ఎలా చెయ్యాలి?

కేక్ (Cake) అనగానే కోడిగ్రుడ్డు ఉండాలి. అని అందరి అభిప్రాయము. కాని గుడ్డు లేకుండా కూడ చెయ్యవచ్చు. మొదట కోడిగ్రుడ్డు వేసి చేసే విధము చెప్తాను.

కావలసినవి:—రెండు కోడిగ్రుడ్లు, ఒక కప్పు మైదా ఒకటిన్నర కప్పు పంచదార, 2 టీస్పూనులు బేకింగు సోడా అరకప్పుడు నెయ్యి లేక కప్పుడు వెన్న. కొంచెము జీడిపప్పు, కిస్మిసు, కొంచెము వెనీలా ఎస్సెన్సు.

కోడిగ్రుడ్లతో చేసే కేకులకు కేక్ ఓవెను (Cake Oven) అని బజార్లో అమ్ముతారు. దీనిని ఉపయోగించి చేస్తే కేక్ చాలా బాగా వస్తుంది. ఈ కేకులు చెయ్యటానికి చదును మట్టము గల ఎత్తులేని డబారము గిన్నెలు ఉండాలి. అడుగు పలసరిగా ఉంటే, అంటే కేకు మాడిపోకుండా అంత బాగా వస్తుంది. మైదాను జల్లించి పెట్టుకోవాలి. రెండు గ్రుడ్లు బద్దలుకొట్టి ఒక డబారము గిన్నెలో పోసి బాగా చిలకరించాలి. నురగ వచ్చే వరకు చిలకరించాలి. అప్పుడు దాంట్లో కొంచెము, కొంచెముగా మైదా, పంచదార, నెయ్యి వేస్తూ కలుపుతూ ఉండాలి. తర్వాత దాంట్లో బేకింగు సోడా, వెనీలా ఎస్సెన్సు నాలుగైదు చుక్కలు వేసి బాగా కలపాలి. జీడిపప్పును ముక్కలు చేసి, కిస్మిసు శుభ్రం చేసి పెట్టుకొని కొంచెము (2 చిటికెలు) పొడి మైదాలో కలిపి ముందు తయారు చేసి పెట్టుకొన్న ముద్దలో చల్లాలి. జీడిపప్పు, కిస్మిసు పొడి మైదాలో కలపకుండా అలాగే చల్లేస్తే కేకులంతా తయారైన తర్వాత చూస్తే ఇవి కేకు అడుగు భాగమున చేరి మాడిపోయి ఉంటాయి. అంతా తయారైన పిమ్మట ఈ గిన్నెను ఓవెనులో పెట్టి ఉంచి 10 నిముషముల తర్వాత చూస్తే కేకు తయారై ఉంటుంది. అప్పుడు దానిని బయటికి తీసి ఒక పళ్ళెంలోకి బోర్లిస్తే గుండ్రంగా అట్లాగే గిన్నె ఆకారములో పడుతుంది.

ఓవెనులేని వాళ్ళు ఒక మట్టి దాకలో ఇసుకపోసి దానికి మధ్యగా ఈ డబారము గిన్నె పెట్టి మూత పెట్టి మూతలో 5, 6 ఎర్రటి నిప్పులు వేసి ఈ దాకను స్టౌ మీద గాని, ఎర్రటి నిప్పుల మీదగాని ఉంచాలి, ఈ విధంగా తయారు చెయ్యటానికి ఒక అరగంట ముప్పావు గంట పడుతుంది. తయారైన కేకు పళ్ళెములోకి తీసుకొని పంచదార ఉండ పాకం రానిచ్చి పోస్తే బజార్లో అమ్మేవాటికి పైన ఉన్న విధంగా మనకు కూడా వస్తుంది. దీనినే ఐయిసింగ్ (Icing) అంటారు. ఓ కప్పుడు పంచదారను ఉండపాకం రానిచ్చి ముక్కోణంగా మిఠాయి పొట్లములాగ తయారు చేసి పెట్టుకొన్న కాగితంలో పోసి కాగితంతోనే మూతపెట్టి అడుగున ఉన్న కన్నము కూడ వేలితో మూతపెట్టి పట్టుకోవాలి. దీనిని చేత్తో కేకు మీదకు తీసికెళ్ళి అడుగున వేలుతీసి వేసి ఈ కేకుమీద డిజైన్లుగా పొయ్యవచ్చు. చల్లారిన తర్వాత అది గట్టిపడి అచ్చంగా బజార్లో వాటిమల్లే వస్తుంది.

### రవ్వతో కేకు :

ఇది కోడిగ్రుడ్డు లేని కేకు కాబట్టి చాలామందికి నచ్చుతుంది. దీనికి ఓవెను కూడా అవసరము లేదు.

కావలసిన సామాన్లు:—ఒక కప్పుడు బొంబాయి రవ్వ, ఒక కప్పు పుల్ల పెరుగు, అర కప్పు పాలు, ఒక కప్పు నెయ్యి, ఒకటిన్నర కప్పు పంచదార, ఒక టీస్పూను బేకింగు సోడా ఏలక పొడి లేక వెనీలా ఎస్సెన్సు, కొంచెము జీడిపప్పు, కిస్మిసు, బొంబాయి రవ్వ కొంచెము. ముతక రవ్వలాగ ఉన్నది శుభ్రం చేసి ఉంచుకోవాలి. ఈ కేకు చెయ్యటానికి వెడల్పు మూతి, మట్టుగల దిట్టమైన గిన్నె ఉండాలి. దాని ఆకారము దాకలాగ ఉంటుంది. హిందీలో దీనిని "అంగడి బర్తన్" అంటారు. శుభ్రం చేసిన ఒక కప్పుడు రవ్వ ఈ గిన్నెలో పోసి దాంట్లో పైన చెప్పిన కొలతల ప్రకారము, నెయ్యి, పంచదార, పెరుగు, పాలు, సోడా వేసి బాగా కలపాలి. తర్వాత దాంట్లో జీడిపప్పు, కిస్మిసు, ఎస్సెన్సు లేక ఏలక పొడి వేసి అలాగే ఒక గంటసేపు ఉంచాలి. తర్వాత కుంపట్లో నిప్పువేసి (దీనికి స్టౌ పనికి రాదు), బాగా ఎర్రటి నిప్పులయ్యేటట్టు చెయ్యాలి. గిన్నె మీద మూతలో ఈ ఎర్రటి నిప్పులు చాలా వేసి కుంపట్లో 4 లేక 5 ఎర్రటి నిప్పులుంటే చాలు. పది, ఇరువది నిముషముల తర్వాత చూస్తే కేకు తయారై ఉంటుంది. తయారైన కేకును ఒక పళ్లెంలోకి బోర్లిస్తే గుండ్రటి ఆకారంలో కేకు వస్తుంది. ఇది బాగా చల్లారాక ముక్కలు కోసి తింటే చాల రుచిగా




"మా అమ్మ ఓ గ్లాసుడు కాఫీ బదులు తీసుకోమంది!"

ఉంటుంది. రెండు రోజులకంటె ఇది నిల్వ ఉండదు. గ్రుడ్డులేని కేకు కాబట్టి ఇది అందరికి నచ్చుతుంది.

## దోసకాయతో కేకు :

దీనికే హిందీలో "కకడే కేక్" అంటారు.

దీనికి కావలసినవి :

ఒక దోసకాయ, అరకప్పు రవ్వ, బెల్లం ఒక కప్పు కోరిన పచ్చి కొబ్బరి అరకప్పు, నెయ్యి అర కప్పు, కొంచెము ఏలకపొడి, అర చిటికెడు ఉప్పు.

ఈ కేకుకు మనకు సాధారణంగా దొరికే పసుపు దోసకాయ పనికి రాదు. ఆకుపచ్చ తోలు ఉండే నక్క దోసకాయ ఉండాలి. దీనినే నక్క దోసకాయ అంటారు.

దోసకాయకు చెక్కు తీసి కొబ్బరి తురిమే దాంతో తురిమి పెట్టుకోవాలి. అర చిటికెడు ఉప్పువేసి ఒక గంట ఉంచాలి తర్వాత మనము నెయ్యి దల్చుకున్న గిన్నెలో (రవ్వతో కేకు చేసే గిన్నెలాంటిదే దీనికీ ఉండాలి) ఈ దోసకాయ తురుమునేసి కుంపటి మీద సన్న సెగని పెట్టి మూత పెట్టి ఐదు నిముషాలు ఉంచాలి. అప్పుడు దోసకాయ మెత్తబడి ఉంటుంది. దానిని క్రిందికి దింపి కోరి పెట్టుకొన్న కొబ్బరి (అరకప్పు) దాంట్లో వేసి బాగా కలపాలి. అరకప్పు నెయ్యిలో రవ్వవేసి కొద్దిగా వేయించాలి. తర్వాత ఈ రవ్వ, దోసకాయ తురుము, కొబ్బరి, పంచదార, ఏలక పొడి బాగా కలిపి చిటికెడు సోడావేసి రవ్వ కేకు లాగ కుంపట్లో అడుగున 4, 5 ఎర్రటి నిప్పులు ఉంచి గిన్నె పెట్టి దానిమీద మూత పెట్టి మూతలో ఎర్రటి నిప్పులు బాగా పొయ్యాలి. పది, ఇరువది నిముషాలు తర్వాత చూస్తే కేకు తయారై ఉంటుంది. ఇది కొంచెము ఉప్పగ తియ్యగా ఉంటుంది. చల్లారిన తర్వాత ముక్కలు కోసి ఈ కేకు తినవచ్చును.



## మనసులో మాట

మనసులో మాట పైకి చెప్పుకోవటం వలన హృదయాలు తేలిక పడతాయని భావించేవారు మనలో చాలా మంది ఉన్నారు. అలాగని ప్రతి విషయమూ అందరితోటి చెప్పకూడదు. కొన్ని చాలా గోప్యంగా ఉంచవలసిన విషయాలుంటాయి. ఇలా చెప్పేవారు పురుషులకన్నా స్త్రీలే ఎక్కువ.

కొంత మంది తీరి కూర్చుని వచ్చే పొయ్యే వారితో ప్రతి విషయమూ చెప్తుంటారు. ఇల్లాంటి వారి దగ్గరకు సామాన్యంగా వారదువి లాంటి వారు, ఇంటింటికి విషయాన్ని చేరవేసేవారు యెక్కువగా వస్తూంటారు. వీళ్ళు చేసే పని యేమిటంటే ఇక్కడ విన్న విషయాన్ని ఇంటింటికి చేరవేసే వరకూ కూర్చోకుండా ఉండటం. కొందరికి యేదైనా విషయం వింటే తెలిస్తే యెవరికో వకరికి చెప్పేవరకు నిద్రపట్టదు. పని గట్టుకు కాఫీ పొడి కో, పంచదారకో వెళ్ళి మరీ చెబుతారు. అందుకే పెద్దవాళ్ళు చెప్పారు. "ఆడవాళ్ళనోట్లో నువ్వుగింజనానదు." అని.

మాకు తెలిసిన అత్తా కోడళ్ళున్నారు. అత్త చాలా మెతక మనిషి. అది అలుసుగా తీసుకుని కోడలు నానా మాటలు అనేది. ఒక రోజు పాపం! ఆవిడ నోరు జారి పక్కింటావిడతో "చూడండి, పెద్దదాన్నని కూడా అనుకోకుండా మా కోడలు ఎలాగంటే అలా అనేస్తుంది." అని. ఇంక ఆవిడ చిలవలు పలవలు అల్లి కోడలికి తెలిసేటట్లు అందరికీ చెప్పింది. ఆ కోడలు భర్తతో చెప్పి, అత్తగారిని ఆరపించి, నానా గొడవై పోయింది. ఇలాగే చెప్పుకుంటే కో కొల్లలు.

మనసులో మాట చెప్పు కోవడం తప్పని కాదు. కాని మనం చెప్పగా వినేవారుంటారు చూడండి! వాళ్ళ సంగతి నేను చెప్పేది. వాళ్ళు విని యేదైనా ఓదార్పు చెబితే బావుంటుంది. కాని, వూరూ, వాడా, అంతా చాటి వేయకూడదు.

మనం, మన ఆప్తులతోనూ, స్నేహితులతోనూ చెప్పుకుంటే బావుంటుంది కాని, ఎవరికంటే వారికి చెప్పకూడదు. మనం చెబ్తే వినేవారు నిజంగా మన శ్రేయస్సు కోరేవారైతే మరెవ్వరితోనూ చెప్పరు. సరిగదా మన బాధ తీరేందు కేదైనా ప్రయత్నం చేస్తారు. కొంతమంది స్వజనులతో కొట్లాడి ఆ కోపంలో ఇంటి విషయాలన్నీ ఎవరికైనా చెప్పేసి, తర్వాత "అయ్యో! ఎందుకు చెప్తిని" అని పశ్చాత్తాప పడ్తారు. అందుకే తొందరపాటు పనికిరా దంటారు.

కొంత మంది, ఎన్ని కష్టాలున్నా, ఎన్ని సుఖాలున్నా ఎవరితోనూ చెప్పుకోరు. వారే అనుభవిస్తారు. అలా చేయడం వల్ల వారికి ఒక విధమైన తృప్తి దొరుకుతుంది. అది మంచి పద్ధతి. తమ హృదయంలోని సంతోషం కాని, దుఃఖం కాని ఇతరులతో పంచుకొని హృదయాలు తేలిక పర్చుకునే వారు కూడా ఉంటారు. కాని, ఇలాంటి వారు ప్రతిదీ ఎవరితోనైనా చెప్పేదానికన్నా, డైరీలు వ్రాసుకోవడం మంచిది. అలా వ్రాయడం వల్ల కూడా ఒకరితో చెప్పుకున్నంత సుఖమూ, తృప్తి దొరుకుతవి. ఒకరితో చెప్పి తంటాలు తెచ్చుకునేందుకన్నా, ఇలా చేయడమే మంచి పద్ధతి కదూ!

—టి. లక్ష్మీప్రసన్న. ★

## 17-4-1964 శుక్రవారము మొదలు
## 23-4-1964 గురువారము వరకు

### మేషం :

(అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)

గత వారం మీరు ప్రారంభించిన పనులు ఈ వారం చాల వరకు సానుకూల పడతాయి. వృత్తి వ్యాపారాల్లో పోటీ హెచ్చు కాగల సూచనలు ఉన్నాయి. మొత్తం మీద అనుకూలంగా ఉన్నా ప్రతి వ్యవహారములోను ఆందోళనా, శ్రమా తప్పవు. కొంతమంది మిత్రులు తమ పనులు మీ చేత చేయించుకొంటూ మీ పని వచ్చేసరికి ముభావంగా ఉండి పోతారు. జాగ్రత్త చాలా అవసరం. ఆదాయం పెరగదు గాని డబ్బుకు ఇబ్బంది లేకుండా గడచి పోతుంది. కుటుంబ పరిస్థితులు ఇదివరకటి కంటే బాగా ఉంటాయి. కుటుంబ సంబంధమైన వ్యవహారాలన్నీ అనుకూలంగా ఉంటాయి. సాంఘిక వ్యవహారాల్లో నూతనావకాశాలు లభిస్తాయి. వారాంతంలో ఉష్ణాధిక్యత వల్ల కొంచెం అనారోగ్యం చేయవచ్చును. సాహసముతో కూడిన వ్యాపారములు కొంతవరకు లాభించ వచ్చును.

* * *

### వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

ఈ వారం సాధారణంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో పెద్ద మార్పులు ఉండవు. ఉద్యోగస్థులకు చెప్పుకోదగ్గ మేలు జరుగక పోయినా పై అధికారులవల్ల మెప్పు మాత్రం లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. ఇది వరకు మీరు చేసిన ఆర్థికమైన వాగ్దానాలు ఇప్పుడు నెరవేర్చ వలసి రావడం వలన కొంత ఇబ్బంది కలుగుతుంది. రాబోయే అవకాశాల్ని నమ్మి యే పనీ ప్రారంభించడానికి సమయం కాదు. కుటుంబంలో ఒకరికి అనారోగ్యం చేస్తుంది. కుటుంబ వ్యవహారాల్లో అనవసరమైన వ్యయం జరుగుతుంది. యే వ్యవహారం యెలాగ ఉన్నా మీ మానసిక బలం చెక్కు చెదరకుండా ఉంటుంది. మీకు తగిన అవకాశం లేక పోయినా కూడా స్నేహితులకు సహాయం చేస్తారు. 17, 18 తేదీల్లో బంధు సమాగమం సంతోషం.

* * *

### మిథునం :

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర పునర్వసు 1, 2, 3 పా.)

గత వారం కంటే ఈ వారం బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో నూతన వ్యవహారాల్ని గురించి ఆలోచించ వలసి వస్తుంది. ఉద్యోగస్థులకు అనుకూల వాతావరణం యేర్పడుతుంది. ఆదాయం పెరుగుతుంది గాని హించని ఖర్చులు కూడా చేయవలసి వస్తుంది. అధికారుల వలన జరగ వలసిన పనులలో కొత్తగా ఆటంకములు రావడం వలన కాలయాపన జరుగుతుంది. శరీరారోగ్యం

| మీ | మే | వృ | మి |
|---|---|---|---|
| కు | ర<br>బు గు | చం శు | రా |
| శ | వారఫలం | | |
| | | | |
| కే | | | |

మహేష్

బాగా ఉంటుంది. సాంఘిక వ్యవహారాల్లో మాట పట్టుదల వల్ల కొంత మంది వ్యక్తులతో అభిప్రాయభేదాలు రావచ్చును. కోర్టు వ్యవహారాల్లో చెప్పుకోదగ్గ అభివృద్ధి యేమీ ఉండదు. అలంకార వస్తువులు కొంటారు. పుణ్య కార్య క్రమాల్లో పాల్గొంటారు. వారాంతంలో ప్రయాణాలోచనలు రావచ్చును. సాహిత్య వైజ్ఞానిక రంగాల్లో మీ బుద్ధి చురుకుగా పని చేస్తుంది.

* * *

### కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

పది మందితో కలిసి తిరగడం, అందరిచేతా ఓహో అనిపించుకోవడం జరుగుతుంది గాని ఆర్థికంగా ఆట్టే ప్రయోజనం లేని కాలం. వృత్తి వ్యాపారాల్లో కొన్ని అనుకూలమైన మార్పులు జరుగవచ్చును. ప్రయత్నించిన పనులు నెరవేరుతాయి కాని మీకు సంబంధించని పనులలోనే యెక్కువ కాలం గడప వలసి వస్తుంది. ఉద్యోగంలో మీ శక్తి సామర్థ్యాలు రుజువు చేసుకొనడానికి అవకాశం లభిస్తుంది. ఆర్థికంగా గత వారం కంటే బాగా ఉంటుంది. రాజకీయాల్లో ఇదివరకు మీకు ప్రతి కక్షులుగా ఉన్న వారు కూడా మీకు అనుకూలంగా వ్యవహరిస్తారు. సంతానానికి సంతోషం, సౌఖ్యం లభిస్తుంది. బంధువుల కార్య భారాన్ని కూడా మీరు వహించవలసి వస్తుంది. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు. వారాంతానికి అన్ని వ్యవహారాలూ సంతృప్తికరంగా ఉంటాయి. 17, 18 తేదీల్లో ఆందోళన.

* * *

### సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ఈ వారం సామాన్యంగా ఉంటుంది. అన్ని వ్యవహారాలు ఒడుదుడుకులు లేకుండా జరిగి పోతాయి. కాని మీకు సంబంధించని వ్యవహారాల్లో చిక్కుకొనే అవకాశము ఉంది. వృత్తి వ్యాపారాల్లో ఆట్టే ప్రయోజనం లేని శ్రమ పొందవలసి రావచ్చును. ఆరోగ్యం గత వారం కంటే బాగా ఉంటుంది గాని నిర్లక్ష్యం చేయడం మంచిది

### —ఈ వారము ధరలు—

ధాన్యం ధర నిలకడగా ఉంటుంది. కందులు, పెసలు, శనగలు మొదలైన అపరాల ధరలు కొంచెం పెరగవచ్చును. బెల్లం. చింత పండు ధరలు కొంచెం తగ్గి మరల పెరుగుతాయి. నూనె ధరలో మాంద్యం యేర్పడ వచ్చును.

కాదు. యెవరినీ నమ్మి డబ్బుకు సంబంధించిన వాగ్దానాలు చేయడానికి ఇది సమయం కాదు. రాజకీయాల్లో మిత్రుల సహకారం వలన మంచి అభివృద్ధి కన్పిస్తుంది. కోర్టు వ్యవహారాల్లో వ్యతిరేకత తగ్గే సూచనలు లేవు. ఉద్యోగస్థులకు కార్య భారం పెరుగుతుంది. కుటుంబ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. అలంకార వస్తువులు కొంటారు. శుభ కార్యాల విషయంలో అనుకూలమైన వార్తలను వింటారు. 17, 18 తేదీల్లో సంతోషం, ప్రయాణాలోచనలు.

* * *

### కన్య :

(ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

గత వారం ఏర్పడిన చిక్కులు క్రమంగా తగ్గుతాయి. ప్రతి విషయంలోను సందేహాలు బాధిస్తూ ఉండడం వలన యే పనీ సాహసించి చేయలేరు. కొత్తగా ఆర్జించక పోయినా, ఉన్నది నిలబెట్టుకొంటే చాలుననే ధోరణిలో ఉంటారు. అవసరానికి కొంత మంది మిత్రులు తోడ్పడటం వలన వృత్తి వ్యాపారాల్లో కొంచెం అభివృద్ధి కన్పిస్తుంది. ఉద్యోగస్థులు, తమ వల్ల తప్పులేక పోయినా యేదో కారణం చేత పై అధికారుల మందలింపులకు గురి కావలసి వస్తుంది. కోర్టు వ్యవహారాలు మందకొడిగా ఉంటాయి. సాంఘిక వ్యవహారాల్లో మీ శక్తి సామర్థ్యాలు రుజువు అవుతాయి. ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం. ప్రేమ వ్యవహారాల్లో అనుకోని ప్రతికూలత యేర్పడ వచ్చును. చిత్తా నక్షత్ర జాతకులకు మిగిలిన వారి కంటే బాగా ఉంటుంది.

* * *

### తుల :

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)

ప్రయత్నించిన ప్రతి పనీ నెరవేరుతున్నట్లే కన్పిస్తుంది గాని ఫలితం చేతికి వచ్చేవరకు నమ్మడానికి వీలులేదు. వృత్తి వ్యాపారాల్లో అప్పుడప్పుడు ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది గాని మిత్రుల సహాయం వల్ల గడచిపోతూ ఉంటుంది. మీ వృత్తిలో తలపెట్టిన భారీ ప్రయత్నాలు వాయిదా పడే సూచనలు ఉన్నాయి. అధికారుల వలన జరుగవలసిన పనులకు తాత్కాలికంగా ఆటంకాలు రావచ్చును. ఇంతవరకు మీరు ఒక దారికి తెచ్చిన స్థిరాస్తి వ్యవహారాల్లో మరల చిక్కులు రావచ్చును. వైజ్ఞానిక కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారాంతంలో కొంచెం అనా

రోగ్యం చేయవచ్చును గాని దానివల్ల మీ కార్య క్రమాలకు భంగం కలుగదు. రాజకీయాల్లో ప్రతిపక్షాల వారికి ఇతరత్రా చిక్కులు రావడం వలన మీ పై ఒత్తిడి తగ్గుతుంది 22, 23 తేదీల్లో అనవసర వ్యయం.

## వృశ్చికం :

(విశాఖ 4—వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

ఈ వారం మీ పరిస్థితి బయటకు బంగారపు పూసవలె ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో పలుకుబడి పెరుగుతుంది గాని దానివల్ల మీకు ప్రయోజనమూ, సంతృప్తి ఉండవు. అన్ని వ్యవహారాల్లోను కార్య భారం పెరుగుతుంది. మిమ్మల్ని పొగడుతూ మీ ద్వారా తమ పనుల్ని సాధించుకొనే వ్యక్తులు మీకు తటస్థ పడతారు. మీకు అనుకూల పరిస్థితులు కనిపించుతూ ఉన్నా మీ అనుమానాలు మిమ్మల్ని వెంటాడుతూనే ఉంటాయి. సాహసముతో కూడిన వ్యాపారాలు చేస్తే నష్టమే కాని ప్రయోజనము కలుగక పోవచ్చును. కుటుంబ పరిస్థితులు సంతృప్తికరంగా ఉంటాయి. సంతానానికి అనారోగ్య సూచనలు ఉన్నాయి. మీ వృత్తి రీత్యా చేయవలసిన ప్రయాణాలు వాయిదావేయడం మంచిది. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు 17,18 తేదీల్లో అనవసరమైన ఆందోళన.

## ధనుస్సు :

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

ఈ వారం శుభా శుభ మిశ్రమంగా ఉంటుంది. మీరు ఇదివరకు ప్రారంభించిన వ్యాపారంలో ఇప్పుడు స్వల్ప ధన నష్టం రాగల సూచనలు ఉన్నాయి. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల్లో ప్రోత్సాహం కన్పిస్తుంది. అధికారుల వలన జరుగవలసిన పనులు విశేషమైన ప్రయత్నము లేకుండానే నెరవేరుతాయి. దూర దృష్టితో వ్యవహరించడం వలన మీరు సాటివారిచే అపార్థం చేసికొన బడవచ్చును. మీరు యే మాత్రం అజాగ్రత్తగా ఉన్నా విలువైన వస్తువులను కోల్పోయే ప్రమాదముంది. ఆరోగ్యము గతవారం కంటే బాగా ఉంటుంది. కుటుంబంలో పెద్దవారికి అనారోగ్యం చేయువచ్చును. సంతానానికి సౌఖ్యం, సంతోషం లభిస్తాయి. బంధువులకు సంబంధించిన కార్యాలు ఇంకా ఒక దారికి రావు. మూల నక్షత్ర జాతకుల పరిస్థితి మిగిలిన వారికంటే బాగా ఉంటుంది.

## మకరం :

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా,
శ్రవణం, ధనిష్ఠ 1,2 పాదాలు.)

ఈ వారం గత వారం కంటే బాగా ఉంటుందని చెప్పవచ్చును. వృత్తి వ్యాపారాల్లో ఇంత వరకూ ఉన్న చిక్కులు చాల వరకు తొలగిపోయి కొంత మనశ్శాంతి లభిస్తుంది. ముఖ్యమైన పరిస్థితుల్లో మీరెవరో, పై వా హరెవరో తెలియకుండా పోతుంది. వ్యాపారంలో భారీ మార్పులు, భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు చేయడానికి ఇది సమయం కాదు. ఆదాయం పెరగక పోయినా ఆర్థికంగా ఇబ్బంది లేకుండా గడచి పోతుంది. స్థిరాస్థి వ్యవహారాలు గృహ నిర్మాణ ప్రయత్నాలు అనుకూలంగా ఉంటాయి. సాంఘిక కార్యక్రమాల్లో మీకు మంచి తనం బలహీనతగా ఎంచబడే పరిస్థితి రావచ్చును. సాహిత్య విద్యారంగాల్లో మీరు పది మంది దృష్టినీ ఆకర్షిస్తారు ఆరోగ్య విషయం ఫర్వాలేదు. కాని ధనిష్ఠ నక్షత్ర జాతకులకు మాత్రం కొంచెం అనారోగ్యం చేయవచ్చును. 19, 20 తేదీల్లో సంతోషం, స్వల్ప ధనలాభం.

## కుంభం :

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం,
పూ. భాద్ర 1, 2, 3 పా.)

వృత్తి వ్యాపారాల్లో అనుకూలమైన మార్పులు జరుగ గల సూచనలు ఉన్నాయి. ఆదాయం కూడా పెరగ వచ్చును. వ్యాపారంలో మీరు ఇంత వరకు చేస్తున్న ఆలోచనలకు కార్య రూపం ఇస్తారు. అన్ని వ్యవహారాల్లోను కొంత పోటీని యెదుర్కొన్న తర్వాతనే కార్యసిద్ధి జరుగుతుంది. అధికారుల వలన జరుగవలసిన పనులలో కొంత ఎక్కువ శ్రమ పడవలసి వస్తుంది. ఇంతవరకు మీకు అనుకూలంగా ఉన్నవారు కొంత మంది ఆకస్మికంగా అయిష్టులుగా మారిపోతారు. ఉద్యోగస్థులకు కూడా ఇది వరకటికంటే బాగా ఉంటుంది. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. మీ తాలూకు వస్తువులను నౌకర్లు మొదలైన వాళ్ళు అపహరించగల సూచనలు ఉన్నాయి. రాజకీయాల్లో మీ స్థానమునకు భద్రత చేకూరుతుంది. నాగరికంతో ప్రేమ వ్యవహారాలో కొంచెం అభివృద్ధి ఉంటుంది.

## మీనం :

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)

మామూలుగా, సులభంగా జరుగ వలసిన పనులక కూడా యేవో ఆటంకములు రావడం వలన వృత్తి వ్యాపారాల్లో తాత్కాలికంగా నిరాశ కలుగుతుంది. ఉద్యోగంలో కొంత వ్యతిరేక వాతావరణం యేర్పడి మానసికంగా అశాంతికి దారి తీస్తుంది. అనుకోని ఖర్చులు చేయవలసి రావడం వలన ఆర్థికంగా కొంత ఇబ్బంది వస్తుంది. వృత్తి రీత్యా ప్రయాణం చేయవలసి ఉంటుంది. కాని దానివల్ల ఆట్టే ప్రయోజనం ఉండదు. మొత్తం మీద శ్రమకు ఫలం లభించదు. కోర్టు వ్యవహారాలో ఇదివరకటి కంటే అనుకూలంగా ఉంటుంది. రక్త సంబంధమైన అనారోగ్యం చేయుగల సూచనలు ఉన్నాయి. మిత్రుల వ్యవహారాల్లో మీరు ఇచ్చిన సలహాల చక్కగాపని చేస్తాయి. సాంఘిక వ్యవహారాల్లో పెద్ద మార్పులు రావు. కుటుంబ పరిస్థితి బాగా ఉంటుంది.

# జన్మదిన ఫలం

## ఏప్రిల్ -17

అప్పుడప్పుడు కొన్ని చికాకులు కల్గినా సంవత్సరం మొత్తం మీద ఫలితం సంతృప్తికరంగానే ఉంటుంది. వృత్తిలో చిన్న చిన్న మార్పులు అనుకూలమైనవి జరుగుతాయి. ఉద్యోగస్థులకు స్థాన చలనము కలుగవచ్చును కాని మారబోయే స్థానము అనుకూలముగా ఉంటుంది గనుక ఆందోళన చెందవలసిన అవసరము లేదు. ఆదాయం కూడా అభివృద్ధి కాగల సూచనలు ఉన్నాయి. మాట పట్టింపు మీద మిత్రులతో కలహం రావచ్చును. సాంఘిక కార్యక్రమాల్లో ప్రతిఘటన ఉంటుంది. కుటుంబ విషయాలు అనుకూలంగా ఉంటాయి కాని అప్పుడప్పుడు పిల్లలకు అనారోగ్యం చేస్తుంది. దూరప్రయాణాలు చేయవలసిన అవసరం యేర్పడుతుంది. విద్యార్థులు శ్రమమీద కృతార్థులు కాగలరు. యంత్ర వ్యాపారస్థులకు కళాకారులకు అనుకూలమైన సమయం.

## ఏప్రిల్ -18

అవకాశం చిక్కినప్పుడు ఆలోచన తట్టక, ఆలోచించిన దానికి అవకాశం రాక నిరుత్సాహం కలుగుతుంది. వృత్తి వ్యాపారాల్లో యెంత శ్రమ పడినా ప్రయోజనము ఉండదు కాని వ్యతిరేకత కూడా ఉండదు. సంవత్సరం మధ్యలో సాటివారి పోటీ ఏర్పడగల సూచనలు ఉన్నాయి. రాదను కొన్న డబ్బు చేతికి వస్తుంది. సాహసముతో కూడిన వ్యాపారంలో నష్టం రావచ్చును. స్థిరాస్థి వ్యవహారాల్లోను, గృహ నిర్మాణ ప్రయత్నంలోను కొంత అభివృద్ధి ఉంటుంది. ఆరోగ్యం మొత్తం మీద బాగా ఉన్నా అప్పుడప్పుడు అజీర్ణ సంబంధమైన అనారోగ్యం చేయువచ్చును. కుటుంబంలో తల పెట్టిన కార్యాలు నెరవేరుతాయి. సాంఘిక కార్యక్రమాల్లో గౌరవం లభిస్తుంది. విద్యార్థులు నూతన విషయాలను సులభంగా గ్రహిస్తారు.

## ఏప్రిల్ -19

ఈ సంవత్సరం బాగానే ఉంటుంది. వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. భాగస్వాములతో కలసి నూతన వ్యాపారములు చేయుటకు మంచి సమయం. అధికారుల వలన జరుగవలసిన పనులు నెరవేరుతాయి, ఉద్యోగస్థులకు పై అధికారుల ఆదరణ లభిస్తుంది. కోర్టు వ్యవహారాలు మీకు అనుకూలంగా పరిష్కారం కావచ్చును. రాజకీయాల్లో ప్రతి పక్షాల ఒత్తిడి తీవ్రంగా ఉంటుంది గాని మీ ధైర్య సాహసాలే మిమ్మల్ని రక్షిస్తాయి. కుటుంబంలో ఇంత వరకు ఉన్న చికాకులు తొలగిపోతాయి. అందరూ మీ అభిప్రాయాల్ని అనుసరిస్తారు. విలువైన అలంకార వస్తువులు కొంటారు. పుణ్య కార్యాలు చేస్తారు. విద్యార్థులు సులభంగా కృతార్థులు కాగలరు. వ్యవసాయ దార్లకు ఇంజనీర్లకు అనుకూలమైన సమయం.

## ఏప్రిల్ -20

గ్రహబలం అనుకూలంగా ఉంది. వృత్తి వ్యాపారాల్లో నూతనావకాశాలు లభిస్తాయి. వ్యాపారస్థులకు ఆకస్మిక ధన లాభం కలుగుతుంది. ఉద్యోగస్థులక ఉన్నత స్థానము లభించవచ్చును. భాగస్థులతో చేరి వ్యాపారం చేయుడం కంటే స్వంతంగానే చేయడం మంచిది. కొంత మంది వ్యక్తులు శ్రేయోభిలాషులుగా నటిస్తూ మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. దూరపు బంధువులకు సహాయం చేస్తారు. దురవ్యయం కాక పోయినా, అధిక వ్యయం చేయువలసి రావడం

# జన్మదినఫలం

వలన సంవత్సరం మధ్యలో డబ్బుకు ఒత్తిడి వస్తుంది. రాజకీయాల్లో పేరు ప్రఖ్యాతులు లభిస్తాయి. బాధ్యతతో కూడిన పదవిని నిర్వహించవ గల సూచనలు ఉన్నాయి. ప్రయోజనం గల దూర ప్రయాణాలు చేస్తారు. కుటుంబంలో పెద్ద లకు అనారోగ్యం చేయవచ్చును. అక్టోబరు, నవంబరు నెలల్లో ధనలాభం.

## ఏప్రిల్-21

ఈ సంవత్సరం చాలా చిత్రంగా ఉంటుంది. మీ ఆలోచనలు మీ పనులను సాధించడానికి ఉపయోగపడవు కాని ఇతరులకు సలహా రూపంలో చక్కగా ఉంటాయి. వృత్తి వ్యాపారాల్లో కొన్ని ఒడుదుడుకులు వచ్చి ధన నష్టం కాగల సూచ నలు ఉన్నాయి. రావలసిన డబ్బైనా చేతికి వచ్చే వరకూ నమ్మకం ఉండదు. శరీరారోగ్యం బాగా ఉన్నా మానసికంగా అశాంతి, ఆందోళన ఉంటాయి. శుభ కార్యాల విషయంలో ఇప్పటికి ఒక నిర్ణ యానికి వచ్చిన వ్యవహారాలు కూడా మరల అని శ్చితమైన పరిస్థితుల్లో పడగలవు. చిన్న విషయా లకు కూడా ఓర్పు, నిదానం అవసరం. సంవ త్సరం మధ్యనుంచి క్రమంగా అన్ని వ్యవహారాల్లోను మంచి మార్పులు వస్తాయి. ప్రేమ వ్యవహారాల్లో ప్రతికూలత రావచ్చును. విద్యార్థులు శ్రమపడి చదవవలసి ఉంటుంది.

## ఏప్రిల్-22

ఈ సంవత్సరం సామాన్యంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో స్వల్పంగా ప్రోత్సాహం లభి స్తుంది. కాని సంవత్సరం మధ్యలో అకస్మాత్తుగా అన్ని వ్యవహారాల్లోను చిక్కులు యేర్పడి సంవత్స రాంతానికి సర్దుకొంటాయి. భారీ ఎత్తున మార్పులు చేయడానికీ నూతన వ్యవహారాలు ప్రారంభించ డానికే తరుణం కాదు. శరీరారోగ్యం గత సంవ త్సరం కంటే బాగా ఉంటుంది గాని కాలడం, జారి పడడం వంటి ప్రమాదములు కలుగ వచ్చును. తక్కువ స్థాయి వారితో కలహ ప్రసంగములు రావచ్చును. కుటుంబ వ్యవహారాలు సంతృప్తి కరంగా ఉంటాయి కాని పెద్దవారికి అనారోగ్యం చేసి ఆందోళన కలిగిస్తుంది. సాంఘిక వ్యవహా రాల్లో మీ స్థానానికి చలనం ఉండదు. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు. కంట్రాక్ట ర్లకు అనుకూలమైన కాలం.

## ఏప్రిల్-23

ఈ సంవత్సరం ఆర్థికంగా బాగానే ఉంటుంది కాని యే పని కోసమైనా ప్రయత్నం చేసిన కొద్దీ ప్రతికూలత పెరుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాలకు ఇది సమయంకాదు. మీరు ఇది వరకు కొంత నిర్లక్ష్యం చూపిన వ్యవహారాలకు ప్రాముఖ్యత వచ్చి చికాకు కలుగుతుంది. వాటికి తోడు బంధువుల్లో కొంత మంది మీకు ఇబ్బంది కలుగ జేయడానికి ప్రయత్నం చేస్తుంటారు. ఉద్యోగస్థులు అకారణంగా పై అధికారుల ఆగ్రహా నికి గురి కాగల సూచనలు ఉన్నాయి. స్థిరాస్తి వ్యవహారాల్లో మీకు అనుకూలంగా ఉంటుంది. శుభ కార్యాల విషయంలో మీ ఆలోచనలకు, ప్రయత్నాలకు ఆటంకం ఉండదు. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు. నవం బరు, డిశంబరు నెలల్లో శుభవార్తా శ్రవణం. ★




గంగరాజు అడుగులు ముందుకు పడ్తున్నాయి.

రావిచెట్టువైపు దృష్టి సారించాడు. చీకట్లో వెలుగులా, వెలుగులో చీకటి రేఖలా సీత కనిపించింది. ఆ చీకటి వెలుగుల్లో సీత అన్నట్లుగానే వచ్చింది. తృప్తిగా శ్వాస వదలాడు గంగరాజు. ఆమె నిరీక్షణ అతనికి ఆనందాన్నిచ్చింది.

దగ్గరి కెళ్ళాడు. గంగరాజు రావడం చూసి సీత తలవంచుకుంది.

"ఎన్నాళ్ళకొచ్చావు ?" ధైర్యం చేసి అడిగాడు గంగరాజు ఆమెకు దగ్గరగా జరుగుతూ.

సీత మాట్లాడలేదు. ఒక సారి తలెత్తి అతన్ని చూసింది. అనుభవంలేని కండ్లు కలిసి వాలిపోతు న్నాయి.

ఈసారి గంగరాజు ఆమె చేతిని తన చేతుల్లోకి తీసుకున్నాడు. అతని స్పర్శతో కంపించినట్లు సీత చేతి గాజులు కదిలాయి.

"ఏం మాట్లాడవు ?"

పీవు చరచినట్లు అతని ప్రశ్నకు సమాధాన మివ్వలేని ఆమె పెదాలు భయంతో వణికాయి.

గంగరాజుకు ఇదేం నచ్చలేదు. ఆమె చేతిని వదిలేశాడు.

కొంచెం వెనక్కు తగ్గింది సీత.

సిగరెట్ తీసి అగ్గి పెట్టెకోసం జేబులు తడుము కున్నాడు గంగరాజు.

"ఇంత భయపడే దానివి ఎందుకు వచ్చావు?"

గంగరాజు సిగరెట్ పొగ గాలితో పరుగులు తీస్తుంది. ఇద్దరి హృదయాల్లో కదలని నీడలు— ధైర్యం, భయం. మాటల్లోకి రానిచూపులు—

"ఏడు నెలల క్రితం ఎలా ఉన్నావో ఇప్పుడు కూడా అలాగే ఉన్నావు."

"కాదు—!" సీతఅతి కష్టంమీద అనగలిగింది.

"మరి ?"

"మారి పోయాను."

గంగరాజు వెకిలిగా నవ్వాడు. సిగరెట్ పీలు స్తున్నప్పుడు వచ్చేకాంతిలో స్పష్టంగా కనిపిం చిందా నవ్వు.

# రేయి విడిచిన నక్షత్రం

సీత మూగదానిలా అతనివైపు చూసింది.

గంగరాజు మరోసారి మొదటిలాగే నవ్వి సీతను దగ్గరికి తీసుకున్నాడు.

సీతకు మతిపోయి నట్టయింది. ఇన్నాళ్ళు గంగరాజు ఆమెకు దూరంగా ఉండి పిచ్చిదాన్ని చేశాడు కాని ఇవాళ్ళ దగ్గరుండి చేస్తున్నాడు.

"నే వెళ్ళాలి !"

"ఏం ?"

"వారు— దగ్గుతున్నారు. వెళ్ళాలి—"

గంగరాజు ముఖమంతా యెలాగో చేసుకున్నాడు. అదే మొదటిసారి—

ప్రతిసారి ఇలాగే జరుగుతుంది. గంగరాజు దగ్గరికి రాగానే సీత ఏదో సాకు చెప్పి తప్పించుకోసాగింది. ఒకరోజు నిలదీసి అడిగాడు గంగరాజు.

"ఎందుకా ముసలివాడిమీద నీకింత మమకారం ?"

"వారెంతో మంచివారు. వారలా దగ్గుతూ బాధ పడుతుంటే నేనిక్కడ నిల్వలేక పోతున్నాను."

గంగరాజుకు సహనం తక్కువ—

"మరిక్కడికి ఎందు కొస్తున్నావు ?"

సీతనేరం చేసిన దానిలా తలవంచుకుంది.

"చూడు సీతా ! నిన్ను కించ పరచటం నా ఉద్దేశ్యం కాదు. నువ్వు రోజు ఇలా వచ్చి వెళ్ళిపోతుంటే నాకెలా ఉంటుందో చెప్పు— ?"

"మరి నా విషయం— !"

గంగరాజు నవ్వుతూ సీతను దగ్గరికి తీసుకోబోయాడు.

రామచంద్రం దగ్గు వినిపించింది సీతకు. నిద్రలో ఉన్నట్లే ఉలిక్కిపడింది.

గంగరాజు నొచ్చుకున్నాడు. 'అసలు ఈ రామచంద్రం రెండో వివాహం ఎందుకు చేసుకోవాల్సి వచ్చిందో ?'

సీత ఒక బీదకుటుంబీకుని కూతురు. బీదరికం చేయించిన వివాహం అది. సీత రామచంద్రం అనే వృద్ధ ధనికుణ్ణి పెళ్ళి చేసుకుంది.

సీత ఎన్నోమార్లు చెప్పింది గంగరాజుతో. అతనికి వినే వోపిక లేకపోయినా వినేవాడు— 'ఆయన ఎంతో మంచివారు— ఎంతో మంచివారు—' వూం కొట్టేవాడు.

ఒక రోజు సీత మరీ భయపడింది.

"వారు మన సంబంధాన్ని పసిగట్టారు. నా కెందుకో భయంగా ఉంది."

"ఏమన్నాడేంటి ?'

"ఏమీ లేదు— దగ్గరికి పిలిచి 'నువ్వంటే నాకు ప్రాణమే సీతా.' అన్నారు"—

గంగరాజు నిర్లక్ష్యంగా నవ్వాడు.

"ఇంత దానికేనా భయం— ?"

సీత మౌనం వహించింది.

కాస్సేపటికి— "సీతా."

"ఊం—"

"మీ ఆయనంటే నీకంత ప్రేమా ?"

సీత తలవంచుకుంది.

"అంత ప్రేమ ఉన్నప్పుడు ఈ అడ్డదారెందుకు ?" ముఖమంతా చిట్లించుకున్నాడు గంగరాజు.

"ఆయనెంతో మంచివారు—"

"మరి నేనే నచ్చనమాట—"

" ...నే నచ్చానా ?"

గంగరాజు ఈసారి ధైర్యంగా సీతను దగ్గరికి తీసుకున్నాడు. సీత గంగరాజు కండ్లలోకి చూసింది.

"అయితే చెప్పు— ఎందుకొచ్చావు ?" నవ్వుతూ అడిగాడు.

"మీ కోసం. . . ."

గంగరాజు పకపక నవ్వాడు.

సీత కండ్లలో నీళ్ళు తిరిగాయి.

"ఆయన దగ్గరుంటే మీరు జ్ఞాపకమొస్తారు. మీ దగ్గరుంటే వారి గురించి దిగులుగా ఉంటుంది.

"ఎందుకు దిగులు ?"

సీత తల వంచుకుంది. గంగరాజు గ్రహించాడు.

సీత గంగరాజునే కాదు— ఎవరినైనా ప్రేమించ గలుగుతుంది. ఆమెది నిర్మలమైన ప్రేమ. భర్త అంటే గౌరవం, భక్తి ఉన్నాయి ఆమెకు. అందుకే ఆయనంటే భయమూ, దిగులూను.

"మరి దిగులుగా ఉంటే ఏం చేద్దామనుకుంటావు ?" గంగరాజు ప్రశ్నించాడు.

---

ఒకసభలో ఒక ఉపన్యాసకుడు : సోదరులారా, నే నిక్కడకు ఎందుకు వచ్చానో మీకు తెలుసు !... ఉపన్యసించేందుకు. మీరొచ్చింది, వినటానికి. అందువల్ల, మీరు 'వినటం' నా కంటే ముందె ముగిస్తే, చేతులెత్తండి. నేను ఆపుతాను.

రవిబాబు (విజయవాడ)

---

"చస్తే బాగుండు ననుకుంటూ— !"

గంగరాజు ఇంకా దగ్గరికి గుంజుకున్నాడు సీతను.

"అలా అనకు. నీ కోసం బ్రతికి ఉండటానికి గంగరాజు ఉండగా అవేం మాటలు ?"

"మనం చాలా పొరపాటు చేస్తున్నాం తెలుసా ?" అంది సీత.

చేస్తున్నది నిజమే కనుక గంగరాజుకు ఏం మాట్లాడాలో తోచలేదు.

"ఈ విషయం ఇప్పుడు కాకపోయినా కొంత కాలానికి బయట పడుతుంది. అప్పుడు నన్నేం చేస్తారు ?"

"అది నువ్వే ఆలోచించుకో— !" అంటూ ముఖం మరోవైపుకు తిప్పుకున్నాడు గంగరాజు.

"ఏ బావో చూసుకుంటాను— !"

"పిరికి దానివి—" ఆమె వైపు తిరిగి నవ్వాడు.

"ఇప్పుడు లేదు పిరికి. కాని అప్పటికి వస్తుందేమోనని భయంగా."

గంగరాజు యేంమాట్లాడలేక పోయాడు.

ఇద్దరి మధ్య క్షణాలు అలసిపోతున్నాయి.

"ఇవాళ్టికి వెళ్ళనివ్వండి. వారు నిద్రలేచే సమయం—"

గంగరాజు ఆమెను వదిలేశాడు.

"కోపం వచ్చిందా ?"

"నాకేం కోపం -- ?"

"ఏమీ అనుకోకండి— !" బాధ పడుతూ చెప్పింది సీత.

"వెళ్ళు—" అంటూ వెనక్కు తిరిగాడు గంగరాజు.

"మీకోసం—" వెనక్కు తిరిగిన గంగరాజు చేతిలో డబ్బు పెట్టబోయింది.

"ఇలాంటివి నాకు నచ్చవని చెప్పలేదు నీకు ?"

"ఎప్పుడూ ఇలాగే అంటుంటారు మీరు. నా కెలాగో ఉంటుంది మరి— !"

"అందుకనే తీసుకెళ్ళమంటుంది."

"మీ దగ్గర ఇంటి అద్దె డబ్బు లుండవని తెలుసు. అందులో ప్రాక్టీసు కూడా సరిగ్గా నడవడం లేదు. ఉంచండి—"

"అయితే అద్దె ఇచ్చానని మీ వారికిచ్చెయ్" అని ఈ సారి గంగరాజు నవ్వాడు.

"వారు నమ్మరు. స్వయంగా మీరేవచ్చి ఇవ్వండి రేపు. అసలే అనుమానపు మనిషి."

గంగరాజు సీత డబ్బు చేతిని పట్టుకొని దగ్గరికి లాక్కున్నాడు.

"చూడు— మీ వారికి నిద్రమాత్ర ఇచ్చిరాలేదా ?"

"వద్దు— చాలా ప్రమాదం."

"భయంలేదు. చావడు—"

"ఛ! అలాంటి మాట లనకండి. నేనెంత నీచురాలినైనా......" ఇక ముందు చెప్పలేక పోయింది సీత. "తీసుకోండి"

గంగరాజు డబ్బు అందుకున్నాడు.

అతని ముఖంలోకి ఒక్కక్షణం చూసి తలుపు గడియ తొలగించి వెళ్ళిపోయింది సీత. సీత వెళ్ళగానే గంగరాజు చేతిలో డబ్బు లెక్క పెట్టుకున్నాడు మొత్తం నూట యాభై రూపాయలు. నవ్వుకున్నాడు. 'వీటిని సంపాదించటానికి ఎంత కష్టపడిందో సీత ?' అనుకున్నాడు మనసులో.

ఇంటి అద్దె ముప్పై రూపాయలు పోతే మిగిలేవి నూట ఇరవై — 'నెల రోజులు సుఖంగా గడుస్తాయి—' అనుకొని గంగరాజు తృప్తిగా శ్వాస పీల్చాడు.

సీత భర్త రామచంద్రం విపరీతంగా దగ్గుతున్నాడు.

ఆ రాత్రి రామచంద్రంతో పాటు గంగరాజుకు కూడా నిద్రపట్టలేదు.

*　　　*　　　*

మరునాడు అద్దె ఇవ్వటానికి గంగరాజు రామచంద్రం ఇంటి కెళ్ళాడు. రామచంద్రం అతన్ని ఆహ్వానించాడు.

"అద్దె డబ్బు లివ్వడానికి వచ్చాను—"

"దానికోసం మీరు రావాలా ? ఎవరికైనా ఇచ్చి పంపిస్తే పోదూ—" అన్నాడు రామచంద్రం నెరసిన జుట్టును కొంచెం పైకి తీసుకుంటూ.

బక్క పల్చగా, చామనఛాయ రంగు రామచంద్రంది. పైజామా మీద లాల్చీ వేశాడు. ఛాతీ అంతా ఎండిపోయింది.

సీత గంగరాజు వచ్చింది గమనించలేదు. లోపల వంటింటి పనులు చేసుకుంటుంది.

"ఎలా ఉంది మీ ప్రాక్టీసు— ?"

"లాభంలేదు—" గంగరాజు పెదవి విరిచాడు. తరువాత అలా అన్నందుకు లోలోప బాధ పడ్డాడు.

"మంచి సెంటర్ చూడక పోయారా ఇల్లు ?"

"దొరకదని మానుకున్నాను."

"ప్రయత్నించి చూడండి."

గంగరాజు మాట్లాడలేదు.

రామచంద్రం చిన్నగా దగ్గాడు.

"మీ ఆరోగ్యం ఎలా ఉంది ?" ప్రస్తావన మార్చి అడిగాడు గంగరాజు.

రామచంద్రం సమాధానం చెప్పేలోగా సీత బైటకొచ్చింది.

"ఆరోగ్యానికేం గాని కొంచెం వారిని గట్టిగా అరవొద్దని చెప్పండి" అంది.

గంగరాజు ఈ విషయంలో కలగ జేసుకోవా లనిలేదు. కొంచెం ఇబ్బందిగా కదిలాడు. మాట్లాడ కుండా చిన్నగా నవ్వి వూరుకున్నాడు.

భార్యవైపు కన్నార్పకుండా చూస్తున్నాడు రామచంద్రం. గంగరాజుకు ఇంకా ఎక్కువ సేపు కూర్చోవాలని లేదు. లేవ బోయాడు.

"ఉండండి. కాఫీ త్రాగి పోదురుగాని." అంటూ లోపలికి పోయింది.

వద్దని చెప్పాలనుకున్నాడు గంగరాజు. కాని, చెప్ప లేకపోయాడు.

"సీత ఇంటి కొచ్చిన స్నేహితులను ప్రాణంగా చూసుకుంటుంది."

ఏదో ఆలోచిస్తున్న గంగరాజు ఆలోచనలకు అడ్డు నిలిచాయి రామచంద్రం మాటలు.

"మీకు ఎవరూ లేరని చెప్పారుకదూ —!"

"ఆ. అమ్మా, నాన్న పోయి అయిదేండ్లకు పైగా అవుతుంది."

"అలాగా. మా నాన్న నేను పుట్టగానే పోయా డట. తరువాత మా అమ్మ నా రెండోపెళ్లి అయిన అయిదు నెలలకు—" అంటూ రామచంద్రం నిట్టూర్చాడు.

సీత కాఫీ పట్టుకొచ్చింది. గంగరాజు తీసు కున్నాడు.

"ఇలాంటి విషయాల్లో సీతది పై చేయి. మర్యాదకు లోటుండదు. ఏం సీతా ?" రామచం ద్రం నవ్వుతూ అన్నాడు.

సీత భర్తవైపు అర్థం కానట్లు చూసింది. గంగరాజుకు కాఫీ మింగుడు పడలేదు.

"అర్థం కాలేదా ?"

"అయింది—" అంటు సీత లోపలి కెళ్ళి పోయింది.

గంగరాజు —మరో అయిదు నిముషాలక్కడే కూర్చొని బయలు దేరాడు.

ఆ రోజు రాత్రి తొందరగానే నిద్ర పట్టింది గంగరాజుకు. సీత వచ్చి లేపిందాకా సోయలేదు.

"ఎంతైంది— ?" గంగరాజు ఆవులించి అడిగాడు.

సీత టేబుల్ మీదున్న గడియారం చూసి చెప్పింది— "పన్నెండుంబావు—" అని.

సీతను చూసి తరువాత గంగరాజుకు కొంత నిద్ర మత్తు వదిలింది.

"చేతి గడియారం తీసుకోకూడదు— !" అంది.

"అదే సీతా ! యల్. యం. పి. పయ్యాను. కాని చేతి గడియారం కొనుక్కునేంత నే నెప్పుడూ సంపాదించలేదు."

"పోనియ్యండి. నేనిస్తాను—".

"ఇలా ఎంతకాలమని సీత ? ఒక నాడు నీకూ విసుగు పుడుతుంది నేనంటే."

"అలా ఎందుకు ఆలోచిస్తారు మీరు ?"

"ఈ మధ్య ఈ విషయాలు ఆలోచించకుండా ఉండలేక పోతున్నాను. ఒక నాటికి నేను అవమానింప బడ్తాను."

సీత నవ్వింది. "అవమానించే దెవరు మిమ్మల్ని?"

"నీ భర్త. అది అతనికి చాతకాకపోతే నువ్వు"

"నేననుకోవాల్సిన మాటలు మీరంటున్నారు."

"ఇప్పట్లో నువ్వనుకోవు. అందుకే నేనంటు న్నాను. తొందర్లోనే ఇక్కడి నుంచి వెళ్ళి పోతాను." అన్నాడు గంగరాజు.

సీత కండ్లలో నీళ్ళు నిండుకొచ్చాయి. కన్నీ ళ్ళలో తడసిన కండ్లు నక్షత్రాల్లా మెరుస్తు న్నాయి.

"ఏడుస్తున్నావా ?"

సీత తలవంచుకుంది.

"ఇవాళ నా మనసు బాగుండలేదు సీతా. పిచ్చి పిచ్చి ఆలోచనల్తో నిద్రపోయాను—"

రామచంద్రం దగ్గుతున్నాడు.

"నీ 'ఏమండి' దగ్గుతున్నాడు. వెళ్ళు."

"ఇవాళ వెళ్ళను" అంటు సీత గంగరాజుకు దగ్గరగా జరిగి అతని భుజం మీద తల ఆనించి కండ్లు మూసుకుంది.

"నీ భర్తకు దగ్గు వచ్చిందంటే చావు బ్రతు కుల్లో ఉన్న వాడితో సమానం అతనికి క్షయ. రోజురోజుకు ముదురుతుంది. కాని మాట విప్ప టానికి ప్రాణం ఒప్పుకోడు—వెళ్ళు సీతా."

"నేను వెళ్ళి ఏం చెయ్యను ?" అన్నదే కాని మనసు ఒప్పుకోలేదు.

"నువ్వు దగ్గరుంటే కొంతైనా సంతోషి స్తాడు."

సీత పలకలేదు. ఆ రాత్రికి అక్కడే ఉండి పోవా లని నిశ్చయించుకుంది.

రామచంద్రం ఆ రాత్రల్లా దగ్గుతూనే ఉన్నాడు.

* * *

ఆ రాత్రి గడచిన తరువాత అలాంటి ఆరు రాత్రులు గడిచాయి. కాని సీత ఆ రాత్రి గడపినట్లు ఈ ఆరు రాత్రులు గంగరాజుతో గడపలేదు సుఖా నికి. గంగరాజు 'డిస్పెన్సరీ' మూత పడింది. రోజూ వచ్చే నలుగురు పేషంట్లు కూడా తిరిగి పోతున్నారు.

గంగరాజుకు కొంచెం పిచ్చి పట్టినట్లయింది. ఏ పనీ సరిగ్గా చేయలేక పోతున్నాడు. ఒక రోజు ఉండ లేక చీకటి పడుతున్న వేళ్ళకు సీత ఇంటికి కెళ్ళాడు. రామచంద్రం పడక కుర్చీలో పడుకొ న్నాడు.

"ఎలా ఉంది మీ ఆరోగ్యం ?"

రామచంద్రం మాట్లాడాలనుకున్నాడు. కాని దగ్గుతెర అడ్డొచ్చింది. రెండు నిమిషాలు బాధ పడ్డాడు.

" ఆరోగ్యం ఎలావున్నా — నాకు రోజులు బాగాలేవు." ఆయాసపడుతూ చెప్పాడు. గంగరాజు గుండెల్లో బరువు పడింది.

" సీతా ! డాక్టరు బాబు వచ్చాడు. ఆ స్టూల్ తెచ్చి పడేయ్ —." సీత స్టూల్ తెచ్చి వేసింది.

ఈ వారం రోజుల్లోనే చాలా మార్పులొచ్చాయి సీతలో. ముఖమంతా పాలిపోయింది. కుడిచెంప మీద గాటు పడింది. గంగరాజును చూసి నవ్వింది. కాని మునుపటిలా యిప్పుడా నవ్వులో జీవం కని పించలేదు గంగరాజుకు.

" ఈ దగ్గు నా ప్రాణాలు తీసి పోతుంది. డాక్టరు మాత్రం ఏం చేస్తాడు ? చావుకు బ్రతుక్కు మధ్య గోడ కడ్తాడా ? పోని — మీరు చూస్తారా ?'

" ఇంతకు ముందొకసారి చెప్పాగా — 'క్షయ' అని. ఏదైనా మంచి శానిటోరియంలో చేరండి. అలా చేయడం మీకు చాలా మంచిది. చివరికి ప్రాణాల మీద కొచ్చిన తరువాత ఏం చేసినా లాభ ముండదు."

" మూడు రోజుల నుంచి రక్తం కూడా



వస్తుంది." రామచంద్రం గొంతులో నిరుత్సాహం వినిపించింది.

"మీరు కొంచెం తొందరపడండి."

"ఎన్నాళ్ళు పడుతుందంటారు ?"

"ఒక ఏడెనిమిది నెలలు —"

"ప్రయత్నిస్తాను. మీ సహాయం ఏదైనా కావలసి వస్తే పనిమనిషితో కబురు పంపుతా."

ఇక ఎక్కువ సేపు కూర్చోవడం మంచిది కాదనుకున్నాడు గంగరాజు.

"సరే వస్తాను — " అంటూ గడప దిగి తేలిగ్గా శ్వాస పీల్చాడు గంగరాజు. గంగరాజు వెళ్ళగానే రామచంద్రం సీతను కేకేశాడు. సీత వచ్చింది.

"గంగరాజు తన కోసం వచ్చి వుండడు. సీతను చూడ్డానికి కాబోలు — " అలా అనుకున్న రామచంద్రానికి మండి పోయింది. సీతను నెడామడా తిట్టాడు.

"ఛీ ! పాడు బ్రతుకు. చావైనా రాదు. నాకండ్ల ముందే వా యింట్లోకి రావటానికి తయారయ్యాడు ఇది నువ్విచ్చిన అలుసు కాదటే ......."

సీత మాట్లాడ లేదు. ఆయన తన బలహీనతను గురించి చెప్పుకుంటూంటే కన్నీళ్ళు చెంపల మీది నుంచి జారి క్రింద పడ్డాయి.

"డాక్టరేగా ! ఏదైనా మందు అడక్కపోయావా వా తిప్పలూ తీరేవి — "

రామచంద్రం అవమానిస్తూనే వున్నాడు. ప్రతి మాటనొక్కినొక్కి చెప్తున్నాడు.

"ఇంతటితో అయిందా ? యింకేం చూడాల్నో — ?"

ఈసారి సీత ఏడుపు వినిపించిందాయనకు.

"ఇప్పటి నుంచి అతను అసలీ ఛాయలకే రావడానికి వీల్లేదు. వాడు అడ్డొ యిచ్చేవాడు — అంతే !"

తరువాత తనన్న మాటలకు నొచ్చుకున్నాడు రామచంద్రం. మెత్తబడ్డాడు. కావాలని అత నెప్పుడూ సీతను బాధ పెట్టలేదు. "ఆదేదో ! తెలియక ఏదో చేస్తే యీ ముదనష్టపునోరు వూరుకోదు." మనసులో తనను తాను తిట్టుకున్నాడు.

"ఇదిగో — సీతా — !"

సీత వచ్చి తలవేపున నిల్చుంది. తలెత్తి సీతవైపు చూశాడు రామచంద్రం.

"ఏడుస్తున్నావా ?"

సీత తల దించుకుంది.

"అక్కడికి వెళ్ళనని ప్రమాణం చేయి —."

సీత భోరుమంది. — "వెళ్ళనండి — వెళ్ళను."

"నిన్ను బాధ పెట్టలేను సీతా. నువ్వేదో నాశనమవుతున్నావనే నా బాధ — ఆ గంగరాజు ....."

"వూర్కోండి. ఇక ముందెప్పుడూ ఆ పేరెత్తకండి." రామచంద్రం తృప్తిగా నిట్టూర్చాడు.

గంగరాజు దగ్గరికి పోవటం మానేసింది సీత. అతను రెండు — మూడుసార్లు వాళ్ళ పనిమనిషితోనే కబురు పెట్టాడు. సీత పనిమనిషిని నాలుగు దులిపి పంపించింది. రోజులు గడుస్తున్నాయి.

గంగరాజు నాలుగైదుసార్లు సీతకు ప్రయత్నపూర్వకంగా కనిపించాడు. సీత ఏ భావమూ తెలియనివ్వకుండా తలదించుకుంది. సీతకు గంగరాజు మీద అభిమానమూ, ప్రేమా వున్నాయి. అందుకనే గంగరాజుని తలెత్తి చూడలేక పోయేది. ప్రతిరాత్రీ గంగరాజు వూహాలే కలత పెట్టేవి ఆమెను. రామచంద్ర దగ్గుతుంటే ఒళ్ళు ఝల్లు మనేది.

# రేయి విడిచిన నక్షత్రం

ఏమీ తోచక కన్నీళ్ళు పెట్టుకునేది సీత.

ఒకరోజు రాత్రి రామచంద్రం రక్తం కక్కుకున్నాడు. కండ్లు తేలి పోయాయి. బట్టలు రక్తంతో తడిసి పోయాయి. స్పృహ లేకుండా పడిపోయాడు. సీత ఎంత పిలిచినా పలకలేదు. గాబరా పడింది. అంత రాత్రిపూట తనకు యెవరు దిక్కు ? డాక్టర్ కోసం పోవాలంటే యిల్లు దగ్గరగా లేదు. కబురు పంపటానికి ఎవరూ లేరు. ఈ సమయంలో గంగరాజు తప్ప మరెవ్వరూ లేరు. అక్కడికి పరుగెత్తింది. తలుపు తట్టగానే తెరిచాడు గంగరాజు.

మేల్కొనే వున్నాడు — " ఓహో — దయ వచ్చినట్లుందే దేవికి — లోపలికి రా." అన్నాడు. సీత అలాగే గడపలో నిల్చుండి పోయింది.

"ఏం అలావున్నావు.?" తిరిగి అడిగాడు.

"వారి కెలాగో వుంది. మూడుసార్లు రక్తం పడింది. మాట్లాడలేక పోతున్నారు. మీరొకసారి వచ్చి చూడండి — " అంది కంగారు పడూ.

ఈసారి గంగరాజు మాట్లాడలేదు. ఆలోచ



నల్లో పడ్డాడు. "వెళ్ళటమా — మానటమా " అని.

"తొందరగా రండి — !" గంగరాజు సమాధానం కోసమైనా ఎదురు చూడకుండా వెళ్ళిపోయింది సీత.

గంగరాజు శేంపాలుపోలేదు. సీత ఆ గమనంతో వచ్చిన ఉత్సాహం క్షణాలో నిరుత్సాహ పడింది.

చివరికి స్టెతస్కోప్, లెదర్ బ్యాగ్ పట్టుకొని రామచంద్రం వాటావైపు కెళ్ళాడు.

రామచంద్రం మగతలో వున్నాడు. ముఖం పాలిపోయింది. మళ్ళీ రక్తం పడింది. గంగరాజు అతనికేదో యింజక్షన్ చేశాడు.

"ఎలావుంది ?" సీత భయంగా అడిగింది. గంగరాజు మాట్లాడలేదు. మళ్ళీ యింకో యింజక్షన్ యివ్వడానికి వూనుకున్నాడు. రామచంద్రం గిజగిజ తన్నుకుంటున్నాడు.

సీత బావురుమంది. గంగరాజుకు సీత పరిస్థితి మీద జాలి, ఆశ్చర్యం కలిగాయి. మళ్ళీ యింజెక్టు చేశాడు. ఈసారి రామచంద్రం కొంచెం కదిలాడు.

సీత ఏడుపు ఆపుకోవాలని ప్రయత్నిస్తుంది. కాని ఆమెకు సాధ్యం కావడం లేదు. రామచంద్రం కండ్లు తెరిచాడు. ఎదురుగ్గా సీత, గంగరాజు కనిపించారు. ఏదో మాట్లాడలని నోరు తెరిచాడు. కాని గొంతు పెగల్లేదు. గంగరాజు సీతకు సైగ చేశాడు దగ్గరి కెళ్ళమని. సీత వెళ్ళింది.

రామచంద్రం గొంతు ఈసారి పెకిలింది. ఏదో అన్నాడు. గంగరాజుకు వినిపించలేదు. కొద్దిగా ముందు వంగాడు. "ఏం జరిగింది ?"

సీత చెప్పింది. రామచంద్రానికి ఆ నీరసంలో కూడా కోపం వచ్చింది. కాని తమాయించుకున్నాడు.

"ఈ రాత్రి నేను పోతాను —"

సీత వెర్రిగా గంగరాజును చూసింది. గంగరాజు యింకా ముందుకు జరిగి సీతకు ఎడంగా నిలబడ్డాడు.

"ఇతను నన్ను ప్రాణాలతో వదలడు. ఎందుకు పిలిచావు ? వెళ్ళమను ?" సీత సలక్కుండా అతనికి దగ్గరగా జరిగింది.

"నా బాధను చూడలేక అతన్ని రమ్మన్నావా ? లొంగి పోయావా ? అతను నిన్నూ, నన్నూ మోసం చేస్తున్నాడు." గంగరాజు అక్కడ వుండబట్టలేక పోయాడు. కోపంగా లెదరుబ్యాగ్ పట్టుకొని వెళ్ళిపోయాడు. సీత మనసు క్షోభించింది.

గోడ గడియారం రెండు గంటలు కొట్టింది. గంగరాజు అడుగుల చప్పుడు దూరమయింది.

"నేనంటే నీకు అపేక్షవుందా సీత ?" రామచంద్రం అడిగాడు. అతని కండ్లలో కన్నీళ్ళు నిలిచాయి. సీత కన్నీళ్ళతో సమాధాన మిచ్చింది.

"గంగరాజును నమ్మకు. వాడు మంచివాడుకాదు. నేను పోయింతరువాత మరి యింకెవ్వరినైనా — —" చెప్పలేక పోయాడు. సీత వెక్కివెక్కి ఏడుస్తుంది.

"ఇకముందు అతనితో మాట్లాడనని మరొకసారి వాగ్దానం చేయి — " సీత గొంతు పడిపోయింది. సమాధానం యిచ్చే స్థితిలో లేదు. అతని మీదకి వంగి తలూపింది.

ఆమె కన్నీళ్ళు రామచంద్రం గుండెల్ని తడుపుతున్నాయి.

"నా పరిస్థితి బాగాలేదు. యింకా వివరంగా నీకేం చెప్పలేను. నువ్వేమౌతావోనన్న విచారం మిగిలింది. — "

రామచంద్రం మాటలాపాడు. పెదాలు ఎండి పోతున్నాయి. తడి చేసుకున్నాడు. "దప్పిగ్గా వుంది. కొంచెం నీళ్ళివ్వు ..... " అన్నాడు. సీత మంచినీళ్ళు తెచ్చి అతని గొంతులో పోసింది.

రామచంద్రం కొన్ని క్షణాలు ఏం మాట్లాడ లేదు. సీత కండ్లలోకి నిశ్చితంగా చూస్తూ వుండి పోయాడు. సీత కూడా అతని వైపే కన్నార్పకుండా చూస్తుంది.

"నిన్ను చేసుకున్నాను కాని సుఖపెట్టలేక పోయాను సీతా. నాది అవివేకమైన పనే. ఏంచెయ్యను ఇలా అవుతుందనుకోలేదు. అప్పట్లో నువ్వంటే నాకెంత యిష్టముండేదో నేను చెప్పలేను. కాని నువ్వు పిచ్చి ఆలోచనల్లో జీవితాన్ని కల్మషం చేసుకుంటున్నావు."

సీత బదులు పలక లేదు.

"సీతా."

"ఆఁ ——."

"నువ్వంటే నాకు ప్రాణం — ." అన్నాడు రామచంద్రం. సీత కండ్లలో పేరుకున్న కన్నీళ్ళు జలజల రాలాయి. గోడ గడియారం అర్ధగంట కొట్టింది. ఇటుప్రక్క గంగరాజు గది చేరుకున్నాడే కాని అతనిలో కోపం యింకా తగ్గలేదు. పిడికిలి


39 వ పేజీ చూడండి

## ఆడంబరాలను విడనాడండి
## దేశసంపదను వృధా కానీయకండి






### జరిగిన కథ

గిరి, హరి, హరి చెల్లెలు దుర్గ బాల్య స్నేహితులు. హరి, ఉమల మధ్య అనురాగం నెలకొంటుంది. గిరి చూపే భాతృవాత్సల్యాన్ని, దుర్గ హర్షించ లేకపోతుంది. దూరపు బంధువు శంకర్‌ను గిరి తన ఇంటికి ఆహ్వానిస్తాడు. గిరి సలహాపై దుర్గ శంకర్‌ని హృదయ పూర్వకంగా ప్రేమిస్తుంది. వారిద్దరు వివాహం చేసుకొంటారు. హరంటే ఇష్టంలేనట్లు ఉమ ప్రవర్తిస్తుంది. హరి కృంగిపోతాడు. శంకర్, దుర్గల వైవాహికజీవితంలో చెలరేగిన కలతలను సరిదిద్దటానికి గిరి ప్రయత్నం చేస్తూ వుంటాడు. దుర్గ చిన్ననాటి స్నేహితుడు ప్రసాద్ ఆమె సంసారంలో కలతలు రేపటానికి ప్రయత్నిస్తాడు. గిరి హరినిగురించి నచ్చచెప్పటానికి ఉమవద్దకు వెళ్తాడు.

## 21

చూస్తూ ఉండగానే, ఉమ అందమైన పూల మాలగా మారిపోయింది. ఆ మాలలోని ప్రతి పువ్వూ ఎంతో అందంగా సువాసన లీనుతూంది. గిరి ఎంతో ఆప్యాయంగా ఆ మాలను తన మెడలో ధరించబోయాడు. అంతలో హరి దీనంగా రోదిస్తూ, రోషంగా బెదిరిస్తూ, ఆ మాల కోసం చేతులు జాపాడు. గిరి వదలలేక, వదలలేక, కష్టంగా ఆ మాలను హరి చేతికి అందించాడు. కానీ ఆ మాల హరి చేతిలో, నిలవక జారిపోతూంది. హరి ఉక్రోషంతో దాన్ని నలిపి వేస్తున్నాడు— గిరి విల విలలాడి పోతున్నాడు. అంతలో ఆ మాల హరి చేతులో నుంచి, జారిపోయింది. ఎక్కడికో అగాధంలోకి పడబోతున్న ఆ మాలకోసం, ఆత్రుతగా "ఉమా !" అంటూ గిరి కూడా అగాధంలోకి దూకాడు.

ఉలికిపడి కనులు తెరిచాడు గిరి— అతని చేతులు. తన మీదకు వంగిన ఉమను గట్టిగా పొదివి పట్టుకున్నాయి. అతని సర్వాంగాలకూ చెమటలు పట్టాయి.

సిగ్గుపడి ఉమను వదిలి లేచి కూర్చుని కళ్ళు నులుముకున్నాడు గిరి— ఉమ లేచి మంచుని "నన్ను కలవరిస్తున్నారేమిటీ ?" అంది.

ఆమె కళ్ళు సంతృప్తిగా నవ్వుతున్నాయి. అతని తలగడ ప్రక్కనే ఉన్న తన ఫోటోను చూసిన ఉమ స్వర్గ లోకాలలో తేలిపోయింది— గిరి హృదయంలో తనకు స్థానముంది— అతడేదో కారణం వలన కావాలని తనకు దూరంగా ఉంటున్నాడు."

"కలవరించానా ?" అన్నాడు బిడియంగా గిరి—

"అవును. నేను వచ్చి చాలా సేపయింది. నిద్ర పోతూన్న మిమ్మల్ని లేపటం ఇష్టంలేక వూరుకున్నాను— ఇంతలో మీ పెదిమలు అస్పష్టంగా కదిలాయి. ఇంత చలిలో శరీరమంతా చెమట పట్టింది. నేను కంగారుపడి మిమ్మల్ని లేపబోయేసరికి, మీరేలేచి "ఉమా !" అంటూ గట్టిగా నన్ను పట్టుకున్నారు."

గిరికి తనకు వచ్చిన కల గుర్తు వచ్చింది. నవ్వుకున్నాడు. మనసులోని భావనల ననుసరించే కలలు వస్తాయి.

ఉమ అతనికి కాఫీ అందించింది.

"ఇక్కడ మంచి హోటలయినా లేదు. స్వీట్సు దొరుకుతాయి కానీ, అవి ఏమంత బాగుండవు. కొంచెం సేపాగి ఏదైనా, తయారు చేస్తాను.

"ఏం వద్దు. మీరు వంటలో లీనమయితే, నేను ఉండే, ఈ కాస్సేపటిలోనూ, ఎవరితో మాట్లాడనూ ? పైగా, నాకిప్పుడు ఆకలిగా లేదు. ఉమ ఇంక వాదించకుండా వూరుకుంది. ఆమెకు కూడా అతడు చెప్పబోయే విషయాలని వినాలని చాలా కుతూహలంగా ఉంది.

గిరి ముఖం కడుక్కొని తయారయి "అలా బయటకుపోయి, మాట్లాడుకుందాం." అన్నాడు.

"అలాగే ! కానీ మీరు కోటువేసుకుని మఫ్లర్ చుట్టుకోండి. లేకపోతే, వచ్చేసరికి గడ్డ కట్టుకుపోతారు."

ఉమ తలమీదుగా వంటినిండా కాశ్మీరు శాలువా కప్పుకుంది. లోపల స్వెట్టర్ వేసుకుంది. అయినా చలికి ఆమె శరీరం కొద్దిగా వణకటం గమనించి, గిరి నవ్వుతూ "ఇంకా, ఇక్కడి వాతావరణం మీ కలవాటు కాలేదా ?" అన్నాడు.

"ఏం ? మీ కప్పుడే అలవాటయిందా ?"

"మేం మోటువాళ్ళం— వడగళ్ళు కురుస్తున్నా, నిప్పులు కురుస్తున్నా, సహించగలం."

"అది మోటుతనం కాదు. మీ ఓర్మి."

గిరి నవ్వి వూరుకున్నాడు.

వాళ్ళిద్దరూ నడుస్తుంటే దారిలో ఒక చోట చిన్న పిల్లలు ఆటలాడుకుంటున్నారు. అందులో మూడేళ్ళ పిల్లవాడు. ఒక పుల్లముక్కను తుపాకిగా చేసుకుని గురిపెడుతున్నట్లు అభినయించి, నోటితో "ఢాం ! ఢాం !" అంటున్నాడు. ఆ దృశ్యం గిరికి కూడా చూపించి ఉమ "ఈ చైనా వాళ్ళు ఎంత పుణ్యాత్ములో చూడండి. మన దేశంలో మూడేళ్ళ పసి వాడి దగ్గర్నుంచి, నూరేళ్ళ ముసలమ్మ వరకూ, ఇంతటి చైతన్యాన్ని కలుగ చేసారు. నిద్రపోతూన్న మనలను మేల్కొలిపారు. మన స్వాతంత్ర్యపు విలువను ప్రతిఒక్కరూ గుర్తించేలా చేసారు. ఇంతటి ఉపకారం మన మిత్రులు కూడా చేయలేరు." అంది.

"మీరు అసలైన హిందువులా మాట్లాడేరు. కీడులో గూడా మేలును గమనించటం హైందవుల లక్షణం."

"నిజమే ! ఏ జాతికైనా, కొన్ని సామాన్య లక్షణాలుంటాయనుకుంటాను. తమ లోపాలను తాము గుర్తించ గలిగే ఆత్మ పరిశీలన, వాటిని ఒప్పుకోగలిగే స్థైర్యమూ, త్యాగదీక్ష, విపరీతమైన ఉద్రేకమూ, ఆరంభ శూరత్వమూ, నిర్లక్ష్యమూ, అలసటా, మన జాతి సామాన్య లక్షణాలనిపిస్తుంది నాకు."

గిరి ఆలోచిస్తూ నడవ సాగాడు. అక్కడ ఒక భవనంవైపు చూపిస్తూ ఉమ "అదుగో అదే. మా మిలిటరీ హాస్పిటల్, ఇక్కడ అత్యవసరమైన కొంత ట్రీట్‌మెంట్ జరిగాక, జోర్‌హాట్ పంపిస్తాము. లేకపోతే, స్థలం సరిపోదు. ఈ సైనికుల మధ్య మా మనసు కూడా విచిత్రంగా ఉత్తేజమవుతుంది. ప్రతివారి మనసులోనూ, ఒకటే కోరిక. తన దేశం సంరక్షించుకోవాలని మృత్యు ముఖంలో ఉన్న ఏ ఒక్కడినైనా, ఏం కావాలని అడిగినపుడు, యుద్ధరంగంలో ఉన్న తన తోటి సైనికులకు తగిన సౌకర్యాలను అన్ని విధాలుగా కలిగించవలసిందిగా కోరుకుంటాడే గాని ఏ ఒక్కడూ, తన కుటుంబాన్ని గురించైనా తలవడు. తమ తోటి సైనికులే తమ కుటుంబము— దేశ సౌభాగ్యమే తమ సౌభాగ్యము అన్నట్లు ఉంటారంతా ! ఏ మాత్రం కోలుకున్నా, మళ్ళీ వెంటనే యుద్ధరంగానికి పరుగెత్తాలని ఆత్ర పడతారు. మేము విశ్రాంతి తీసుకోవాలని హెచ్చరించినా, వినిపించుకోరు. వీరి త్యాగ విరతి ముందూ,

వీరి కష్టాల ముందూ మనమూ, మన కష్టాలూ ఎంత అల్పమైనవో అనిపిస్తుంది— కారణం ఏదైనా, ఇక్కడికి వచ్చి, వీళ్ళ కోసం నేను చెయ్యగలిగింది చేస్తున్నందుకు, నాకు చాలా తృప్తిగా ఉంది'' అంట.

''కానీ, అక్కడ మీ కోసం, మీ తలిదండ్రులెంత క్షోభిస్తున్నారో, హరి ఎంత వ్యథ పడుతున్నాడో, ఆలోచించారా ? మొన్న హరి చెప్పాడు. మీ అమ్మగారి ఆరోగ్యం ఏమీ బాగులేదట. అహర్నిశమూ, మీగురించిన ఆలోచనలతో, బెంగతో ఆవిడ మంచం ఎక్కేలాగ ఉన్నారట. మీ నాన్నగారు సరేసరి ! ఆయన ప్రతివారితో మీ ప్రస్తావన తేకుండా ఉండలేరు. మిమ్మల్ని తలవని క్షణం ఉండదు.''

తన తలిదండ్రుల ప్రస్తావన వచ్చేసరికి ఉమ కళ్ళలో నీళ్ళు తిరిగాయి— చిన్న తనం నుండీ తన కెంతో గారాబ మిచ్చి తన ప్రతి చిన్న కోరికనూ నెరవేర్చే వాళ్ళ కోరికకు వ్యతిరేకంగా తానిక్కడకు వచ్చింది.

''మీరు, మా అమ్మనూ, నాన్న గారినీ చూశారా ?''

''లేదు నాకు హరి చెప్పాడు. హరి తరచు వెళ్ళి వాళ్ళను కలిసి వస్తూనే ఉంటాడు.''

ఉమ దీర్ఘంగా నిట్టూర్చి ఊరుకుంది. చాలా సేపు మౌనం వహించి, ''దురదృష్టవంతురాలిని. కని పెంచినందుకు వాళ్ళ కోరిక తీర్చలేక పోయాను.'' అంది.

ఇద్దరూ ఒక చిన్న మైదానంలో కూర్చున్నాక ''ఇప్పటికైనా, ఏం మించి పోయింది? మీ తల్లిదండ్రుల కోరిక తీర్చి, మీ ఋణం తీర్చుకోండి.'' అన్నాడు గిరి.

ఉమ గాద్గదికంగా ''క్షమించండి — అది నా చేతులలో పని కాదు.'' అంది.

గిరి కొంచెం సేపు తటపటాయించి ''నాకు తలచుకుంటే ఆశ్చర్యంగా ఉంది. మొట్ట మొదటసారిగా మనం దుర్గ విషయం ప్రస్తావిస్తూ ఆత్మీయంగా మాట్లాడుకున్నాం. ఆ నాటి నుంచీ మన మధ్య కొంత సన్నిహితత్వం అధికం కాసాగింది. ఆ నాడు మీకు ఆత్మీయురాలైన దుర్గ కోసరం మీరు నా వ్యక్తిగత విషయాల్లో కలిగించుకునేందుకు సంకోచించలేదు. ఆ ధైర్యంతోనే, నే నిప్పుడు నా ఆత్మీయుడైన హరి కోసం మీ వ్యక్తిగత విషయాల్లో కలుగ జేసుకుంటున్నాను.'' అన్నాడు.

''మీరు నా వ్యక్తిగత విషయాల్లో కలుగ జేసుకుంటున్నారని నేనేమీ అనుకోను. నా మీద మీకన్ని విషయాలలోనూ సంపూర్ణాధికారముంది. ఆ విషయం మీకూ తెలుసు. అయితే మీరిప్పుడు బావ తరఫున వచ్చారన్నమాట !''

''హరి తరఫున రాలేదు. హరి కోసం వచ్చాను'' హరీ, నేనూ చిన్నతనం నుండీ, ఒక్క ప్రాణంలా మెలిగాం. ఒకరి సంతోషం కోసం మరొకరు ఏమైనా, చెయ్యగలిగేటంత గాఢమైన స్నేహం మాది. హరి ఇప్పుడు పూర్తిగా మారిపోయాడు. అతనిలో వెనుకటి ఉత్సాహమూ, చైతన్యమూ మచ్చుకైనా లేవు. ఏదో పెద్ద జబ్బు పడి లేచిన వాడిలాగా ఉన్నాడు. ఎప్పుడూ చిలిపితనం ప్రతిఫలించే అతని కళ్ళలో ఇప్పుడు దైన్యం తప్ప మరొకటి కనుపించటం లేదు. హరి ఉద్రిక్త స్వభావుడు. అతని ఆరాధన కానీ, స్నేహం కానీ, ద్వేషం కాని, అన్నీ తీవ్రంగా ఉంటాయి. సంతోషం కాని, దుఃఖం కానీ, మనసా అనుభవిస్తాడు. అతడిని చూస్తే నాకు భయం వేస్తోంది. నా స్నేహితుడి కోసం, నేను ఏమైనా చెయ్యగలనేమో ప్రయత్నించటానికి వచ్చాను.''

ఉమ నీరసంగా నవ్వి ''ప్రయత్నించండి.'' అంది.

''అంత తేలిగ్గా తోసి పారెయ్యకండి ఉమాదేవీ ! నా ఉద్దేశం మీ కర్థం కాలేదంటే. నేను నమ్మను. మీ సమాధానం చెప్పండి.''

''అలాగే, నా సమాధానం కూడా మీకు తెలియదంటే నేను నమ్మను. నేను చెప్పేదేముందీ?''

గిరి మాట్లాడలేక పోయాడు. అతని లా పాండిత్యమంతా ఉమముందు ఎందుకూ, పనికి రాకుండా పోతూంది.

చటుక్కున ''మీరునన్ను ప్రేమిస్తున్నారా?'' అన్నాడు.

ఉమ ముఖం ఎర్రబడింది. ''అదే ప్రశ్న మిమ్మల్ని అడుగుతే ?''

''అవునని చెపుతాను. నా మనసంతా మీరే ఆక్రమించుకున్నారనీ, మీ ధ్యానంలోనే, నా ఆనందం వెతుకున్నాననీ చెపుతున్నాను.''

ఉమ పులకరాలతో నిండిన శరీరంతో, సంతోషంతో నిండిన కళ్ళతో, గిరి వంక చూసి ''ఇన్ని సంవత్సరాల నా తపస్సు ఫలించింది. ఈ మాటలు చాలు నాకు— వీటిని తలచుకుంటూ జీవితమంతా హాయిగా గడపగలను.'' అంది.

గిరి తమాషాగా నవ్వాడు.

''మీరు వినవలసింది ఇంకా ఉంది. నా ప్రేమను నేను గుర్తించక ముందు నుంచీ కూడా మీరు నా వారు కాలేరని నాకు తెలుసు. మిమ్మల్ని నా దాన్నిగా చేసుకోవాలనే, ఆశకానీ, ఆ ప్రయత్నం కానీ, నాలో లేనే లేదు. కేవలం నా మనసులోని భావనలతో మాత్రమే నేను సంతృప్తి పడగలను. కానీ, హరి సంగతి ఇందుకు పూర్తిగా వ్యతిరేకం. వూహాలు తెలియని పసితనం నుంచీ కూడా అతడు మిమ్మల్ని తన దానిగా భావించాడు. ఆ భావననే పెంచుకున్నాడు. అందుకనే, ఈ అఘాతానికి తట్టుకోలేక పోతున్నాడు. అత్యంత సున్నిత హృదయుడైన అతడు ఏ క్షణంలో ఏ మవుతాడో నని నాకిప్పుడూ భయంగానే ఉంటుంది. అతని జీవితం నాశనం చేయటం, మనకు న్యాయం కాదు.''

''మీరు చెప్పేది అంతా నిజమే ! కాని, ఇది మనసుకు సంబంధించిన విషయం— భావనలు వాటిఅంతట అవి పుట్తాయి. మనం కలిగించుకోలేం కదా !''

''అవును మన మనసులోని కోరికలకు వ్యతిరేకంగా కూడా కొన్నిసార్లు మనం ప్రవర్తించవలసి వస్తుంది. అది మన కర్తవ్యం.''

''అంటే మీరనేది హరిమీద నాకు ప్రేమ లేకపోయినా, అతడిని వివాహం చేసుకుని నా కర్తవ్యం నిర్వహించమనా ?''

''అవును.''

''కానీ అందువల్ల ఎవరికి సుఖం ?''

''మీరర్థం చేసికోవటం లేదు ఉమాదేవీ ? హరి మిమ్మల్నెంత గాఢంగా ప్రేమించాడో మీకంటే నా కెక్కువ తెలుసు. ఒక్క మీ వివాహ క్షమే అతడిని అన్ని దుఃఖాల నుండీ దూరంగా చేయ గలదు.''

ఆ సంగతి ఉమకూ తెలుసు. మాట్లాడలేక తల వంచుకుంది. ఆమె మనసులో ఎంత సంక్షోభం కలుగుతూందో అర్థం చేసికో గల్గిన గిరి లేచి ''పదండి పోదాం ! స్థిమితంగా ఆలోచించుకోండి. ఇంకొక ముఖ్యమైన సంగతి కూడా దృష్టిలో ఉంచుకోండి. ఎంత చదువుకున్నా, ఏమైనా మన సంఘంలో స్త్రీ అవివాహితగా ఉండటం దుస్తరం. సంఘం మాట అలా ఉంచి, వ్యక్తిగతంగా కూడా అలాంటి ఏకాంత వాసాన్ని భరించటం కష్టం. ఆ శూన్యాన్ని, భరించలేక మీరేనాడో ఒక నాడు వివాహం చేసికోక తప్పదు. ఎవరినో చేసికొనే బదులు, హరినే చేసికుంటే మీ కోసం పరితపించే ఒక ప్రాణిని సంతృప్తి పరచిన వారవుతారు'' అన్నాడు. ఎంతో గంభీరంగా ఉన్న అతని మాటలు ఉమ మనసులో, అంత వరకూ రేగుతున్న ఆనంద తరంగాలను పూర్తిగా అణచి వేశాయి. వెలవెల పోతూన్న ముఖంతో ''అంటే మీరు....'' అని సందిగ్ధంగా ఆగిపోయింది.

''నన్ను క్షమించండి ఉమాదేవీ ! నేను మిమ్మల్ని మొదటిసారిగా నా ప్రాణ మిత్రుడి కాబోయే భార్యగా చూశాను. బ్రతికి ఉన్నంత కాలమూ మిమ్మల్ని అలాగే గౌరవిస్తాను. ప్రస్తుతం నాకు పెళ్ళి చేసుకోవాలనిలేదు. ఆ కోరిక కలిగిన నాడు, నన్ను కోరే ఎవరినో ఒకరిని వివాహం చేసికుంటాను.''

గుండెలను చీలుస్తున్నట్లుగా వచ్చిన ఉమ నిట్టూర్పు తన గుండెలలోని మంటను మరింత అధికం చేసినా, ఆ జ్వాలను తనలోనే అణచుకుని, ప్రశాంతమైన చిరునవ్వుతో పాటు ఉమ వంక తిరిగి ''మనం సాధారణ మానవులం ఉమాదేవీ ! రాకూడదని ఆలోచనలు, మన మనసులలోకి అనేకం వస్తూనే ఉంటాయి. కానీ, వాటికి లొంగిపోకుండా, మన మార్గంలో మనం నడువ గలిగినప్పుడే మన మానవత్వం సార్థక మవుతుంది.'' అన్నాడు.

ఉమ సమాధానం చెప్పలేదు. లోకమంతా కటిక చీకటిగా ఉందామెకు.

ఇంటికి రాగానే హోల్డాలు చుట్టూకుంటూన్న గిరిని చూసి సంభ్రమంగా ''ఇప్పుడే వెళతారా ?'' అంది ఉమ.

''సెలవు లేదు. అయినా, ఇక్కడ ఉండి మీకు మరింత క్షోభ కలిగించటం తప్ప, నేను చెయ్యగలిగిందేమి ఉంది ?''

ఉమ నిలువెల్లా వణుకుతున్న శరీరంతో లేచి వచ్చి గిరి దగ్గర వాలిపోయింది. గిరి సంభ్రమంగా ''ఛీ ! ఉమాదేవీ ! లేవండి. ఇందుకు నేను అర్హుడిని కాను.'' అన్నాడు.

కానీ, ఉమ లేవలేదు. అతని పాదాలపై ఉమ కళ్ళలో నుండి ఆగకుండా ప్రవహిస్తున్న కన్నీరు అతని పాదాలమీద పడుతున్నది.

''ఈ ఒక్క కోరిక తీర్చుకోనివ్వండి. ఇందు వల్ల కలిగే పాప పుణ్యాలన్నీ, నా ఒక్క దానికే ?''

గిరి కరిగి పోయాడు.

''పాప పుణ్యాల సంగతి కాదు ఉమా ! సరే !

38 వ పేజీ చూడండి

# మహానగరం లండన్



పికడల్లి సర్కస్ సెంటర్



లండన్ బ్రిడ్జి

బొమ్మలు : వ్యాసం

ఎస్. వి. రామారావు

నేను లండన్ వెళ్లబోయే ముందు మిత్రులు శ్రీ డి. ఆంజనేయులు గార్ని అడిగాను, ఎలా వుంటుందో జీవితం అక్కడ అని. చాలా దేశాలు చూసిన మనిషి కావడం వల్ల చటుక్కున ఒక్క ముక్కలో చెప్పారు, "అది మనకు రెండవ ముఖ్య పట్నం," అని. నాకు అప్పటికీ అంతగా అర్థం కాలేదు. రెండవ ముఖ్య పట్నం అంటే ఏమిటో! ఇక్కడికి వచ్చిన కొంత కాలం తర్వాత తెలిసింది, లండన్‌కు మన దేశపు రాజకీయాల్లో వ్యాపారంలో, ఆధునిక జీవిత రంగంలో ఎంత స్థానం ఉందో.....

ఇక్కడికి కొత్తగా రాగానే ఎక్కడలేని సంతోషం వస్తుంది. ఎంత మంది మనవాళ్లని చూస్తాం! వీళ్లంతా ఇక్కడ ఏం చేస్తున్నారా అని ఆశ్చర్య పోతాం. హోటలు సర్వర్లుగా, కాషియర్లుగా, యూనివర్సిటీ విద్యార్థులుగా— అంతరిక్ష యానశాస్త్ర పఠనంనుండి సంస్కృతం దాకా చదువుతారు— వస్తారు వాళ్లంతా. ఇక్కడ వందల కొలది 'ఇండియన్ రెస్టారెంట్లు' ఉన్నాయి. 'మద్రాసు' హోటల్ అనే పేరు చూసి లోపల తమిళం మాట్లాడితే తెలుస్తుంది ఇవెంత 'మద్రాసు' హోటళ్లో! వీటిని నడిపే వాళ్లు ఎక్కువగా తూర్పు బెంగాలు ముసింలు. అట్టే చదువు లేనివాళ్లు కాబట్టి ఈ వ్యాపారం పెట్టేస్తూ ఉంటారు. సరే వారి అల వాట్ల వల్ల భారతీయులకి అప్రతిష్ఠ వచ్చేసింది! ఇండియన్లంతా 'కరా' వాసన వేస్తారని అపోహ ఎందరో ఇంగ్లీషు వారికి ఉంది. మన స్టూడెంట్లు గదుల కోసం వెడితే గదిలో వంట చెయ్యరాదనే షరతు పెడ్తారు. అసలు ఇంగ్లీషువారికి వంట సంగతేం తెలుసు? ఉడక పెట్టి తినటం ఒక్కటే చాతనవును! యూరప్‌లో ఇంగ్లీషు వంటని తక్కువ చూపు చూస్తారు........

---

**ఇదే సంచికలో వేరేచోట మరొక వ్యాసంకూడా వేశాము. దయచేసి 'మనలోమాట' కూడా చూడండి.**

---

లండన్ గురించి వ్రాస్తూ ఈ భోజనం గొడవ ఏమిటి, ముందుగా, అని మీకు అనిపించ వచ్చు కాని ఈవూరికి వచ్చే భారతీయులందరికీ ఇదొక పెద్ద సమస్యకదా! ఇంకా నేను ప్రతిరోజు 'లంచ్'కి 'ఇండియా హౌస్' నడిచి వెడుతూ ఉంటాను. లండన్‌లో ఇండియన్ హోటళ్లు మన దేశం వారి పోషణ లేకపోతే ఎక్కువ కాలం నిలవ్వేమో!

ఈ మహా నగరం నిండా ఎంతో అందమయిన పురాతన భవనాలు ఎన్నో కనిపిస్తాయి. ఇప్పుడిప్పుడే అమెరికన్ అగ్గి పెట్టె రకపు ఆధునిక భవనాలు పైకి లేస్తున్నాయి. చుట్టూ గ్లాసు, లోపల వెలిగే దీపాలు, పనిచేసేవారు బయటికి బాగా కనిపించటం వాటి ప్రత్యేకత. థేమ్స్ నది వడ్డునే వరసగా వెలిగి పోయే ఇవి మనల్ని చకితుల్ని చేస్తాయి. కాని అప్పుడే విమర్శ మొదలయింది. ఇవి పాత లండన్ అందాన్ని చెడగొడుతున్నాయని! క్రమంగా అమెరికన్ ప్రభావాలు జీవితంలో అన్నివిషయాల మీదా ప్రసరిస్తున్నాయి.

## థాంక్యూ థాంక్యూ

ఇంగ్లీషువారికి 'మేనర్స్' ఎక్కువ! మీరు వస్తూంటే ఎవరయినా తలుపు తీసారనుకోండి, 'థాంక్యూ' అనాలి. కాఫీ అందిస్తే థాంక్యూ, కోటు అందిస్తే థాంక్యూ, యంత్రం లాగ ఈమాటలు రోజుకి ఎన్నిసార్లు వాడుతారో అంతుండదు.

కాస్త ఎండ వచ్చిందంటే చాలు లండన్‌లో పార్కులు జనంతో నిండుతాయి. ఎండలో కూర్చునేందుకు కుర్చీలు కూడా అద్దెకు ఇస్తారు! ఆ చిరు ఎండలో కూర్చుని తన్మయులై పోతారు అందరు. థేమ్స్ నదితీరం మీదనే 'బాటర్ సీ పార్క్' ఉంది. ఇందులో ఎన్నో శిల్ప ప్రదర్శనలు జరుగుతూ ఉంటాయి, ఇవికాక ఎన్నో నాటకాలు, కచ్చేరీలు, అయినా హడావుడిగా ఉండే లండన్‌తో పోలిస్తే ప్రశాంతంగా ఉంటుంది. చేపలు పట్టే కొలనులు, టెన్నిస్ కోర్సులు ఎందరినో ఆకర్షిస్తాయి.

## హైడ్‌పార్క్ సంగతి

'రీజెంట్' పార్క్‌లోనే 'జూ' ఉంది, పిల లతో పెద లతో కిటకిటలాడుతూ ఉంటుంది. ప్రపంచ ప్రసిద మయిన 'హైడ్' పార్క్ సంగతి సరేసరి! 'సోప్‌బాక్స్ ఒరేటర్' ల (సబ్బు పెట్టె ఉపన్యాసకుల!)ను గురించయినా వినే ఉంటారు. ఒక సబ్బుపెట్టె (అంటేచిన్న సబ్బుపెట్టెల్ని పెట్టే పెద్ద చెక్క పెట్టె) బోర్లించి దానిమీదనుంచుని ఉపన్యాసాలు ఇచ్చేవారు వినేవారు ఎందరో ఉంటారు. (ఈ పార్కులోనే మన కృష్ణమీనన్ కూడా మాట్లాడటం జరిగిందిట...) ఒకవైపు బ్రిటిష్ ప్రభుత్వం సామ్రాజ్యవాదాన్ని చీల్చి చెండాడేవారు, మరొక వైపు కాశ్మీర్‌లో భారత దేశం చేసే అక్రమాలను ఖండించే పాకిస్తానీలు—వక్తలకి తక్కువ ఉండదు.

మద్రాసులో మనం బీచికి వెళ్లినట్లే ఇక్కడి వారు సాయంత్రం థేమ్స్ నది వడ్డునే నడిచి పోతూ ఉంటారు— 'థేమ్స్ ఎంబాంక్‌మెంట్' అంటారు దీనిని. చిన్న చిన్న డింగీలు వాటిలో ఎప్పుడూ తిరుగుతూనే ఉంటాయి. నదిపైన ఎన్నో వంతెనలు; రోడ్డు పైన ఇండ్లకు చేరే కార్ల ప్రవాహం ఒకపక్క; నెమ్మదిగా తనకేమీ పట్టనట్లు చీమనడక నడిచే నది ఒక పక్క; అందమయిన



సెంట్ పాల్

# ఆక్స్‌ఫర్డ్ స్ట్రీట్ రాత్రిపూట చూడ ముచ్చటగా వుంటుంది!

## లండన్ మహాసముద్రం లాంటిది. ఎంతమందినైనా యిముడ్చుకోగలదు తనలో...

వది వయ్యారాన్ని నిండుగా, లైట్లతో మెరుస్తూ ఉన్న గంభీరమయిన అంతస్థుల భవంతులు ఆశ్చర్యంతో చూస్తూ వరుసగా నిలబడి ఉన్న వారు ఒక ప్రక్క; వాటి మధ్య సన్నగా పేలికలాగ ఉన్న పేవుమెంటు మీద ఉన్న నడిచే మనం చల్లని గాలిలో మనని మనం మర్చిపోతూ ఉంటాము. కొద్దిదూరంలో ఆకాశాన్ని చీల్చుకుంటూ పైకి లేచే 'సెయింట్‌పాల్స్' కనిపిస్తుంది. ఈ సోయగాన్ని ఏమని వర్ణించను! కలిసి నడుస్తున్న జంటలు చటుక్కునఆగి, ఏదో మర్చిపోయి జ్ఞాపకం తెచ్చుకున్నవారిలాగ రోడు మీదనే ముద్దుపెట్టుకుంటూ ఉంటారు. మనకి ఇది ఆశ్చర్యం కలిగిస్తుంది......

రాత్రిపూట నడిచేచోటు వేరేఉంది. ఆక్స్‌ఫర్డ్ స్ట్రీట్. ఇది మద్రాసు మవుంట్‌రోడ్డు, హైద్రాబాదు, అబిడ్స్‌వంటిది. పెద్ద పెద్ద బట్టలషాపులు, వాటిలో వేలం వెర్రిగాకొనే ఆడవారు, ఎప్పటికప్పుడే జరిగే 'డిస్కౌంట్' సేల్‌లు, అమ్మాయిల అందాలని పెంపొందించే 'బూట్యీ పార్లర్'లు. . . .వీటన్నిటికీ తగిన ఫాషన్లు అప్పుడప్పుడూ మారిపోతూ ఉంటాయి! ప్రాచీన ఈజిప్టు కేశాలంకరణ, బీటిల్స్‌వి అలంకరించే విగ్గులూ, రకరకాల దుస్తులు.......ఇంత 'ప్రొడక్షన్'కి కారణం ఇంత 'కన్సంప్షన్' నేమో.....

### ఏళ్ళతరబడి నాటకాలు

కొన్ని నాటకాలు సంవత్సరాల తరబడి నడుస్తాయి ఇక్కడ. వీటిలో వేషాలువేసేవారంటే చాల గౌరవం—వారినే సినిమాలలోకి కూడా తీసుకుంటారు.......ఇక్కడ నాటక రంగాన్నిచూస్తే మనకున్న నాటకరంగం ఈ రోజుల్లో చనిపోయిందేమో అనిపిస్తుంది. లోగడ తెలుగు నాటకాల గురించి, రంగస్థలం గురించి ఘనంగా చెప్పగా విన్నాను. కాని, నేటి పరిస్థితి అధ్వాన్నంగాఉంది. సినిమాను చేసిపారవేస్తున్నారు మనవాళ్లు నాటక రంగాన్ని. ఇక్కడ సినిమాలను నాటకరంగంలా చూపించాలనే తహతహఉంటే మనవారికి ఎంత ప్రసిద్ధ పురాతన నాటకాన్నయినా సినిమాలాగ చూపించాలని అభిలాష. ఇలాంటి తీరు మనవారిది. ఉదాహరణకి చెబుతాను. భారతదేశం అధ్యక్షుడు శ్రీ రాధాకృష్ణన్ ఇంగ్లండుకివస్తే ప్రత్యేకంగా ఆయనకి షేక్స్పియర్ నాటకంవేసి చూపించారు. నాటకం టిక్కెట్లకోసం జనం రోడ్లమీదే రాత్రింపగళ్ళు తిష్టవేసి మరీ కొంటారు.

లండన్‌లో మ్యూజియంలు, గాలరీలు కొల్లలు. వాటిలో అతి ప్రసిద్ధమయినవి, బ్రిటిష్ మ్యూజియం, నేషనల్ గాలరీ, టేట్‌గాలరీ, విక్టోరియా ఆల్బర్ట్ మ్యూజియం, కోర్టాల్డ్ ఇన్‌స్టిట్యూట్......బ్రిటిష్ మ్యూజియంలో భారత కళా విశేషాలు ఎన్నో ఉన్నాయి. ఇవన్నీ దొంగతనంగా మన పాత దొరలు తెచ్చినవే అనుకుంటాను!

ట్రఫాల్గర్ స్క్వేర్‌కి దగ్గరలోనే ఉంది. 'హౌవ్స్ ఆఫ్ పార్లమెంట్' బ్రహ్మాండమయిన నిర్మాణం. దీని టవర్‌మీద గడియారం గంటలు కొడుతూఉంటే ఘంటసాలవారి పాట గుర్తుకి వస్తుంది నాకు. ఈ పరిసరాలలో థేమ్స్ నది అందం ఇంతా అంతా కాదు. ఎందరినో ముగ్ధుల్ని చేసింది......

### వెస్ట్‌మినిస్టర్ అబ్బే!

ఎదురుకుండా వెస్ట్ మినిస్టర్ అబ్బే ఉంది. ఇందులోనే బ్రిటిష్ రాజులు (రాణులు) పట్టాభిషేకాలు చేసుకుంటారు. ఎనిమిదవ శతాబ్దంనుంచి ఇక్కడ చర్చి ఉండేది. 1042 లో పాతదానిని పడగొట్టి కొత్తది కట్టించారుట. దీని ఆవరణలోనే ఎందరో సుప్రసిద్ధ ఆంగ్లేయులని భూస్థాపితం చేశారు. కవులని అందరినీ ఒక వైపు, ఇతర వర్గాలవారికి వేరే వేరేచోట్ల, ఇలాగ ఏర్పాటు చేశారు సమాధులని.

'సెయింట్ పాల్స్' ఉన్నచోట ఒకప్పుడు 'డయానా'కి కట్టిన గుడి ఉండేదిట! నేడు అక్కడ ఒక మహా క్రైస్తవాలయం ఉంది.....

'టవర్ ఆఫ్ లండన్' లో ఎంతో చరిత్ర దాగి ఉంది. బందీలుగా ఉన్నవారు, ప్రాణాలు కోల్పోయినవారు ఎందరో ఈ కోటలో! ఇక్కడే ఎనిమిదవ హెన్రీ తన భార్య ఆనెబొలీన్ తల నరికించాడు. ఇక్కడే బిషప్ ఫిషర్, సర్ థామస్‌మోర్, కేథరిన్ హవర్డ్, ఎర్ల్ ఆఫ్ ఎసెక్స్ మొదలయినవారి తలలు ఎగిరాయి. ఇక్కడ కారాగృహవాసం అనుభవించినవారిలో కొందరు—సర్ వాల్టర్ రాలీ, ఎలిజబెత్‌రాణి, (మొదటి ఆవిడ!) మొదటి జేమ్స్.

పక్కనేఉన్న టవర్ బ్రిడ్జిని యంత్ర సాధనల వల్ల పైకి ఎత్తి దింపవచ్చు! (క్రింద పెద్ద నావలు పట్టవని ఈ ఏర్పాటు చేశారు.)



కాథెడ్రల్



ట్రఫాల్గర్ స్క్వేర్

పికడిల్లీ సర్కస్ లండన్—పారిస్ అని చెప్పుకుంటారు. ఇక్కడ మెరిసిపోయే ఎడ్వర్టయిజుమెంటు లైట్లు, పెద్ద పెద్ద హోటళ్లు, నైట్ క్లబ్బులు, వింతలు, వినోదాలు ఎన్నో చెప్పలేము.

లండన్ 'పబ్'లు చాలా ప్రసిద్ధి! బీర్, విస్కీ వంటి పానీయాలు అమ్మేవన్నమాట ఇవి. వాటిని తాగుతూ, సరదాగా కబుర్లు చెప్పుకునేందుకు వస్తారు ఎందరో.

## నీగ్రోలు చాలామంది

ఈ నగరంలో నీగ్రోలు చాలామంది ఉన్నారు. బస్ కండక్టర్లుగా, క్రింద ట్యూబ్ స్టేషన్‌లో చిల్లర పనులకీ, రోడ్లమీద చిల్లర పనులకీ కుదుర్తూ ఉంటారు వీరు. ఇక్కడా 'కలర్ బార్' కొంత ఉంది. అయినా పెద్ద గొడవ లేమీ జరగవు.

పాకిస్తానీలు, ఆస్ట్రేలియన్‌లు, వెస్టిండియన్‌లు, ఇంకా ఆఫ్రికన్ దేశస్థులు, ఎంతమంది వస్తారు! వచ్చి స్థిరపడిపోతారు! అందరూ లండన్ తమ దేశపు రెండవ ముఖ్యపట్నంగానే భావిస్తారు. లండన్‌మీద తమకు ఏదో హక్కు ఉందనే భావం అందరికీ 'కాస్త కూస్త' ఉంటుంది! ఈ నగరంలోనే ఉండిపోయి, పేరు గడించిన కొందరు భారతీయ చిత్రకారులు ఇద్దరు, ఎఫ్. ఎన్. సూజా అవినాష్‌చంద్రలు.

"చూచి చూడగానే లండన్ ఏ గవర్నర్ జనరల్‌గానో, న్యాయాధిపతిగానో లేక మధ్యవర్తిగానో కనిపిస్తుంది. అధికారం చలాయించటానికే లండన్ నిర్మింపబడింది అసలు. ఇప్పుడు అంతా పోయింది కదా! "డవునింగ్‌స్ట్రీట్ ఇక యావత్ప్రపంచపు గుత్తాధికారికాదు......" అని వాపోయాడు ఒక ప్రముఖ రచయిత. లండన్‌కి ఉండే ఓర్పు అపారమయినది. ఇది సముద్రంలాంటిది. ఎంతమందినయినా గ్రహించగలదు. తనకు తానై బ్రతకలేదు. ఆహార వస్తువులు దిగుమతి చెయ్యాలి, ఇతర వస్తువులు ఎగుమతి చెయ్యాలి, అప్పు లివ్వాలి, రాబట్టుకోవాలి—ఇదే దీని కీలకం.కనుకనే తిట్టినా భరాయిస్తుంది. మెచ్చినా భరాయిస్తుంది. కాలాన్ని బట్టి మారుతుంది. అందుకే మనకందరికీ లండన్ అంటే ఒక విధమయిన ప్రేమ. పాత పరిచయాన్ని బట్టి ఒక విధమయిన అధికారం, ఆ పాత పరిచయమే లండన్‌ను ఎన్నో పాత సామ్రాజ్యాలకు కీలకం చేసింది. అందుకనే ఈనాడు మాస్కో, వాషింగ్టన్‌ల మధ్య కూర్చునే అధికారం సంపాదించుకుంది. 

హవుస్ ఆఫ్ పార్లమెంట్: బిగ్ బెన్

# సంపెంగ పొదలు

31 వ పేజీ తరువాయి

మీ జీవితం శుభప్రదం కావాలని ఆశీర్వదిస్తున్నాను.'' అని ఆమె శిరసుపై చేయివేసి నిమిరాడు.

గిరి లేవతీయాలని ఎంత ప్రయత్నించినా, కొన్ని క్షణాల వరకూ, ఉమ అతని చెంత నుంచి లేవనే లేదు. తరువాత లేచి, ముఖం కడుక్కుని తనూ తయారై ''నేను కూడా స్టేషనుకు వస్తాను'' అంది.

ప్రశాంతంగా ఉన్న ఆమె ముఖంలోకి చూస్తూ ముగ్ధుడై గిరి ''రండి'' అన్నాడు.

''నన్ను 'మీరు' అని పిలవట మెందుకూ? 'నువ్వు' అని పిలవలేరా ?''

''నాకు లేని హక్కును వినియోగించుకోవటానికి ప్రయత్నించట మెందుకూ ?''

ఉమ సమాధానం చెప్పలేదు.

ట్రైను ఎక్కుతూ ''ఏం నిశ్చయించుకున్నారూ ?'' అని అడిగాడు చివరికి సారిగా గిరి.

ఉమ తల వంచుకుని ''రేపే బావకు ఉత్తరం వ్రాస్తాను. కానీ, నా ఉద్యోగం, నేను చేసుకోవటానికి బావ అంగీకరిస్తేనే, మా వివాహం జరుగుతుంది.'' అంది.

గిరి సంతృప్తిగా నిట్టూర్చాడు. ట్రైను కదలబోయే సమయానికి ఉమ తన చెయ్యి అందించింది గిరికి. గిరి ఆ చెయ్యి అందుకుని ఆప్యాయంగా నొక్కి విడిచి పెట్టాడు. కాలచక్రంలా రైలు కూడా అమితమైన వేగంతో ముందుకు సాగిపోయింది.

## 22

దుర్గకు నెల తప్పిందనే వార్త అందరికీ సంతోషాన్ని కలుగజేసింది. ఇక శంకర్ గర్వానికి హద్దులు లేవు. గిరి వచ్చి హెచ్చరించిన దగ్గరనుంచి అతనిలో పరివర్తన కలుగ సాగింది. అన్నిటికంటే తన సంసారంలో నిత్యమూ కలిగే చికాకులు, అతనే భరించలేక పోతున్నాడు. దుర్గ తనను గాఢంగా ప్రేమిస్తూందని శంకర్‌కు తెలుసు. గిరి మాటలవల్ల తానా ప్రేమను పోగొట్టుకుంటానేమోననే భయం, శంకర్‌లో కలిగింది. కానీ, తన సర్వ శక్తులు, కేంద్రీకరించుకొని తానొక, మనిషిగా నిలబడాలని ప్రయత్నించిన దుర్గ, తన ప్రయత్నం విఫలంకాగా, ఒకవిధమైన నిర్లిప్తతను అలవరచుకుంది. ఇప్పుడామె శంకర్ ఆప్యాయతకు పొంగి పోవటమూ లేదు — అతని నిరాదరణకు కృంగి పోవటమూ లేదు. శంకర్ దుర్గను ప్రసన్నురాలినిగా చేసుకోవటానికి శతవిధాల ప్రయత్నించాడు కానీ, ఆమెలో నిజమైన చైతన్యం తీసికొని రాలేక పోయాడు. శంకర్ నిజమైన ఆప్యాయతతో పలకరించినా దుర్గ అది నిజమని నమ్మలేక పోతుంది. ఆమెకు ప్రతిదీ కృతిమంగానే కన్పిస్తుంది.

దుర్గకు ఏడవనెల ప్రవేశించింది. సావిత్రమ్మ వచ్చి సూడిదలు చేసి దుర్గను తీసికెళ్ళబోయింది. శంకర్, అభ్యంతరం పెట్టాడు. దుర్గను చాటుగా గదిలోకి పిల్చి, ''నిన్ను విడిచి ఉండలేను దుర్గా ? పోనీ, పురుడు ఇక్కడే పోసుకుంటేనేం?'' అన్నాడు.

దుర్గ నమ్మలేనట్లు చూచింది. అతని వంక అట్లాంటి మాటలు విని ఎన్నో యుగాలయినట్లుగా ఉంది దుర్గకు. తీరా, వెళ్ళబోయే సమయానికి దుర్గకు కూడా, తానింకా శంకర్‌ను ఎంతగా ప్రేమించేదీ అర్థమయింది. — శంకర్‌ను విడిచి ఐదారు నెలలుండాలనే భావనకు ఆమె తట్టుకోలేక పోతూంది. నిద్రిస్తున్న ఆమె హృదయం కొద్దిగా కనులు విప్పింది. శంకర్ మెడచుట్టూ చేతులు వేసి, గుండెల మీద తల ఆన్చి, ''నాకూ వెళ్ళాలని లేదు. కానీ, అమ్మ కష్టపెట్టుకుంటుంది. ఈ కొంచెం రోజులూ, ఓపిక పట్టండి, మీ బాబుతో సహా తిరిగి వస్తాను.'' అంది.

''వీల్లేదు. నువ్వెలా వెళ్తావో చూస్తాను.'' అన్నాడు శంకర్ చటుక్కున — దుర్గ ముఖం వెలవెల పోయింది. అతని మెడను చుట్టిన ఆమె చేతులు అప్రయత్నంగానే సడలి పోయాయి. ''ఇంతేనా ?'' అన్నట్లు శంకర్ వంక చూస్తూ నిల్చుంది.

శంకర్‌కు తన పొరపాటు తెలిసి వచ్చింది.

''సరే ! వెళ్ళు.'' అన్నాడు.

అన్నాడే కాని, అతని ముఖంలో విసుగు స్పష్టంగా కనిపిస్తూంది. దుర్గతో మరేమి మాట్లాడకుండా బయటకు వెళ్ళిపోయాడు. దుర్గకేమి తోచలేదు. సావిత్రమ్మ దిగాలుగా హాల్లో కూర్చుంది. దుర్గ బయటకు రాగానే ''ఏం దుర్గా ! నువ్వురావా ? ఇక్కడ నీకెవరు చేస్తారూ ?'' అంది.

దుర్గ తల్లి ఒడిలో తల పెట్టుకుని మౌనంగా కూర్చుంది. శంకర్‌కు తాను వెళ్ళటం ఇష్టం లేదు. వెళ్ళకపోతే, తల్లి ఎంతో బాధపడుతుంది. వెళ్ళక తనూ ఉండలేదు. శంకర్‌లో ఏ పరివర్తన కోసం ఇన్నాళ్ళు తపస్సు చేసిందో ఆ పరివర్తన కనుపించీ కనుపించకముందే, పరిస్థితులిలా వచ్చాయి. ఛీ ! తనంత దురదృష్టవంతులు ఇంకెవరూ ఉండరు.

సావిత్రమ్మ కూతురి తల నిమురుతూ ''ఏరి కోరి చేసుకున్నారు. ఎంతో సుఖపడతారని అనుకున్నాను ఎందుకమ్మా ! మీ కలతలన్నీ ?'' అంది.

''నా దురదృష్టానికి ఇంకా వేరే వ్యాఖ్యానాలెందుకమ్మా !'' దుర్గ దీనంగా అంది. సావిత్రమ్మ కడుపు తరుక్కు పోయింది. దుర్గ చూడటానికి చాలా బలహీనంగా ఉంది. దీనికి తోడు ఏడవనెల — ఆమెను అక్కడ వదిలి వేయడం, సావిత్రమ్మకెంతమాత్రమూ ఇష్టం లేదు. ''ఈ కలతలన్నీ అవే సర్దుకుంటాయి. నువ్వు బయలు దేరు'' అంది. దుర్గ కూడా నిశ్చయించుకుంది. కొన్నాళ్ళు తన తల్లి వడిలో, తను పుట్టి పెరిగిన ప్రదేశంలో మసిలిరావాలని దుర్గ కూడా తహతహలాడుతూంది.

దుర్గ తన సామానులన్నీ సర్దుకుంటూంటే శంకర్ మనసులో మండసాగింది. తనను విడిచి వెళ్తున్నదనే బాధ కంటే, తన మాట కాదని వెళ్తున్నదనే బాధ అతనికి అధికం కాసాగింది. ఎంత అణచుకుందామన్న, అతనిలో ఏదో కసి పెరుగుతూంది. దుర్గ దగ్గరగా వచ్చి ''అవును. మనసులో ప్రేమలేని వాళ్ళను ఎవరు కట్టి పడేసి ఉంచగలరు ?'' అన్నాడు.

దుర్గ ఒకసారి తలెత్తి చూసి మళ్ళీ మాట్లాడక తన పని తాను చూసుకోసాగింది.

''నాలాంటి చదువుకోని వాడి దగ్గర నీకేం తోస్తుందీ ? అక్కడికి వెళ్తే, హాయిగా అందరూ నీలా చదువుకున్న వాళ్ళు—నాలా మోటుగా మాట్లాడక చక్కగా సంస్కారంగా మాట్లాడతారు. నీకు హాయిగా ఉంటుంది.''

దుర్గ లేచి బీరువా తాళం చెవులు శంకర్

చేతి కిచ్చి "జాగ్రత్త" అంది.

శంకర్ ఆ తాళాలు విసిరికొట్టి "నాకెం దుకూ ?" అన్నాడు.

"అయితే, అత్తగారి కిస్తాను." అని దుర్గ వెళ్ళి పోయింది.

శంకర్ మనసు మరింత కుతకుత లాడుతూంది. ఏదో ఉడుకు మోత్తనమూ, ఏదో కసి, ఏదో అశాంతి.

ఈ దుర్గ ఇలా తయారయ్యిందేం ?

కొంచెం సేపటి వరకూ, దుర్గ మళ్ళీ వస్తుం దేమోనని ఎదురు చూసాడు. ఆమె ఎంతకూ రాకపోయే సరికి తానే "దుర్గా" అని పిలిచాడు. దుర్గ వచ్చింది.

"పిలిచారా ?"

"అవును. నీకు తొందరగా నా నుంచి విరగడై పోవాలని ఉంది. కానీ, నేను మాత్రం నిన్ను వదల లేక పోతున్నాను. నీకిష్టం లేక పోయినా, నా కోస మైనా కాస్సేపు నా దగ్గర కూర్చో ! ఈ శ్రమ ఇంకొంచెం సేపు పడు."

దుర్గ మాట్లాడక వచ్చి శంకర్ ప్రక్కనకూర్చుంది.

శంకర్ రోషంగా "ఏం మాట్లాడవేం?" అన్నాడు.

చాలా రోజులకు దుర్గ పకాలున నవ్వింది. ఆమెలో మళ్ళీ చిలిపితనం ప్రవేశించింది.

"ఏం మాట్లాడాలో కూడా మీరే చెప్పండి." అంది.

శంకర్ త్రాచుపాములా బుసలు కొట్టూ, అటూ, ఇటూ పచారులు చేస్తూ "నువ్వు ప్రయా ణం మానడానికి వీల్లేదా ?" అన్నాడు.

"వీల్లేదు."

శంకర్ నిర్ఘాంత పోయాడు. క్షణ కాలం దుర్గ మొఖంలోకి చూసి "అయితే అనుభవిస్తావు." అన్నాడు.

దుర్గ లేచి వెళ్ళి రూళ్ళ కర్ర పట్టుకొచ్చి శంకర్ చేతికిచ్చి "ఆ అనుభవించేదేదో తొందరగా అనుభవింపజెయ్యండి— మళ్ళీ ఎన్నాళ్ళకో !!" అంది.

శంకర్ కళ్ళు ఎర్రబడ్డాయి. అతనిలోని పశుత్వమంతా ఒక్కసారి విజృంభించింది.

"ఊహు ! నీ మీద ప్రేమ ఉన్నన్నాళ్ళూ నువ్వు నా దానివనుకున్నన్నాళ్ళూ, నిన్నలా శిక్షించను. వెళ్ళు— ఇక నీకూ, నాకూ ఏం సంబంధం లేదు. అక్కడ నీ మొగ స్నేహితులందరూ, నీ కోసం ఎదురు చూస్తూ ఉంటారు. పరిగెట్టు."

శంకర్ పళ్ళు పటపట నూరాడు. దుర్గ పైకి ఎంత బింకంగా మంచుండో, లోలోపల, ఆమె గుండెలంత పగిలిపోతున్నాయి. అక్కడి నుంచి అతి నిగ్రహంతో బయటకు వెళ్ళి, తల్లి ఒడిలో పడి బావురు మంది. "లాభం లేదమ్మా! ఏం లాభం లేదు. నీకు నేను కూతురినవనే మాట మరచిమరచిపో!"

సావిత్రమ్మ గుండె కలుక్కుమని "ఛీ ! ఛీ! ఆవేం అవాచ్యపు మాటలు ?" అంది.

అంతలో కామేశ్వరమ్మ అక్కడకు వచ్చింది.

"నువ్వు మరీ పిచ్చిదానివమ్మా దుర్గా ! వాడేదో, నిన్ను విడిచి ఉండలేక వెళ్ళవద్దంటే, ఇలా గందర గోళ పడ్తా వేమిటి ? ఇంకొకరయితే, మురిసి పోయేవారు. బొత్తిగా వెర్రిమాలోకం— వాడితో రెండు మంచి మాటలుమాట్లాడి ప్రయాణంకా! తెలివి తక్కువగా రొస్ట్ట పెట్టకోకు.' అంది కామేశ్వరమ్మ.

ఎంత జరిగినా, దుర్గ ప్రయాణం మాను కోక పోవటం, శంకర్ మనసులో జ్వాలలు లేచాయి తానొక ఆడదాని ముందు ఓడిపోతున్నాడు. తన భార్య తనను లెక్క చెయ్యకుండా వెళ్ళిపోతూంది.

దుర్గ వెళ్ళబోయే ముందు శంకర్ దగ్గరకు వచ్చి "వెడుతున్నాను." అంది.

"నాకు చెప్పాలా ?"

"అది నా ధర్మం."

"ఓహో ! నీకు ధర్మం కూడా తెలును. ఎప్పు డక్కడకు పోయి, అడ్డు, అయుపూ లేకుండా ఇష్ట మొచ్చిన వాళ్ళతో వూరేగుదామా ? అని చూస్తున్న దానవు. నీ కిక్కడ కాలెలా నిలు స్తుందీ ?" అంత వరకూ నిగ్రహించుకున్న దుర్గ, ఇక ఓర్వలేక పోయింది.

"మీరీ మాటలు నిజంగా అనక పోతే, నేను వీటి నసలు మనసుకు పట్టించుకో నక్కరలేదు. నిజంగానే అంటే, నేనసలు ఇక్కడ ఉండవలసిన అవసరమే లేదు. మీ ప్రేమ స్వరూపం అర్థం చేసికో లేక పోతూన్నందుకు క్షమించండి. కానీ, నా ఆరోగ్యం ఏమీ బాగుండలేదు. నాకు విశ్రాంతి కావాలి. అత్తగారు అన్ని విధాలా సహాయం చేస్తున్నా నేను స్వతంత్రంగా ఆమెను సహాయం కోరలేను. న్యాయంగా ఈ పరిస్థితిలో మీరే నన్ను ప్రోత్సాహ పరచి పంపించవలసింది పోయి, వెళ్ళవద్దని పంతం బట్టి కూర్చుంటే నేనేం చెయ్యాలి ? మీ మాటను నే నెప్పుడూ గౌరవిస్తాను. కానీ మీ మాటకోసరం ఈ పరిస్థితిలో నా ఆరోగ్యం నాశనం చేసు కునేటంత స్వార్థ త్యాగిని కాలేక పోయినందుకు మన్నించండి."

అక్కడ నిలబడకుండా వెళ్ళిపోయింది దుర్గ. (సశేషం)

లిగించి ఆలోచనల్లో పడ్డాడు. మనసులో రామచంద్రాన్ని తిడ్తున్నాడు. సిగరెట్ కేస్ తెరిచాడు. సిగరెట్లు అయిపోయాయి. అది ఖాళీగా వుంది. మంచం మీద వాలి పోయాడు.

సీత ఏడుస్తుంది. రామచంద్రం ఏదో అంటున్నాడు. అస్పష్టంగా వినిపిస్తున్నాయి మాటలు. గంగరాజు మెదడ్లో ఆలోచనలు సుడులు తిరుగుతున్నాయి.

— 'బ్రూట్ ! తనను అవమానించాడు. తను మోసం చేస్తున్నాడా ? ఎవరిని ? సీతనా. ఎందుకు ? తనెందుకు మోసం చేస్తున్నాడు. తనకేం కావాలి ? సీతకేం కావాలి ? తను సీతను ప్రేమిస్తున్నాడా ? ఛ — అదొట్టి అవివేకం. కాని సీత తనను ప్రేమిస్తుందేమో! అలాంటప్పుడు ఆ ముసిలి రోగిష్టి కోసం ఎందుకా ఏడుపు ? ఎందుకా కంగారు ? కాకమరి ! తను సీతను ఆదరించ గలుగుతాడా ? లేదు. అది ఎన్నటికీ జరగదు. కేవలం తను ఆమెను వాంఛిస్తున్నాడు. కాని ప్రేమించలేదు, ప్రేమించడు. అది కలలో కూడా జరగని విషయం. ఇప్పుడెలా వుందో ? గంగరాజుకు నిద్ర పట్టలేదు. లేచి కూర్చున్నాడు. మూడు కావస్తుంది. సిగరెట్ కావాలి.

గదికి తాళం వేసి స్టేషన్ వైపు బయలుదేరాడు. నడుస్తున్నప్పుడు ఆతనికో ఆలోచన వచ్చింది. — 'ముప్ఫై ఏండ్లొచ్చినా తనెందుకు వివాహం చేసుకోలేదు. తను నిజంగానే చాలా పెద్ద పొరపాటు చేశాడు. యిలా ఎంతకాలం ?'

చాలా రోజుల తరువాత ఎదురైన ప్రశ్నకు సమాధానం తట్టలేదు అతనికి.

స్టేషన్ టీ స్టాల్‌లో టీ త్రాగి ఒక సిగరెట్ పాకెట్ కొన్నాడు. సిగరెట్ వెలిగించి ఒకసారి స్టేషన్ అంతా కలియ జూశాడు. పరిచయమున్న ముఖాలు కనిపించలేదు.

'రామచంద్రాని కెలా ఉందో ?'

గంగరాజు ఇంటికి బయలు దేరాడు. మధ్య దార్లో ఆతనికే ఆలోచనా రాలేదు.

గది తాళం తీసి లైటు వెలిగించాడు.

మూడున్నర—

అయిదు నిమిషాలు గదిలో మవునంగా పచార్లు చేశాడు.

ఇంతలో సీత గావుకేక వేసింది.

"ఏం జరిగిందో ?' గంగరాజు గుండె అదిరాయి.

తలుపు లోపల గడియ వేశాడు.

ఇంటిచుట్టు— ప్రక్కల వాళ్ళ మాటలు వినిపిస్తున్నాయి.

'రామచంద్రం పోయాడట—' బయట ఎవరో అనుకుంటున్నారు.

* * *

రామచంద్రం గతించాడు.

గతాన్ని మరిచింది సీత....

గంగరాజు ఇంకా వూహాలోకంలోనే ఉన్నాడు. అనుకున్న దానికంటే రామచంద్రం ముందే పోయాడు. ఇక సీతకు తనున్నాడు. తన కోసం సీత ఉంది. ఇద్దరి మధ్య ఎడ తెగని బంధం.... డబ్బు...!

రెండు నెలలు గంగరాజుకు మరీ బరువుగా గడిచాయి. సీత ముఖమన్నా కనిపించటంలేదు.

ఆ రోజు సాయంత్రం సీతను కల్సుకోవడానికి ఇంటికే బయలు దేరాడు.

# రేయి విడిచిన నక్షత్రం

28 వ పేజీ తరువాయి

వర్షం పడిందా సాయంత్రం —

ఇంకా పూర్తిగా చీకటి పడలేదు.

సీత దీపం వెలిగిస్తూంది.

"ఏం చేస్తున్నావు ?" అంటూ గంగరాజు లోపలికి వచ్చాడు.

సీత పలకలేదు.

గంగరాజు కుర్చీలో కూర్చున్నాడు.

సీత ఓ మారు లోపలికి వెళ్ళి వచ్చింది.

చెరిగిపోతున్న ప్రశ్న తిరిగి అతని పెదాల్ని కదిలించింది.

"ఏం చేస్తున్నావు?'

"ఏం లేదు— స్నానానికి వెళ్ళాలి—"

అలమార తెరచి ఏదో వెతుకుతుంది.

గంగరాజు చలికి చిన్న పిల్లాడిలా కుర్చీలో ముడుచుకూర్చున్నాడు.

"ఇంత ఆలస్యంగానా ?" గంగరాజు మాటలు పెంచాలని మాట్లాడుతున్నాడు.

గంగరాజు అడిగిన దానికి సీత ఒకసారి అతని

---

వెంకయ్య: మన శాంతిలాల్ని డబ్బు అప్పు అడిగా. ఇల్లో, నగో, పొలమో, చూపితేగాని డబ్బు ఇవ్వనంటున్నాడు. ఏది చూపితే ఎక్కువ ఇస్తాడంటావ్ ?

సుబ్బయ్య: పిస్టల్ చూపితే...

కె. రంగారావు

---

ముఖంలోకి చూసింది. అలమార మూసి వెళ్ళి పోవడానికి సిద్ధమైంది.

గంగరాజు కూడా వెళ్ళిపోవాలని కుర్చీలోంచి లేచి— "నేను వెళ్తున్నాను—?" అన్నాడు.

సీత ఏదో ఆలోచనలతో వెనక్కు తిరిగింది.

"కూర్చోండి—మీకో విషయం చెప్పాలి." అంది.

గంగరాజు తిరిగి నిశ్శబ్దంగా కూర్చున్నాడు. సీత అంత ముభావంగా మాట్లాడటం సహించలేక పోయాడు. వయసుకు తెలియని పిరికితనం ఆవరించిందతనిలో.

వెళ్ళిపోవాలనుకున్నాడు. వెళ్ళిపోతూ, ఆమె వైపొకసారి చూశాడు.

సీత పెదాలమీద ఈసారి మాయని చిరునవ్వు. ఆమె కండ్లలో ఎప్పటికీ నిలిచిపోయే ఆశ్చర్యం.

"వెళ్ళిపోతున్నారా ?"

గంగరాజు బదులు పలకలేదు. బాగా నటించాడు. వెళ్ళిపోయాడు. మొదటిసారి సీత మీద కోపం, అసహ్యం వేసింది.

అతని వెనకాలే కొంత దూరం నడచి పోయింది సీత. కాని గంగరాజు వెనక్కు తిరిగి చూడలేదు. చూడటానికి అభిమానం అడ్డు వచ్చింది. 'అయినా తన కెందుకంత అధికారం ఆమె మీద ?' మనసులో అనుకున్నాడు. అర్థం కాలేదతనికి. కాని కూడా అనుకున్నాడు.

సీత గంగరాజు కనిపిస్తున్నంత వరకు అక్కడే నిలబడింది. తరువాత ఏదో నిర్ణయానికి వచ్చిన దానికి మల్లే గట్టిగా నిట్టూర్చి స్నానానికి వెళ్ళింది.

* * *

మరునటి రోజే సీత పని మనిషిని గంగరాజు దగ్గరికి పంపించింది. ఒక గంట సేపటికి వచ్చాడు గంగరాజు

"పిలిచావట— ?" అన్నాడు.

"కూర్చోండి—"

"మర్యాదలెందుకులే. ఎందుకు పిలిచావో చెప్పు. నాకవతల పనుంది." గంగరాజు కూర్చోలేదు. సీతను మింగేసేటట్లు చూస్తున్నాడు.

"ఇల్లు ఖాళీ చేయమని చెప్పటానికి పిలిచాను"

గంగరాజు నీరుకారిపోయాడు. అతను ఈ విషయం ఎప్పుడూ వూహించలేక పోయాడు.

"ఎందుకు— ?"

"కారణా లనవసరం. ఇల్లు ఖాళీ చేయండి."

"ఇంత మాత్రానికే పిలవటం దేనికి ? ఆ పని మనిషితోనే చెప్పి పంపించాల్సింది."

అభిమానం దెబ్బతిన్నట్లుంది. పౌరుషంగా మాట్లాడాడు.

"పొరపాటయింది." సీత సమాధానం సూటిగా తగిలింది.

"సీతా—"

"వెళ్ళండి దయచేసి—"

"వెళ్తాను. కాని ఒకటి అడుగుతా. నా మీదున్న ప్రేమంతా ఒక్కసారే ఇలా ద్వేషంగా యెలా మారుతుందో అర్థం కావడంలేదు—"

"ఇల్లు ఖాళీ చేయమని చెప్పాను. అవన్నీ అనవసరం."

గంగరాజు కష్టంగా నవ్వాడు.

"నే నిన్నాళ్లున్నది నీ కోసం. నువ్వేమి చెప్పనక్కర్లేదు. నేనే ఖాళీచేసి వెళ్ళిపోతాను. కాని నేనడిగిన దానికి సమాధానం కావాలి—"

"సమాధానమా ? దేనికి ?"

"నే నడిగిన దానికి. నన్నెందుకు ద్వేషిస్తున్నావు?"

"నే నెవర్నీ ద్వేషించటం లేదు."

"మరి ఇలా అమర్యాదగా నన్నవమాన పరచటంలో నీ ఉద్దేశ్యం ?"

సీత సమాధానం ఇవ్వలేదు.

"సీతా నన్నర్థం చేసుకోలేక పోయావు. నేనెంత దగ్గరకు రావాలన్నా నువ్వంత దూర మవుతున్నావు."— నవ్వాడు "మీ ఆయన పోయాడన్న విచారంలో మొందలాగే ఉంటుంది. అందుకని ఇప్పుడు నేనే వెళ్ళిపోతా—"

సీత కండ్లు తడిశాయి.

జయించాడు గంగరాజు.

కలుషితమైన ప్రేమ నిర్మలమైన ప్రేమను ఎప్పుడూ జయిస్తూనే ఉంటుంది.

"ఎందుకేడ్పు—మళ్ళీ వచ్చేసా, కొన్నాళ్ళకు...."

నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు గంగరాజు.

* * *

గంగరాజు సామానంతా సర్దుకున్నాడు.

అక్కడి నుంచి వెళ్ళిపోవడానికి తయారవుతున్నాడు. ఇంతలోకే సీత ఇంటి పనిమనిషి వచ్చి ఒక పొడుగాటి కవరిచ్చింది.

# రేయి విడిచిన నక్షత్రం

"ఇదేంటి ?" అన్నాడు.

"అమ్మగారు ఇవ్వమన్నారు—" చెప్పి వెళ్ళిపోయింది.

కవరు చింపి చూశాడు.....

నోట్లున్నాయి.... ఎన్నున్నయో కాని.... చాలా ఉండి ఉంటాయి. ఒక తెల్లకాగితం కూడా కనిపించింది. తీసి చూశాడు.

సీత వ్రాసింది.

—"పుట్టటంతోనే నాన్నకు బరువయ్యాను. పెండ్లి చేసుకుని వారికి మరింత బరువునయ్యాను. ఏమాశించానో, ఏమనుకున్నానో నాకే తెలియదు. వారికి అన్యాయం చేయకూడదనుకునే మిమ్మల్నాశ్రయించాను. చివరికి మీకూ దూరం అవుతున్నాను. వారు అమృతతుల్యులు. వారికి నామీదున్న అపారమైన ప్రేమ నన్నిలా బంధించేస్తుంది. ఎంతైనా తాళికట్టిన భర్త. వారి ఆత్మశాంతి కోసం తప్ప నాకీ లోకంలో బ్రతకటానికి మరో కారణం ఏముంటుంది ?

"తను విధవరాలయ్యానని తెలుసుకున్న తరువాత వయసుతో నిమిత్తం లేకుండా ప్రతి స్త్రీకి ప్రాపంచిక సుఖాల మీద మోహం నశిస్తుంది. నాకూ అలాగే జరిగింది. మళ్ళీ ఇంకో జీవితం గడపాలని నాకు లేదు. ఆయన్ని తల్చుకుంటూ నా పాపానికి నిష్కృతి కలిగించమని దేవుణ్ణి ప్రార్థించాలి. నాకు మిగిలిం దొక్కటే ఒకటే.... నా ప్రార్థనలు.... నా అర్థంలేని కన్నీళ్ళు.

నాకు భగవంతుడు డబ్బే ఇచ్చాడు. అదొకటే ఉంది నా దగ్గర. అదే ఇస్తున్నాను మీకు. ఇంతకు తప్ప మరేదీ నా మంచి ఆశించకండి. మీకు చెయ్యెత్తి మొక్కుతున్నాను.... నా జీవితంలో మళ్ళీ ప్రవేశించకండి.... మోడు వారిందీ తరువు.. మళ్ళీ చిగురించదు.... క్షమించండి—

సీత. . . ."

నవ్వుకున్నాడు గంగరాజు.

'పిచ్చిది—' అనుకున్నాడు.

గంగరాజుకు బాగా తెలుసు— 'తను తిరిగి వచ్చినా కన్నీళ్ళు పెట్టుకుని మరికొన్ని నోట్లు ఇస్తుందని—' అందుకే నేరుగా స్టేషన్ వైపే బయలు దేరాడు. ★

# ఓ తెలుగు సినిమా కథ

18 వ పేజీ తరువాయి

అప్పుడు వాళ్ల హృదయాల్లో ప్రేమ, అనురాగం ఆశ మొలకెత్తాయి. అమ్మాయి తలదించుకుంటుంది. అబ్బాయి ఫకఫకా నవ్వుతాడు రావణాసురుడిలా మరేదో సినిమాలో వేసిన వేషాన్ని జ్ఞప్తికి తెచ్చుకుని.

అమ్మాయి కళ్ళు చక్రాల్లా తిరిగాయి బాపూ బొమ్మ మాదిరిగా.

"ఎందుకూ ఆ పిచ్చి నవ్వు" అనడిగింది.

"కోపంవస్తే నవ్వనులే. ఆ వెన్నెలకు కూడా నామీద దయలేదే— నీకు మటుకు ఎలా ఉంటుంది ? చూడు— ఆ చంద్రుడు ఎలా మబ్బులా చాటుకు పోతూ— నాకు వెన్నెల లేకుండా చేయాలని ఎలా తాపత్రయ పడుతున్నాడో అది చూస్తే నవ్వొచ్చింది. పైగా ఈ ప్రిన్సిపాలు గోల ఒకటి"—

"ఆయన చెప్పింది మీకు గోలగా ఉందా?" హీరోయిన్, తల త్రిప్పుకుంది. అనుకోకుండా ఆ అమ్మాయి మరో ఏక్టరును యిమిటేట్ చేసేసింది. కన్నీటితారగా వెలుగొందాలనుకుని కన్నీరు కురిపించేసింది. 'అరరరరే....'అంటూ తన రుమాలుతో ఆమె కన్నీటిని తుడిచి "నవ్వులాటకు అంటే అలా కన్నీరు పెట్టుకుంటావేం — ఇలా అయితే ఆ చంద్రునికి మరీ లోకువైపోతాం" అని ఆ అమ్మాయిని నవ్వించడానికి ప్రయత్నంచేశాడు విజయ్. హీరోయిన్ అతని గుండెల్లోకి దూరి ఏడ్చిందింకా.

"నువ్వు ఏడుపాపక పోతే నామీదొట్టు. ఏదీ నవ్వు— ఒక్క నవ్వు—...... నావరాల సుజాతా" అన్నాడా హీరో. సుజాత విరగబడి నవ్వింది.— వెన్నెల్లా.

ఒక విషయం చెప్పటం మరిచిపోయాను. కాలేజీ క్లాసులు పగలు కదా— వెన్నెల ఎలా వస్తుందీ అనే అనుమానం ప్రేక్షకులకు రాకూడదు. అలా వస్తే వారు కళకు ద్రోహం చేస్తున్నట్లవుతుంది. కనుక ఏదో విధంగా సర్ది చెప్పుకోవాలి. అది నైట్ కాలేజీ కాకూడదని ఎక్కడేనా వ్రాసుందా అని ప్రశ్నిస్తాడు కవి. పైగా — ప్రిన్సిపాలు తనింటికి కూడా రమ్మన్నాడు. తిట్టడానికి కామోసు.

అమ్మాయి అబ్బాయి ఒకేసారి బైల్దేరారు. ఇద్దరికీ ఎక్కడకు వెళ్తున్నారో తెలియనట్లు నటిస్తారు. ఆఖరుకు — ప్రిన్సిపాలుగారింటికి వెళ్తారు.

"ఇక్కడ కూడా — వెంబడిస్తున్నావా" అంటుందా సుజాత.

"మీరేనాముందు వెళ్తున్నారు" — విజయ్ జవాబు.

"మీరే" అంటే "మీరే" అనుకున్నారు కొద్ది క్షణాలపాటు. ఆఖరుకు చెవిలో ఏమిటో చెప్పుకున్నారు. లాంగ్ షాట్‌లో ఏదో గుట్టు చప్పుడుగా మాట్లాడుకకున్నారు. టాక్సీ ఎక్కి — పబ్లిక్ గార్డన్స్‌కేసి — పరిగెత్తుకెళ్లారు అది దిగాక.

అప్పుడు మామూలు ప్రజలెవరూ లేరు ఆ ఇంట్లో. వీళ్ళు వస్తారని తెలిసి ఖాళీ అయిపోయిందేమో. అప్పుడు ఎంచెక్కా పాటపాడేసుకుని— డ్యూయెట్‌కూడా పాడుకుని ఇంటి దారి పట్టారు. అప్పటికి వారికి తెలుస్తుంది టైము ఏడు దాటిందని—

'ఇప్పుడు కథ సస్పెన్సు థ్రిల్సులో సాగుతుంది. వీర క్రోధ స్టంటు రసాలు పోషించబడ్డాయి అత్యద్భుతంగా'— అన్నాడు ప్రొడ్యూసర్.

—ఇద్దరు రౌడీలు రోడు కడ్డంగా నిల్చున్నారు. అబ్బ టాక్సీ ఎందుకెక్కాము కాదని విలపించారు సుజాతా విజయ్‌లు.

కాని హీరోకు కోపం వచ్చేసింది. అమాంతం వాళ్ల మీదకు విరచుకుపడ్డాడు. కొంచెంసేపు తిట్టుకున్నాక — కొట్టుకున్నారు— దొంగలు క్రింద పడిపోయారు. "హ్హాహ్హా హ్హా — రౌడీ వెధవల్లారా మామీద కొస్తారా" అని చిరిగిపోయిన చొక్కాను చూసుకుంటూ కొంచెం ఆగి — "ఈ ఛాయల్లో కన్పించారంటే మీ డొక్కలు చీల్చేస్తాను" అనేసి— హీరోయిన్‌తో బయలుదేరాడు హీరో. 'ఇది సినిమా కనుక నువ్వు మమ్మల్ని కొట్టగలిగావ్— నిజంగానైతేనా — అప్పడం చేసుకు తినేద్దుము' అంటున్నట్లు, చూస్తూ పారిపోయారు ఆ యిద్దరు రౌడీలూ.

ప్రిన్సిపాలుగారిల్లు అనుకున్న టైముకు కొంచెం ఆలస్యంగా ఎనిమిదిన్నరకు చేరుకున్నారు.

అక్కడ — ప్రిన్సిపాలుగారి గదిలో ముగ్గురూ నిల్చుని ఉన్నారు. మరో రెండు నిముషాలకు. హీరోయిన్ హీరోను ఆశ్చర్యంగా చూసింది. హీరోకిప్పుడు క్రొత్త చొక్కా ఉంది. నిగ నిగలాడుతూ. (దారిలో ఎక్కడేనా అతని చాకలిషాపు ఉండి ఉండొచ్చును లెండి)

ఉన్నట్టుండి—గది ఎగిరిపోయేలా అరిచారు ప్రిన్సిపాల్‌గారు. డైరక్షరంటాడు—"ఆయన అలా అరవడం నేర్చుకోడానికి ఆరు గంటలు పట్టిందంటే నమ్మండీ" అని.

విజయ్ తల పైకెత్తాడు—ఈ క్రొత్త చొక్కా ఎక్కడిదని అడుగుతాడేమోనని భయపడినట్లు చూశాడు. ఆయన కేకకు బల్బు వణికింది. అటూ ఇటూ వూగుతూ ఎక్కువ నీడల్నిస్తోంది. భయంకరంగా ఆ నిశ్శబ్ద వాతావరణంలో ఒకే ఒక శబ్దం ఫేన్ చేస్తోంది. ఎక్కడ్నించో గాలి అఘాట్టుగా వచ్చి కిటికీ తలుపుల్ని విరగగొట్టినట్లు వీచింది. కర్టెన్లు ఎగిరిపోయాయి—

"విజయ్. నిన్నెందుకు పిలిచానో తెలుసా ? నువ్వు చేస్తున్న పని—ఆ అమ్మాయిని ప్రేమించడం ఏమంత సబబైన పని కాదు. అర్థమైందా—మరోసారి చెప్పనా ?" విజయ్ తల గిర్రున త్రిప్పాడు అర్థమైం దన్నట్లు.

"అమ్మాయ్. నీపే రేమిటీ—"

"సుజాత." సిగ్గుతో చెప్పింది హీరోయిన్.

"సుజాతా ! నిన్నెందుకో తెలుసా ? అందుకే. అర్థమైందా—నీక్కూడా మరోసారి చెప్పాలా ?"

అమ్మాయి తల దించుకుంది. అబ్బాయీ, అమ్మాయి ఖిన్నవదనులై నిల్చునేప్పటికి ప్రిన్సిపాలు గారిలో ఆకస్మికమైన మార్పు వచ్చింది. అందుకు ఆశ్చర్యపోతూ వకర్నొకరు చూసుకున్నారు హీరో హీరోయిన్‌లు—

ఈ సమయాన్న ప్రేక్షకులను ఆశ్చర్యాబ్ధిలో నింపి ఇంటర్వెల్ వచ్చేస్తుంది. మళ్లీ బొమ్మ పడగానే—

ప్రిన్సిపాలు గుండె కరిగిపోయింది. నోట్లోని పైపు జారిపోయింది. కన్నీటిబొట్లు దొంతర్లుగా దొర్లిపోయాయి—

ఆశ్చర్యపోతూ చూశారు అమ్మాయి అబ్బాయి.

"ఎందుకండీ ఏడుస్తారు ?" అనడిగాడు విజయ్.

"ఏడ్వుగాక నా జీవితానికి ఏం మిగిలింది ! స్టూడెంట్సును ఏడ్పించి నేను ఏడ్వడమే కదా నా జీవిత ఫలం ?

ఇరవై ఏళ్ల నాటిమాట. విజయ్ ! నా కొడుకు నీ అంతే ఉండేవాడు ఆనాడు పడవ ప్రమాదంలో చనిపోకపోతే.

ప్రక్క వూర్లో సంబరం జరుగుతోందని తెలిసి వూరు వూరంతా కదిలి వెళ్లాం. అప్పట్లో నేను మామూలు మాష్టర్ని. వాడి తల్లి పోతూ పోతూ వాడ్ని డాక్టర్ని చెయ్యమని కోరింది. దానికి వాగ్దానం కూడా చేశాను. ఏం లాభం ! విధివ్రాత రేకించింది. వాడ్ని నా నుండి దూరంచేసింది.

తిరిగి వచ్చేప్పుడు మేం వస్తున్న పడవ మునిగి పోయింది. నేను మట్టుకు ఎలాగో తప్పించు కున్నాను. ఆ జలగండాన్ని కాని, ఆ భగవంతుడు నన్ను బ్రతికించి నా బాబును పట్టుకుపోయాడు—" హృదయవిదారకంగా ఏడ్చాడు, ప్రిన్సిపాలుగారు.

పాపం—హీరో హీరోయిన్లు కూడా కంట తడి పెట్టారు. "రేపు వస్తాం మండీమళ్లీ" అన్నారు. ఆయన ఏడుపు అంతా ఒక్క రోజులో వినేందుకు ఓపిక లేనట్లు.

ఆ రాత్రి—హీరో, ప్రిన్సిపాలుగారి కథను తండ్రితో చెప్పాడు. తండ్రి అనుమానంగా చూశాడు. మొదట. "నువ్వు చెప్పేది నిజమేనా" అన్నాడు. విజయ్ 'ఊ' కొట్టాడు. "నే నెప్పు డైనా అబద్ధం చెప్పానా నాన్నా" అన్నాడు.

"నేను నీ నాన్నను కాను. అంత భాగ్యానికి నే నోచుకోలేదు—" మగవాళ్లు నోచుకోవడ మేమిటి ? ఆ డైలాగులో తప్పు దిద్దినట్లుగా— "అంత భాగ్యానికి నే నరిపోను. అవును. ప్రిన్సిపాలు గాడు నీ నాన్న. సరిగ్గా ఇరవై సంవత్సరాల క్రితం—నువ్వు గోదావరి ఒడ్డున మాకు దొరి కావు. నిన్ను పెంచి మరణించిన నీ అమ్మా, నేనూ భద్రాద్రి రాముని దర్శనానికి వెళ్తే నువ్ దొరికావ్—

పాపం ! ఆ కన్నతండ్రి ఎంత విలపిస్తున్నాడో—రా —వెళ్దాం" అన్నా రాయన—

ఇద్దరూ ప్రిన్సిపాల్ గారింటికి వెళ్లారు. హీరో కాలుమీద మేకప్‌మాన్ వినుగుతో వేసిన తలకా

యంత పుట్టుమచ్చను చూశారు. సంతోషంగా అందరూ కలుసుకున్నారు. తండ్రీ కొడుకులు కావిలించుకున్నారు.

తర్వాత—కాలేజీలో చదువుతూ—నదీ విహారానికని బయలుదేరి వెళ్ళాడు. మెడికల్ కాలేజీ పిల్లలతో సహా—.... పిక్నిక్‌కు వెళ్ళాడు విజయ్—

ఇదంతా ఆ అమ్మాయికి గుర్తొచ్చింది. దాంతో కళ్ళు తెరచి గట్టిగా అరిచేసింది.—"ఆయన్ను కొట్టొద్దూ" అని. పైగా "కొట్టాలంటే నన్ను కొట్టండి. నన్ను చంపండి. అంతేకాని, ఆయన్ను హింసించకండి" అంది.

"నిన్నెందుకు యిచార పెడతావే పిట్టా ! మా కోయదొరను నువ్వు వివాహ మాడవే బుల్ బుల్!" అన్నాడో కోయ దొర అసిస్టెంటు. ఇంతలో—

వికటాట్టహాసం చేసుకుంటూ వచ్చేశాడు బుంగ మీసాల—నెత్తిమీద వో కొమ్మున్న రాక్షసుడి లాటి కోయదొర. హీరోయిన్‌కేసి నడిచాడు. ముందు ఇంకో అమ్మాయి దగ్గర కెళ్ళాడులెండి—పొరపాటున. 'నువ్ కాదుగా నాకు కావాల్సింది' అని తనలో తాను అనుకుని హీరోయిన్ దగ్గర కొచ్చాడు. అతని నెత్తిమీది కొమ్మును విస్తుపోతూ చూసింది హీరోయిన్. తర్వాత భయపడింది.

డప్పుల మోత పెరిగింది. మంటలు భుగ భుగమంటూ పైకెగసాయి. హీరో ఫ్రెండ్సులో కొందరు చలి కాగుతున్న వాళ్ళు లేకపోలేదు—

కోయ దొరను చూడగానే హీరోయిన్ యిట్టే 'హా' మంటూ తల వేలాడేసింది. హీరో—'సుజాతా ! భయపడకు' అన్నాడు. కట్టివేసున్న విజయ్‌ను తెంప పగిలేట్లు కొట్టాడు కోయదొర.

"మా వీరులతో యుద్ధంచేసి గెలిస్తే—వదిలేస్తా" అన్నాడు.



# ఓ తెలుగు సినిమా కథ

చావు దెబ్బలు తినివున్న హీరో అందుక్కూడా అంగీకరించాడు. ఎక్కడ్నించి వచ్చిందో అంత ధైర్యం ! హీరో స్నేహితులు అతడ్ని వారించారు.

అయినా కూడా విజయ్—హీరోగా మరి—అతడు గెలుస్తాడనే ధైర్యంతో హీరోయిన్ యుద్ధానికే ప్రోత్సహించింది—మరి ఆమె ఎప్పుడు కళ్ళు తెరిచిందో ఏమో!

యుద్ధం ప్రారంభమైంది. హీరో. కొట్టక పోయినా అతడి వీరాకృతిని చూసి భయపడి ఒక్కొక్కళ్ళుగా నీళ్ళలో పడిపోయారు. కోయ దొర—తన్నులు తప్పించుకోడానికిగానూ—గౌరవ పురస్సరంగా—హీరో భుజం తట్టి మెచ్చుకున్నాడు. హీరోయిన్‌ను అతడి కిచ్చి— సకల లాంఛనాలతో పాటుగా పంపివేశాడు. హీరోయిన్‌ను సాగనంపుతూ—"చెల్లీ. ఈ అన్నయ్యను క్షమించమ్మా. నా దగ్గర ఉన్నదేదో పెట్టాను" అన్నాడు—ఆమె చేతుల్లో ఓ బంగారపు గొలుసుంచుతూ.

నదీ విహారానికెళ్ళి అంతసాహసం చేసుకొచ్చిన కొడుకును తెగ మెచ్చుకున్నారు ప్రిన్సిపాలుగారు.

హీరో, హీరోయిన్ సుఖంగా హాయిగా జల్సాగా తోటల్లోనూ, నదుల్లోనూ ఆడుకుంటూ— పడవ లెక్కి పాడుకుంటూ కాలం గడుపుతున్నారు.

ఒకనాడు వాళ్ళ వూరికి దూరంగా (షుమారు రెండు వందల మైళ్ళు) ఉన్న చెరువుకేసి షికారు వెళ్ళారు. చెరువులో — పడవలో వెళ్తూండగా మొసలి వచ్చింది. పడవ బోల్తాపడింది. హీరో మొసలితో వీరోచితంగా దెబ్బలాడి (బట్టలు చించుకోకుండా) అప్పటివరకూ మునగకుండా తేలుతూన్న హీరోయిన్‌న్ను వడ్డుకు లాక్కొచ్చాడు. ఇద్దరూ కావిలించుకున్నారు. అమ్మాయి — 'మనపెళ్ళి ఎప్పుడు' అనడిగింది. అబ్బాయిని— సిగ్గు నటిస్తూనే. ఇంతలో — వడ్డుమీద ఎవరో తట్టలూ పారలూ పట్టుకుని పాటలు పాడుకుంటూ వీరిని చూసుకుంటూ, ఆ సంతోషం పట్టలేక నాట్యం చేసి వెళ్ళిపోయారు.

హీరో హీరోయిన్ చెవిలో చెప్పాడిలా : "ఆ చంద్రుడు ఆ నక్షత్రాలూ శాశ్వతంగా ఉన్నంతకాలం నీమీది నా ప్రేమ తొణక్కుండా బెసక్కుండా నిలిచిపోతుంది. నీకెందుకా భయం?"

"అంటే నీ ఉద్దేశ్యం?"—దూరంగా జరుగుతూ అడిగింది సుజాత.

"అనుమానిస్తున్నావా? ప్రేమించే దొకర్ని పెళ్ళి చేసుకునే దింకొర్ని' అనే సామెతఅంటే నాకిష్టం లేదు. ప్రేమించాను నిన్ను. నిన్నే పెళ్ళాడతాను. ఇది తప్పదు ఆరు నూరు అయినా— నువ్వు నేనైనా ఏమంటావ్?"

విజయ్ ఆమె కళ్ళలోకి కొంటెగా వంకరగా చూశాడు. ఆమెలేచి లేడి పిల్లలా పరిగెత్తింది. మైదానంలో ఒకరి వెంట ఒకరు దొంగాటలాడుకుంటూ పరిగెత్తుకుంటూ— యిట్టే— ఇంటికి వెళ్ళిపోయారు— తమ ఊరు సంగతే మరిచిపోయి. రెండువందల మైళ్ళ దూరాన వున్న తోటలో—చెరువులో— ఆడుకున్నారని చూశాం గదా! అంత దూరం పరిగెడుతూనే ఇంటికి వెళ్ళారా" అని విచారణ డగకూడదు.

"మళ్ళీ ఎప్పుడు?" అన్నది సుజాత. "టా..టా రేపు ఇదే సమయానికి," అన్నాడు విజయ్.

సుజాత లోపలకెళ్ళింది. ఆమె తండ్రి ఎదురయ్యాడు. తల్లికూడా హాల్లోనే ఉంది జరగబోతున్న సంగతి కనిపెట్టినట్లు.

"సుజా ! ఇలారా" అన్నాడాయన. అమ్మాయి బెదురుతూ నిల్చుంది. "ఎవడా అబ్బాయి?" అనడిగాడాయన.

"విజయ్" అంది.

"విజయ్ ఎందుకొచ్చాడిక్కడకు? నీతో అతని కేంపని?" ఖంగుమని ప్రశ్నించాడు. నిప్పులు క్రక్కుతున్న ఆయన కళ్ళను చూసి దడుసుకుంది అమ్మాయి.

"నాన్నా. అతను ప్రిన్సిపాలుగారబ్బాయి. ఎవరో నీకు తెలీక అలా మాట్లాడవు. మా ఇద్దరికీ స్నేహం నాన్నా"

ఆయన సర్రుమని లేచాడు తారాజువ్వలా. ఆమె చెంప ఛెళ్ళుమనిపించాడు. అంతలోనే ఆమె తల్లి పరిగెత్తుకొచ్చి, కూతుర్ని గట్టిగా కావిలించుకుంది.

"సిగ్గూ సెరమూ లేకుండా కనపడ్డ ప్రతి వెధవాయితోనూ పిక్నిక్‌లకూ విహారాలకూ వెళ్తే మన పరువు సంగతి ఏమవుతుందో ఒక్కసారైనా ఆలోచించావా? ఇకనుంచీ ఇంట్లోంచి కదులు—నీ సంగతి చెప్తా." అన్నాడు కోపంగా. ఆయన కట్టుదిట్టాలు చేశాడు ఆమె బైటకు అనవసరంగా వెళ్ళకుండా.

మర్నాడు— కాలేజీలో చరిత్రాత్మక నాటకం. సుజాత అందులో ప్రధాన పాత్రధారిణి. ఝాన్సీలక్ష్మి బాయి — విజయ్‌కూడా ఉన్నాడా నాటకంలో.

సాయంత్రం అవగానే— అనుకున్నట్లుగా సుజాత రాకపోయేసరికి విజయ్— వాళ్ళింటికి వెళ్ళాడు. ఆమె తండ్రి అతడ్ని తిట్టి, కొట్టినంత పని చేశాడు. హీరో ఏడుస్తూ (హీరో బహిరంగంగా ఏడవకూడదుగా — అందుకని లోపల్లోపలే ఏడుస్తూ) నదిగట్లకేసి, సముద్రాలకేసి వెళ్ళి పాటపాడుతూ ఏడ్చాడు. హీరోయిన్ ఆ పాట విన్నది కామోసు—అదే చరణం అందుకుంది. గట్టిగా పాడితే నాన్న తంతాడని భయం— అందుకని నెమ్మదిగా కీచు గొంతులో విలపిస్తూ పాడింది. హీరో విన్నాడా పాటను. ఏమైనా సరే— ప్రాణానికి తెగించి అయినా సరే— ఆమెను రక్షించుకోవాలనుకున్నాడు.

అన్నిటికీ తెగించి—

ఆడవేషం వేసుకున్నాడు. సూజాత వాళ్ళింటికి వెళ్ళాడు. అప్పుడు— సుజీ తండ్రి ఇంటో లేడు. సుజీ తల్లిని బోల్తా కొట్టించి— తమింట్లో పురాణ కాలక్షేపం ఉందని చెప్పి మోసంచేస్తూ, అమ్మాయి వేషంలో వచ్చిన హీరో హీరోయిన్ను ఆ ఇంట్లోంచి రక్షించాడు.

కారులో కూర్చున్నాక గలగలా నవ్వుకున్నారు. 'సింహాద్రి అప్పలసామి' అంటూ పాడుతూ రోడ్డుమీద డాన్సుచేస్తున్న నర్తకీమణులను చూడ్డానికి కారాపాడు హీరో. ఆ డాన్సు వాళ్ళు కారు దగ్గర కొచ్చి చెయ్యి జాపారు. సుజాతకేసి — 'చూస్కో' అన్నట్లుగా చూసి విజయ్ వాళ్ళ చేతుల్లో పదిరూపాయల కాగితముంచాడు. తర్వాత — బయలుదేరి

పోలు చేరుసున్నారు. థియేటరు దగ్గర అంతా సిద్ధంగా ఉంది.

"మరో నిమిషంలో తెర ఎత్తుతాం. నిశ్శబ్దంగా ఉండవలసిందిగా ప్రార్థిస్తున్నాను. తర్వాతి కార్యక్రమం ఝాన్సీ లక్ష్మీబాయి నాటకంలో ఒక సీను—" అనేసి—కేకలూ, చప్పట్లూ—ఈలలమధ్య సెక్రటరీమణి వణుకుతూ తెర లోపలకు దూరింది చటుక్కున—

థియేటరు జేరుకున్న మరు నిమిషంలోనే చాలా మేకప్‌తో సుజాత ఝాన్సీ లక్ష్మి రూపంలో స్టేజిమీద కొచ్చింది. తెర ఎత్తారు.

"మీ అమ్మాయే. అలా ఆశ్చర్యపోతారేం—చాలా బాగా నటిస్తుంది. ప్రైజు తప్పకుండా తీసుకుంటుందిలెండి—" అన్నాడు ప్రిన్సిపాలు తన ప్రక్కనే కూర్చున్న ఆమె తండ్రితో. ఆమె తండ్రి లోపల్లోపలే కుమిలిపోయాడు కోపంతో.

ఇంతవరకూ కథలో ఎక్కడా హీరోయిన్ దేముడి ముందు ప్రార్థన గీతం ఆలాపించలేదు. ఇప్పుడా మోజు తీర్చుకునే అవకాశం వచ్చి, ఝాన్సీ వేషంతో యుద్ధానికి వెళ్తూ తన కులదేవతను కొలిచింది. "బ్రహ్మాండమైన కోరస్ పాట అది" అంటాడు ప్రొడ్యూసర్. అందరి గొంతూ విడి విడిగా గుర్తు పట్టేందుకు వీలుగా ఉన్న మాట పదిమందిచే కష్టపడి, ఎన్ని శ్రమలకో ఓర్చి పాడింపించాడు సంగీత దర్శకుడు. ఆ పాట అయిపోగానే మహాసేనాని వేషంలో విజయ్ అక్కడ కొచ్చాడు. 'యుద్ధ సన్నాహాలు పూర్తయినాయి మహారాణీ' అని నివేదించాడు శత్రుసేనల గూర్చిన విశేషాలను. అతడికి కొంత ప్రసాదం చేత బెట్టి, ఆవిడ రణరంగానికి బయలుదేరింది. తదనంతరం నాటకం మన కంతగా బుర్ర కెక్కదు. అదో టెక్నిక్కట. తెర వెనుక ఏవో యినుప ముక్కలూ అవీ కొట్టుకుని ఖణ ఖణ మనే శబ్దాలొస్తాయి. ఆఖరకు ఝాన్సీ చనిపోతుంది—తెర పడగానే ప్రేక్షకుల్లో కూర్చుని ఉన్న సినిమా ప్రొడక్షన్ వాళ్ళే హర్షధ్వానాలు చేస్తారు. తర్వాత—

విజయ్, సుజాతలు బహుమతులు పుచ్చుకున్నారు. బరువెక్కిన గుండెతో, చెమ్మచేసిన కళ్ళతో సుజాత తండ్రి ఇంటికి వెళ్ళాడు. సుజీ ఇంటికొచ్చింది భయపడ్తూ. నిలదీసి అడిగాడు తలుపు దగ్గరే—"నీకు విజయ్ అంటే చాలా యిష్టమా" అని. "అవున్నాన్నా—అతడ్ని తప్పించి మరొకర్ని నేను పెళ్ళాడలేను. నన్ను చంపినా సరే—" అంటూ జాలి గొలిపేట్లు కన్నీరు తెప్పించుకుంది తన చక్రాల్లాంటి కళ్ళల్లోకి. ఆయన కూడా కన్నీరు పెట్టుకుని, బిగదీసుకున్న బొంగురు గొంతుతో—ఛాతీలోకి కూరుకుపోతున్న మెడతో—, ఆమె తల నిమురుతూ—(మెడతో తల నిమిరాడని కాదు)—అన్నాడిలా—"తల్లీ! నీ ఆనందం తప్పించి నాకు కావాల్సింది ఇంకేముంది?! నీ యిష్టమే కానీ—!!" అన్నాడు స్వతంత్రించి. ఆయన భార్య అప్పుడు ఇంట్లో లేదు. కాల్‌షీటు మర్చిపోతే, ఫర్వాలేదు లెమ్మని ఆ సీను కాస్త ఏదో వక విధంగా అవజేశొట్టు డైరక్టరు. అది కూడా ఒక టెక్నిక్కట !! అసలు—తిరిగి తెరమీద సుజాత తల్లి కన్పించనే కన్పించదు !!!—

అప్పుడు నేపథ్యంలో బ్రహ్మాండమైన—

"ఓ చెల్లీ—ఓ బుల్లిచెల్లీ—అదృష్టమంటే నీదే సుమా—కుల మత భేదాలకు సమాధి కట్టిన—ఓ లేత హృదయమా—అతడే నీ ప్రపంచమా—నీదే అదృష్టమా—" అనే పాట ఖంగుమంటూ విన్పిస్తుంది. హీరోయిన్ పరుగు పరుగున హీరో ఇంటికి వెళ్ళబోతుంది. మర్నాటి ఉదయం రాత్రి తాను కన్న కలలో కన్పించిన దేవదానవ యుద్ధం తాలూకు యిల్ ఎఫెక్ట్స్ ఎలా ఉంటాయో పాపం—ఆమె కెవరూ చెప్పలేదు. లేకపోతే—ఆమె భూమ్మీదే నడిచేది—కలిసిన జంటను విడదీసి గంపెడు పాపం మూట గట్టుకున్నాడు కథకుడు—(అతను కాకపోతే—మరొకరు—)

భూమిని చూడకుండా పరిగెట్టిన హీరోయిన్—దారిలో ఓ అరటి తొక్కమీద కాలువేసి వెల్లకితలా పడి స్పృహను కోల్పోతుంది. ఎక్కడ్నించో ఓ డాక్టరు ఆమె తండ్రీ వస్తారు. ఆసుపత్రిలో కట్లు కడతారు ఆమె కాళ్ళకు. నుదురు కూడా దెబ్బతింది పాపం! భుజాలు కూడా కట్లు కట్టించుకున్నాయి. ఒక కాలును ఎత్తి హేంగర్‌కు తగిలిస్తారు. "పాపం—ఇంకా నయం. బ్రతికింది అదృష్టవంతురాలు" అంటుందో నర్సు ఆ నేపథ్యం గొంతులాగే. తండ్రి బావురుమంటు ఏడుస్తాడు.

హీరో విన్నాడు ఈ వార్తను ఆమెకు అంగ లోపం జరిగినా తనకు ఫరవాలేదంటాడు. తను ఆమె ప్రేమనే కోరుకున్నా నంటాడు—ఎవరూ అడక్కపోయినా కారులో కూర్చుని, విధివేసిన అన్యాయాన్ని పాట రూపకంగా దుమ్మెత్తి తిట్టి పోస్తాడు.—దుఃఖిస్తాడు. అంతలోనే—అతని అంతరాత్మ అతనినుంచి వేరై ఆకాశంలో జేరి అతడ్ని హెచ్చరిస్తూ పాడుతుంది—"నమ్మిన ఆడది—నిన్నే నమ్ముకున్నది—ఆమెను మరచిపోకుమా—నిన్ను నీవే వంచించకుమా—" మ్యూజిక్ డైరక్టరు తన జన్మలో అటువంటి వరుస కట్టలేదంటాడు.

ఇక్కడే—కవిపుంగవుడు ఓ బ్రహ్మాండమైన పన్నుగడ పన్నాడు. ఎఫెక్ట్సులోకల్లా ఇదే ఎంతో హాయిగా ఉన్నదట ప్రొడ్యూసర్ గారికి.

ఇంతవరకూ ప్రేక్షకులకు తన దర్శన భాగ్యం కలుగజేయని—సుజాతనే ప్రేమిస్తున్న ఒక విలన్ హీరో కారుకు ఎదురొస్తాడు. హీరో కారాపాడు. విషాదవదనంతో ఉన్న హీరోను కొట్టడానికి ముందు కొంతసేపు తటపటాయించినా—తర్వాత ధైర్యం కూడగట్టుకొని—ఈల వేస్తాడు. ముఖాలకు నల్ల గుడ్డలు అడ్డు పెట్టుకుని, క్లుక్లస్ క్లాన్ ముఠాలాంటి వాళ్ల ఓ నలుగురు హీరోను కారులోంచి ఇవతలకు లాగుతారు. చెత్తగా కొట్టేస్తారు. హీరో ఎదురు తిరగడు—మరి, విషాద రసంలో ఉన్నాడుగా! హీరోను నేలకేసి కొడ్తూ—అతను మూర్ఛపోయాక—"ఇతకు క్రితం నువ్ కొట్టిన దానికి అసలు, వడ్డీ ఫాయిదాలతో సహా పుచ్చుకో—నీ దిక్కున్న చోట చెప్పుకో"—అనేసి చకచకా వెళ్ళిపోతారు. 'వాళ్ళు ఎప్పుడు వెళ్తారా' అని ఎదురుచూస్తున్నట్లున్న ఓ పదిమంది జనం చుట్టూ మూగారు. హీరోను ఆసుపత్రిలో జేరగానే ప్రిన్సిపాలు గుండె బాదుకుంటూ వచ్చాడు—"నా బాబు—నా బాబు" అంటూ ఏడ్చాడు.

విజయ్‌కు ఆపరేషన్ జరిగింది. అతనికి పూర్వస్మృతి పోయింది. అక్కడ సుజాత వెర్రి

# ఓ తెలుగు సినిమా కథ

చూపులు చూస్తూ, ఏదో పిచ్చిదానిలా ఉంటుంది చూడ్డానికి.

విజయ్ ఆసుపత్రిలోంచి ఇంటి కెళ్ళాడు. అంతా మరిచిపోయాడు. కన్న తండ్రిని కూడా గుర్తు పట్టలేక పోయాడు. ఒక రాత్రి—ఎవరికీ తెలియకుండా ఇంట్లోంచి వెళ్ళిపోయాడు. చెప్పులు అరిగేట్లు తిరిగాడు. ఏమీ తెలియని అంధకారాన పయనిస్తూ, పాంటు చినిగి, చీకి పేలిక లయ్యేవరకూ తిరుగుతాడు. ఇంకా—పైగా—సంఘాన్ని . విమర్శిస్తూ పాటలు పాడ్తాడు. తమను తిడుతున్నా కూడా—పాట బావుందని కాబోలు—ఎవరూ అతన్నేమీ అనరు. పోనీలే—పిచ్చివాడని వూరుకుంటారు.

సుజాత కూడా మతి చెడిం తర్వాత—ఒంటరిగా పారిపోతుంది. అన్ని తీర్థాల్లోనూ మునుగు

---

శ్రీ టి. టి. కృష్ణమాచారి బడ్జెటు మీద స్వతంత్ర సభ్యులొకరు ఆర్థికమంత్రితో మాట్లాడుతూ: "ఈ దేశంలో సోషలిజం ఏ కొద్దిపాటి అయినా వుంటే, టి. టి. కె, అన్న మూడు అక్షరాలతో ప్రారంభమయ్యే మూడు నిత్యజీవితావసర వస్తువుల మీద పన్నును ఆర్థిక మంత్రి తగ్గించే వుండేవారని" అన్నారట. ఆ మూడు వస్తువులు టీ, టెక్స్‌టైల్సు, కిరోసిన్ అయి వుంటాయని అభిజ్ఞుల ఊహ.

---

తుంది. నే పథ్యంలో ఓ అరగంట పాట విన్పిస్తుండగా. హాయిగా అన్ని పుణ్యక్షేత్రాలూ టిక్కెట్టు ఖర్చుతో సినిమా హాల్లోంచే ప్రేక్షకులు చూసేస్తారు. అదే వారికి మిగిలే లాభం!! సుజాత కూడా కొన్ని దేవాలయాల్లో పాడుతుంది. తను జాలిగొలిపే చూపుల్తోనూ చేష్టల్తోనూ ఆడియన్స్‌లోని ఆడవారి హృదయాలను ఆకర్షించుకోడానికి ప్రయత్నిస్తూ—చివరకు ఒక నది వడ్డుకు చేరుకుంటుంది. అక్కడికే జేరుకుంటాడు విజయ్ కూడా. ఇద్దరికీ పూర్వ స్మృతి లేదు. ఇదే తమ కవి అత్యాధునికంగా ప్రవేశబెట్టిన మెలిక అని ప్రొడ్యూసర్ గుండె చరుచుకుని ధైర్యంగా చెప్పాడు ప్రివ్యూ రోజున. పత్రికా ప్రతినిధులు ఏమనాలో తెలియక నోరు తెరిచి నిలబడిపోయారు!!

ఇక—ఆట్టే కథను సాగించడం యిష్టంలేక కవి హఠాత్తుగా కొన్ని గమ్మత్తులు జరిపించేశాడు. ఆ రెండు నిమిషాలు నిద్రమత్తుతో (తప్పకుండా వస్తుంది నిద్ర) ఏ ప్రేక్షకుడైనా కళ్ళు మూసుకుని తోగితే—అంతా అయోమయంగా కనిపించి, ముందుగా అతనికి పిచ్చెక్కుతుంది!

అంత బావుంది ఆ కథ గమ్మత్తు—

సుజాత పిచ్చిగా కేకలు పెడ్తూ ఆ నది వడ్డును చేరుకుందా—అక్కడే ఉన్న ఓ నలుగురు రౌడీలు ఆమెను చూసి, లొట్టలు వేసుకుని—నోరు చప్పరించుకుని—గట్టిగా పట్టుకుంటారు. ఆమెను బలాత్కరింపబోతుంటే గట్టిగా అరుస్తుంది. ఆ ప్రక్కనే—ఓ ఇసుకతిన్నె వెనకాల—కేక ఎప్పుడు విన్పిస్తుందా అని ఎదురుచూస్తూ కూర్చున్న హీరో రంగంలోకి ఉరుకుతాడు. సుజాతను గుర్తు పట్టకపోయినా—ఆమె ఏడుస్తుంది 'రక్షించమం' టూ. విలన్‌లు ఇక ఆలస్యం ఎందుకని హీరోతో కలపడతారు—

పెద్ద కొట్లాట జరుగుతుంది. కర్రలతో బాదుకుంటారు. రౌడీలు పొరపాటున వాళ్లల్లో వాళ్ళే కొట్టుకుంటారు—అలవాటు ప్రకారం. మధ్యలో అడ్డం నిల్చిన సుజాతను వెనకనించి నెత్తిన కొట్టాడో రౌడీ. ఆమె అరుస్తూ కూలిపోతుంది. ఆమె పడిపోగానే హీరో విజృంభించి, హఠాత్తుగా బలం చేకూర్చుకుని అందర్నీ తరిమేస్తాడు. ఆ రౌడీల్లో ఒకడు హీరోను గుర్తు పడతాడు కంటిన్యుటీ కోసం. ఆ రౌడీ పూర్వం హీరో చేత తన్నులు తిన్నవాడే!!

పడిపోయిన సుజాతను వంగి చూస్తుంటాడు హీరో. 'ఎవరో పాపం. అందమైన అమ్మాయే. ఇక్కడ పడిపోయింది—ఇప్పు డెలా?' అనుకుంటుండగా—ఆ రౌడీ తిరిగి వచ్చి ఇంత లావుపాటి కర్రతో హీరోను గట్టిగా కొడతాడు. హీరో వెంటనే పడిపోతాడు. నుదురుమీద రక్తం కార్చుతూ. (నెత్తిన కొడ్తే నుదురుమీద రక్తం ఏమిటని ఎవరూ అడక్కూడదు) మరి—నెత్తిన స్వస్తిక్ మార్కు వేస్తే కన్పిస్తుం దేమిటి!—అందుకని నుదురుమీద—)

ఎవరో రావడం చూసినట్లుగా నటించి, భయపడి పారిపోతాడు. ఆ రౌడీ.

ఎవరో నిజంగానే వచ్చి—హీరో, హీరోయిన్లను ఆసుపత్రిలో జేర్పిస్తారు. 'వాళ్ళు బ్రతుకుతారో లేదో—అయినా ప్రయత్నిస్తానం' టూ పెద్ద డాక్టరు పెద్ద ఆపరేషన్‌లు చేస్తాడు. పోలీసులు ఈ వార్తను వారి తల్లిదండ్రులకు—(అంటే—సుజాత తండ్రికీ—ప్రిన్సిపాలు గారికీ అని)—అందజేయగానే—నిమిషాల మీద రెక్కలు గట్టుకుని వాల్తారు. ముసలాళ్లిద్దరూ.

ఇక్కడ—ప్రొడ్యూసరాదులు లాటరీ వేయదల్చుకున్నారట. బొమ్మా, బొరుసూ వేసుకుని—కథను కామెడీ చేద్దా మనుకున్నారట. చేశారు—

సుజాతా విజయ్‌లు మర్నాటికల్లా కళ్ళు తెరిచారు. గుర్తుపట్టారు ఒకర్నొకరు. మళ్ళీ తగిలిన కర్ర దెబ్బల్తో పోయిన స్మృతి తిరిగి వచ్చిందన్నమాట. ఏడుస్తూ—కావిలించుకున్నారు. మొహాల మీద చెరొక స్వస్తిక్ మార్కూ ఉంటుంది. అంతే—అవి కూడా రాలిపోతాయిలెండి వాళ్ళు ఆసుపత్రి నుంచి వెళ్ళేప్పుడు.

—ఇలా అబ్బాయిని మీ అమ్మాయిని విడిచి—" అని ఆమె తండ్రి—పొరపాటున అనబోతాడు. డైరెక్టరు కట్ అన్నట్టుగా—ఆ పొరపాటు తనే సరిదిద్దుతాడు అనుభవం ఉన్న హీరో తండ్రి.

వ్యాయంగా నైతే—ఆమాట వినిపించగానే ప్రేక్షకులు లేచిపోతారు. కాని—పోనికలేక ఎవరూ వెళ్ళరు—మూడున్నర గంటలు కూర్చుని కాళ్ళు నొప్పెక్కి—ఇక కూర్చోలేక—లేవలేక—ప్రేక్షకులు సతమత మౌతూంటే—హీరో హీరోయిన్ చేతిని పుచ్చుకుని అనుమతిబయుటకు నడిపించుకెళ్తాడు. అమ్మాయి తండ్రికన్నీరెడతాడు. ప్రిన్సిపాలుఆయన్ను దగ్గరకు తీసుకుని 'మీ అమ్మాయిని మావాడు కంటిరెప్పలా చూచుకుంటాడు—నరా—' అన్నాడు.

"పోయి రావమ్మా—పోయిరావే తల్లీ" అనే పాట నేపథ్యంలో ఘ్నాటు ద్వారా వినిపిస్తుండగా—అనుపత్రి సిబ్బంది కూడా కన్నీ రెడతారు—

ఇక—ఇప్పుడు విజృంభిస్తారు—మ్యూజిక్ డైరెక్టరూ—ఫోటోగ్రాఫిక్ ఎఫెక్ట్సుల కెమెరామన్—మాజిక్కులు చేస్తూ. హీరో, హీరోయిన్లు నర్సున్ చేసే మ్యూజిక్ వినబడగానే ప్రేక్షకులు హుషారు పడతారు—ఆ యిద్దరూ చేసే ట్రిక్కులూ, పనులూ చూసిపోదాంలే అని కూర్చున్నారు హాయిగా—

సంతోషంగా—హాయిగా—కలిసిపోయిన జంట వాళ్ళిద్దరూను. అప్పుడు హీరోయిన్ను అడిగాడు హీరో— "మనం కాలేజీ రోజుల్లో పాడుకున్న డ్యూయెట్ ఏంటి చెప్మా—" అని. "అబ్బ!—అదెందుకండీ యిప్పుడు—"అనడిగిందిసుజాత. "అదే పాడాలి. అంతా అక్కర్లేదులే—కొద్దిగాచాలు—"

ఇదరూ పాడారా పాట—గెంతుతూ కొంచెం సేపు, దొర్లుతూ కొంచెంసేపు. మరి—ఆఖరకు—హీరో, హీరోయిన్ను కొంచెంసేపు జట్కా—మరి కొంచెంసేపు—సైకిల్—కొంతసేపు లాంబ్రెట్టా—మరికొంతసేపు మోటార్ సైకిల్‌మీదా—తిరిగి తిరిగి—తర్వాత కార్లోకి గెంతి—కొండలు, తోటల మీదుగా ఝూమ్మని ఎగిరిపోతారు కదా!—

అప్పుడు—దూరదూరానికి పోయే ఆ కారు చిన్నదైపోయి—మ్యూజిక్ ఎక్కువైపోగానే—'శుభం' అనే అక్షరాలు ప్రేక్షకుల కళ్లను పొడిచి నట్టుగా గభాల్న—అక్షరాలు కారులోంచి పరుగెత్తుకుంటూ వచ్చేస్తాయి—

ఇదీ ఆ సినిమా కథ—ఇలా ఆక్రోశించాడు పత్రికా ప్రతినిధి.

ఈ సినిమా కంపెనీ ప్రొప్రయిటరు—ఇలా వరుసగా ఆరు సినిమాలు—ఇదే కథను కొంచెం కొంచెంగా మార్పులుచేసి—తీసి ఆశ్చర్యకరంగా—నాలుగు సంవత్సరాల్లో కోటీశ్వరుడైపోయాడు!!!



# రామచరిత మానస్

తులసీదాసు



తెలుగు: ముంగర శంకరరాజు

## 27

కుంభకర్ణుడంతట కుపితుడై కన్నుల నిప్పులు రాల్చుచూ ఒక మహాపర్వతమును పెకలించి తెచ్చి మర్కట సమూహముపైకి విసరెను. రఘువీరుడు మార్గమందే దానిని బాణములచే చూర్ణ మగునట్లు వగులగొట్టెను. తదుపరి తీవ్ర శరపరంపరలు గుప్పించి నిశాచరుని ముంచివేసెను. మేఘములలో మెరుపులు లీనమగునట్లు కాటుక కొండవంటి కుంభకర్ణుని శరీరములో రామ బాణములు దూరిపోవుచుండెను. అసురుని అపాద మస్తకము రక్తము ధారలు గట్టెను. శర ధాటికి తాళలేక కుంభకర్ణుడు శక్తి క్షీణించి వివద గ్రస్తుడయ్యెనని వూహించి కపులు వానిని పట్టుకొనుటకు ప్రయత్నించిరి. అట్లు తనను సమీపించిన రాముని సైనికులను వాడు ఒక్క హుంకారముతో కాలరాచి వికటాట్టహాసము చేసెను. దుర్దమనీయుడగు దనుజుని దర్పమును జూచి దాశరథి రోషావేశుడై శతసాయకంబులు ప్రయోగించి వాని కాయమును క్షుణ్ణ క్షుణ్ణ మగునట్లు చేసెను. వాడా నొప్పికి రొప్పుచూ ఒక కొండను యెత్తుకొని దానిని రామునిపై విసరబోయెను. రాఘవుడా క్షణమునందే రెండు బాణములతో వాని భుజ దండములు త్రెగగొట్టెను. వక్షహీనమగు పర్వతమా యన్నట్లు ఆ భీకర రాక్షసుడు బాహుద్వయము ఖండింపబడినందుకు బొబ్బలిడుచూ క్రోధోన్మత్తుడై నోరు తెరచుకొని రాముని మ్రింగివేయుటకు ముందు కురికెను. అప్పటి వాని రౌద్రాకృతి గురించి దేవతలు దిగులొందిరి. కోదండపాణి చలించక నిశ్చలుడై వదులు వదులు బాణములు గుప్పించి వాని నోరు నింపివేసెను. వాడు అప్పటికినీ వెనుకంజ వేయక వికటాట్టహాసము చేయుచూ రాముని మీదికే దూకెను. భానుకుల ప్రదీప్తుడు అసురుని అఘాయిత్యమునకు అత్యంతోగ్రుడై ఖరతర సాయకములు ప్రయోగించి కుంభ కర్ణుని శిరము తెగవేసెను. వాని తల యెగిరి లంకలోనున్న రావణుని యెదుట బడెను. వాని మొండెము మాత్రము పద ఘట్టనలతో భూమిని దద్దరిల జేయుచూ రఘుపతి మీదికే వచ్చుచుండెను. కాకుత్స్థ వీరుడు కుపితుడై నిముసములో ఆ మొండెమును రెండు ఖండములగునట్లు ఖండించి వైచెను. రెండు కొండలు నేల బడునట్లు వాని శరీర భాగములు భూమి వ్రాలెను. అసంఖ్యాకులగు వానర వీరులు ఆ మహా కాయము క్రిందబడి నలిగి నీల్గిరి. విగత జీవుడగు కుంభకర్ణుని తేజస్సు శ్రీరాముని చేరుకొనెను. ఆ దుష్టుని తుద ముట్టించినందుకు దివినున్న దేవతలు హర్షితులై శ్రీరామునిపై పుష్ప వర్షము కురిపించిరి. "రామచంద్రా ! యథా శీఘ్రము దుష్టులను సంహరించుము !" అని నారదుడు సంతోషముతో పై నుండి కేకవేసెను.

సమరాంగణమున కపిసేన మధ్య రక్తాంగుడై నిలబడియున్న శ్రీ కోదండరాముని గోస్వామి తులసీదాసు ఇట్లు స్తుతించెను—

> "సంగ్రామ భూమి బిరాజ రఘుపతి
> అతుల బల కోసల ధనీ,
> శ్రమ బిందు ముఖ రాజీవలోచన
> అరున తన సోనిత కనీ,
> భుజజుగల ఫేరత శర శరాసన
> భాలుకపి చహుఁదిసి బనే,
> కహదాస తులసీ కహి నసక
> ఛబి శేష జెహి ఆననఘనే."

"ఓ శర్వాణీ ! అధమాధములగు అసురులకు సైతము వైకుంఠమును ప్రసాదించిన ఆ ప్రభును సంస్మరించని వాని జన్మ మెందులకు !" అని ఆ సందర్భమున సదాశివుడు పలికెను.

## ఇంద్రజిత్తు రెండవయుద్ధము

నాటి సాయం సమయమునకు ఉభయ సైన్యములు పోరు విరమించి స్వశిబిరములకు చేరుకొనిరి. ఇక్కడ వానరస్కంధావారమున ఉత్సాహ మతిశయించగా అక్కడ లంకలో దుఃఖ శోకములు వ్యాపించెను.

రావణుడు కుంభ కర్ణుని ఖండిత శిరము హృదమున జేర్చి శోక వ్యాకులితుడై— 'హా దేవాంతకా ! వీరాధివీరా ! సోదరా ! విగత జీవుడవైతివా !" యని దీనాతి దీనుడై రోదించెను. కుంభకర్ణుని బలవీర పరాక్రమములు పేర్కొనుచూ అంతఃపుర స్త్రీలు గుండెలు బాదుకొని విలపించ సాగిరి. రావణుడట్లు సభాంధవముగా శోక సాగరమునిగి దురపిల్లుచున్న సందర్భమున మేఘ నాదుడచటికి వచ్చి తండ్రి నిట్లు ధైర్యోక్తుల వూరడించెను—

"పితాజీ ! నీ పుత్రుడగు ఈ మేఘనాదుడు ప్రాణములతో నుండగా మీకీ దిగులెందుకు ! నేను ఇష్ట దైవమువలన అమోఘ శక్తిని, మాయా రథమును బడసిన వరప్రసాదిని. రేపే రణ రంగమున నా శక్తి సైర్యములు ప్రదర్శించి, శాత్రవుల సాగరణచి, నరవానరుల రక్తము ద్రాగి, నీకు సంతోషము కూర్తును."

మరుదినము, సూర్యోదయానంతర మామరవైరి సకలాయుధ సన్నద్ధుడై మాయారథ మారోహించి యుద్ధ భూమికి చనెను.

"గిరిజా ! మేఘనాదుడు దృశ్యాదృశ్య యుద్ధ విద్యా నైపుణ్యుడు, మాయావి, మహాస్త్ర సంపన్నుడు. వాడు పుట్టినపుడు మేఘమువలె గర్జించినందున మేఘ నాదుడని పేరు వచ్చెను. యుద్ధములో ఇంద్రుని వోడించి బంధించినందున వీడు ఇంద్రజిత్తను పేరుతో ప్రఖ్యాతి బడసెను. ఇరువదేంటడ్ల ప్రాయమందున్నపుడే వాడు ఘోర తప మాచరించి దేవివలన మాయా రథమును బడసెను. ఆ రథ మారోహించిన వానికి ఆహవమున అపజయము కలుగదు. అయితే, ద్వాదశ వర్షంబులు యెవడు స్త్రీ సుఖము నిద్రాహారములు లేక యుండునో వానితో యుద్ధము చేయ వలదని దేవి హెచ్చరించి యుండెను. మరొకప్పుడు వీడు ఇంద్రుని బంధించి లంకకు తెచ్చెను. ఆ సమయమున చతురాస్యుడు రావణికి 'శక్తి'ని ప్రసాధించి దేవేంద్రుని విడిపించుకొని పోయెను. ఆ శక్తి ప్రయోగమునకు గురి అయిన వాడు ఒక రాత్రి ఉపచార క్రియలు లేకుండిన యెడల మరణించ గలడు.

ఇంకొకప్పుడు రావణ తనయుడు విజిగీషతో నాగ లోకము పైబడి పధ్నాలుగు దినములు ఘోర యుద్ధముజేసి నాగరాజు వాసుకిని బంధించెను. తదుపరి నాగరాజు తన కూతురు సులోచనను ఇంద్రజిత్తుకిచ్చి బంధ విముక్తుడయ్యెను. ఇతని భార్య సులోచన మహా పతివ్రత." అని మేఘనాదుని పూర్వ వృత్తాంతమంతయూ శంకరుడు శాంకరికి విశదీకరించి చెప్పెను.

## మేఘనాదుడు మాయాసీతను తెగటార్చుట

ఇంద్రజిత్తు జిత్తులమారి. వాడు రాముని సేనతో పోరాడుచున్నపుడు ఒక మాయా సీతను సృష్టించెను. ఆ కల్పిత సీతను ఆంజనేయునికి చూపించి— "హనుమంతా ! ఏ సీతా నిమిత్తమై మీరీ యుద్ధము చేయుచుంటిరో ఆమెను

పట్టితెచ్చి ఇదిగో మీ యెదుటనే వధించుచున్నాను." అని పలికి ముష్కరుడా మాయా సీత కుత్తుక గోసి అందరు చూచుచుండ రథము నుండి క్రిందకి త్రోసెను. వానరులా భీకర దృశ్యమును గాంచి హత చేష్టులై నిలబడి పోయిరి. హనుమంతుడంత ఆగ్రహోదగ్రుడై "వానరులారా ! చూచుచుంటిరేమి ! వైరి దళములను వధించి ముక్కలు ముక్కలు జేయుడని" హెచ్చరించి, వాయుసూనుడు వాలము త్రిప్పి సింహ గర్జన చేసి విజృంభించెను. కపులా హెచ్చరికతో తరుపాషాణ పర్వతములు చేబూని విజయమో లేక వీరస్వర్గమో యన్న భావముతో ప్రాణములను తెగించి నిశితాశనులపై దూకిరి. క్రోధోన్మత్తులై ఆక్రోశించుచూ పిడుగుల వలె మీద బడిన వానర భల్లూకముల తాకిడికి దానవ బలము ధృతిచెడి భయాక్రాంతమై పరుగు లంకించెను. తన సైన్యమట్లు తృటిలో తిరోగమనము చేసి నందుకు వగచుచూ ఇంద్రజిత్తు వివశుడై వెనుకకు మరలి ఇంటిదారి పట్టెను.

తదనంతరము వానర యోధులను వెంట బెట్టుకొని వాయుసూనుడు జానకీపతి చెంతకు వచ్చి వ్యథిత హృదయుడై "—ప్రభూ ! దనుజాధముడు వైదేహిని బంధించి యుద్ధ భూమికి కొని తెచ్చెను. ముష్కరుడా మహాతల్లి కుత్తుకను మా యెదుట ఖండించెను.—" అని చెప్పి గొల్లున యేడ్చెను.

ఈ దుర్వార్త చెవుల బడగనే శ్రీరాముడు దిగ్భ్రాంతి జెంది— "అయ్యో లక్ష్మణా ! సీతకు దిక్కులేని చావు సంఘటిల్లెనా ! ఇంక నాకీ యుద్ధ మెందుకు ! నేనీ దారుణమైన బాధ ఎట్లు సహింతును !" అని దురపిల్లుచూ మూర్ఛితుడై నేలబడెను.

మైథిలి మరణించెనని శోక సంతప్తుడై యున్న సాకేతపతి వద్దకు విభీషణుడు వచ్చి సత్యము స్పష్టము జేసెను—

"సర్వజ్ఞా ! ఇంద్రజిత్తు మహా మాయావి. మిమ్ము వంచించుటకై వాడు మాయా సీతను కల్పించి కత్తికెర జేసి యుండును. నా మాటలపై మీకు నమ్మకము లేకున్న మహావీరుని లంకకు పంపిన యెడల నిముసములో నిజము తెలుసుకొన గలరు."

విభీషణుని సమ్మతి ప్రకారము హనుమంతుడు ప్రచ్ఛన్న రూపుతో లంకకు పోయివచ్చి,— స్వామీ ! జగదంబ క్షేమముగా నున్నది— అని తెలియజేసెను. ఈ శుభవార్తకు రామాదులు సంతోషము చెంది నిశ్చింతులైరి.

## రామలక్ష్మణులు నాగపాశ బద్ధులగుట

యుద్ధ భూమి నుండి గృహోన్ముఖుడై చనుచున్న రావణు పుత్రుడు తాను కల్పించిన సీతావధ నాటకము యొక్క రహస్యము శత్రువులకు అవగత మయ్యెనని తెలుసుకొని ఖేద పడెను. ఆ క్షణమే వాడు క్రోధ వ్యగ్రాంతుడై ధరణీ తలముపై నరవానరులను నిశ్శేష మొనర్తును— అని శపథము చేసి రథము త్రిప్పించి రణ భూమికి మరలెను.

వానరులు సర్వ సన్నాహముతో మోహరించి వాని నెదుర్కొనిరి. మేఘనాదుడు మాయా రథ మారోపించి అంతరిక్షమున కెగసి అంతర్హితుడై మెరుపు యుద్ధము చేయ సాగెను. మఘ కార్తిలో జడివాన పడునట్లు బాణవర్షముచే ధరాతలము కప్పివేసెను. పరిఘ శూల శక్తితో మరగదాద్యాయుధంబులు నలుదెసల నుండి వచ్చి పిడుగులు పడునట్లు ప్లవంగ సేనపై బడుచుండెను. స్వల్ప సమయములోనే చూచుచుండగా లోయలు గుంటలు పర్వతములు గుహలు ధర తల మంతయు దనుజుని బాణములతో కప్పబడి పోయెను.

వానర వీరులు పాషాణ తరుశైలాగ్రములతో పైకెగసి అక్కడ అదృశ్యుడై యున్న శత్రువును గానక మరలా భూమి మీదికి దిగి వచ్చుచుండిరి. ఇంద్రారి వర బలోద్ధతుడు, మాయాయుద్ధ విశారదుడు, వాని యుద్ధ మర్మము భేదింప జాలక వనచర యోధులు క్రియా శూన్యులై యుండుట గమనించి రామ లక్ష్మణులు శరచాపములు చేబూని రణ భూమికి వచ్చి నిలబడిరి. ఇంతలో ఇంద్రజిత్తు నిశిత సాయకములు గుప్పించి నదలనీల అంగద హనుమంతులను గాటముగా నాటవేసెను. విభీషణ సుగ్రీవులు శరవిద్ధాంగులై బలముడిగిరి. రావణి ఇట్లు పరాక్రమించి ప్లవంగ సేనను క్షత విక్షత మగునట్లు ప్రహరించిన పిమ్మట ఉగ్రుడై కన్నుల నిప్పులు గ్రక్కుచూ రామలక్ష్మణులను గురిచేసి నాగాస్త్రము ప్రయోగించెను. ఓ గరుడజీ ! యుద్ధమును గౌరవించుటకై సర్వశక్తిమంతుడగు శ్రీనివాసమూర్తి నాగపాశమునకు బద్ధుడై నేలకొరిగెను.

లోక భయంకరుడగు దేవాంతకుడట్లు పరాక్రమించి వైరి బలమును నిర్వీర్యమొనరించి, సింహనాదము చేసి— "ఓరీ నరవానరులారా! ఇప్పుడు మీ బలపరాక్రమము లేమయ్యెను! మీ శక్తి సామర్థ్యములు ప్రదర్శింపరేల?"— అనిపలుకుచూ ప్రత్యక్ష మయ్యెను. అప్పుడు ఎక్కడనో మూల నున్న జాంబవంతుడు ఆగ్రహావేశుడై ముందుపడి —"ఓరీ జిత్తులమారీ! ఇప్పుడుగదా నా చేతి కందితివి!" అని గర్జించి పెలి కేక పెట్టి వానిపైకి ఉరికెను.

"ఓరీ వృద్ధవానరా! ముసలి వాడని భావించి నిన్ను వదలి పెట్టితిని కానీ నాకు నీవొక లెక్కలోని వాడవా! ఇదిగో నీ భాగము పుచ్చుకొనుము" అని సమాధానమిచ్చి రావణి జాంబవంతునిపై శూలము ప్రయోగించెను. వానర వీరుడా శూలమును మధ్యలోనే ఎగిరి పట్టుకొని దానినే మేఘనాధుని హృదయమునకు తగులునట్లు విసిరి కొట్టెను. దేవాంతకుడా శూలాహతికి గిరగిర తిరిగి సంజ్ఞా శూన్యుడై నేలపడెను. అట్లా క్రింద పడిన దానవుని కాళ్లు రెండు బట్టుకొని జాంబవంతుడు లంకలో బడునట్లు వానిని విసిరి కొట్టెను.

ఇక్కడ రామలక్ష్మణులు నాగపాశములచేధరాగతులై యుండిరి. కపులు వారి చుట్టూ జేరి దిక్కుదోచక దుఃఖించసాగిరి. ఈ విపత్తునుండి ప్రభులను కాపాడుకొనుటకు మార్గము గానక వానరులు హాహా పడిరి. ఇంతలో నారద ప్రేషితుడై గరుత్మంతుడు రణభూమిపై పడియున్న రామలక్ష్మణులయొద్దకు శీఘ్రగామియై వచ్చెను. ఆ నాగారాంతకుని వాసన సోకగనే సర్పములు వాటంతటవే వీడజొచ్చెను. పక్షీంద్రుడు శేషించిన పన్నగ సమూహమును భక్షించి ప్రభువుకు ప్రదక్షిణా పూర్వకముగ నమస్కరించి వెళ్ళి పోయెను. నాగ బంధములు వీడుటతోనే రామ లక్ష్మణులు నిద్ర నుండి మేల్కొన్న వారివలె యథా పూర్వ తేజో విరాజితులై పైకి లేచి కూర్చొనిరి. రాజపుత్రులు బంధముక్తులైనందుకు శాఖాచరులు సంతోషముతో గంతులు వేసి జయధ్వానముచేసిరి.

## లక్ష్మణునిచే మేఘనాదుడు వధింప బడుట

అచ్చట లంకలోనికి విసిరి వేయబడిన రావణు పుత్రుడు కొంత తడవుకు మూర్ఛనుండి తేరుకొని ఇట్లా విచారించెను— "నేను శత్రు సంహారము చేతునని తండ్రి యెదుట ప్రతిజ్ఞ చేసియుంటిని. నా ప్రతిన పూర్తి గాకనే నాయనకు ముఖమెట్లు చూపింపగలను!" అని చింతించి వాడు అక్కడ నుండి నికుంభిలావనమునకు పోయి అక్కడ అజయ యజ్ఞము చేయుటకు పూనుకొనెను.

ఈ సంగతి విభీషణుడు చారుల వలన తెలుసుకొనెను. రావణానుజుడంత రాముని చెంతకువచ్చి— "రఘురాయా! దేవఘాతకుడగు ఇంద్రజిత్తు నికుంభిలా వనములో యజ్ఞము చేయ తలపెట్టినాడు. ఆ యజ్ఞము నిర్విఘ్నముగా పూర్తియైన యెడల వానిని— నిర్జించుట అసాధ్యమగును." అని విన్నవించెను.

సత్వరమే సాకేతపతి అంగద హనుమంతాది వీరులను రావించి వారితో "కపియోధులారా ! మీరు విలంబనము చేయక సౌమిత్రి సమేతులై పోయి ఇంద్ర జిత్తు తలపెట్టిన హోమమును ధ్వంసము చేసి రావలసినది. లక్ష్మణా! నీవు ఆ దేవఘాతకుని ఎవ్విధముగానైనా తుదముట్టించి దేవతలకు సంతోషము కలిగింపుము." అని ఆజ్ఞాపించెను. లక్ష్మణు డంతట అన్నకు పాదాభివందనము చేసి "అగ్రజా! దేవానందకరముగా వేడా సురవైరికి పరలోకము ప్రసాదించిన గాని మరలి రాను." అని ప్రతిజ్ఞాపూర్వకముగ పలికి, లక్ష్మణుడు ప్లవంగ ప్రముఖులను వెంట బెట్టుకొని లంక జొచ్చెను.

అప్పటికే మేఘనాధుడు నికుంభిలా వనమందు నిష్టాగరిష్టుడై మహిష మాంస రుధిరంబులతో యజ్ఞము చేయుచుండెను. వానరులు విక్రమించి వాని యజ్ఞ వేదికపై విరుచుక పడిరి. వారు హోమ గుండమును తద్ద్రవ్యరాశిని చిందర వందర చేసి, రావణి చెవులు పట్టుకొని ఆసనమునుండి ఈవలకు బరబర ఈడ్చిరి. దానవుడంత దన దీక్షను వదలి పెట్టి ఆగ్రహోదగ్రుడై త్రిశూలము త్రిప్పుచూ వానరులపై విజృంభించెను. వాడు రోషదర్పాన్వితుడై కిలారవము చేసి కపి వీరులను ఒక్కొక్కరినే శూలము గురిచేసి సంజ్ఞాహీనులగునట్లు గావించెను.

కపి యోధులట్లా దానవ వీరునిచే ధర్షితులై ధరాగతులగుట గమనించి లక్ష్మణుడు ముందుకు వచ్చి మృత్యు సన్నిభ శిలీ ముఖములను ముష్కరుని

# రామచరిత మానస్

పై గురిపించెను. వజ్రపాతము వలె వచ్చి పడుచున్న సౌమిత్రి బాణవృష్టికి వెరగంది వాడు అంతరిక్షమున కెగిసి అదృశ్యుడై అవధకుమారుని నొప్పించ సాగెను. ఒకసారి కనబడి మరొకసారి కనబడక వివిధ రీతుల వర్తించుచూ మెరుపు యుద్ధము చేయుచున్న మేఘనాదుని ఏమి చేయుటకు దిక్కు తోచక కపులు వివశులై చూచుచూ ఉండిరి. అంతకంతకు అసురుని ఆర్భాటము ఎక్కువయ్యెను. దశదిశలనుండి వచ్చి పడుచున్న బాణ శూల పర్వత పాతమును గాంచి లక్ష్మణు డొకింత ఉక్కిరి బిక్కిరయ్యెను. తదనంతర మాతడు ఇక ఈ దుష్టునితో క్రీడించిన లాభము లేదని గ్రహించి వ్యసర రోష కషాయ నేత్రుడై ఒక మహాస్త్రమును సంధించి, శ్రీ పతిని మనమున స్మరించి, ఆకర్ణాంతములాగి దేవఘాతకుని పైకి గురి చూసి వదలి పెట్టెను. ఆయస్త్రా హతికి అసురవీరుడు ఆక్రందించి— "హా! రాముడెక్కడ! లక్ష్మణుడెక్కడ!—" అని పలికి ప్రాణములు వదలి పెట్టెను. "ఇంద్ర జిత్తూ! నిను గన్న తల్లి ధన్యురాలు, నీ బల పరాక్రమములకు మా జోహార్లు—" అని ఆ సమయమున అంగదాదులు రావణాత్మజుని కీర్తించిరి. తదుపరి విగత జీవుడైన మేఘనాదుని కళేబరమును సునాయాసముగా గొనుకొని పోయి సమీర పుత్రుడు లంకా ద్వారము యొద్ద పెట్టి వచ్చెను. అవ్విధముగ ఇంద్రజిత్తును నిర్జించి విజయశ్రీతో వచ్చిన లక్ష్మణ అంగద హనుమంతాదులను అవధేశుడు ఆలింగనము చేసుకొని అభినందించెను.

## సులోచన

"ఓ అపర్ణా! వరబలోద్ధతుడు దేవఘాతకుడగు మేఘనాదుడు నిహతుడైనందుకు సుర నర మునులాది నానాలోక నివాసులు హర్షోత్సాహితులై అవధ కుమారులను అనేక విధముల కీర్తించిరి. ఆపై జరిగిన కథను చెప్పుచున్నాను ఆకర్ణించ వలసినది." అని కాకభుశుండి గరత్మంతునికి చెప్పియుండిన రామచరిత్ర యొక్క శేషాంశమును శూలి శైలకుమారి కిట్లు చెప్ప దొడంగెను.

మేఘనాదుడు శరవిద్ధుడై నేలకొరిగినపుడు వాని తల తెగిపోయి రామచంద్రుని యెదుట బడెను, వాని బాహు ఒకటి యెగిరిపోయి లంకలో వాని గృహ ప్రాంగణమున పడెను. రావణి ధర్మపత్ని సులోచన ఆ ఖండిత హస్తము తన ప్రాణేశ్వరునిదై యుండుట గమనించి ఇట్లు విచారించెను— "—అయ్యో నా నాథుడు యుద్ధములో నిహతుడయ్యెనా! నేను నమ్మలేకున్నాను. నా ప్రియుడు వీరాధివీరుడు, వరబల సంపన్నుడు, అజేయుడు. అతనిని వోడించగల యోధుడీ లోకత్రయమున లేడే! ద్వాదశ వర్షంబులు నిద్రాహారములు, స్త్రీ సాంగత్య సుఖములేని వీర వ్రతుని వలన మినహా అన్యులచేత నా భర్తకు మృత్యువు సంఘటిల్ల నేరదు. ఇది నా ప్రాణేశు భుజదండమగునో కాదో! తెలియరాగున్నది." అని కొంత తడవు సులోచన వ్యథ వ్యగ్రాంతయై చింతించి తుదకు— నేను త్రికరణశుద్ధిగా నా నాథుని సేవించుచున్న దాననైన ఈ ఖండిత హస్తమే నాకు నిజము తెలియ జేయగలదు— అని పలికెను. అంతట ఒక సఖియు సుద్దముక్క ఒకటి తెచ్చి ఆ తెగిన చేతియొక్క వ్రేళ్ల సందున ఉంచెను. సత్వరమే ఆ ఖండిత హస్తము సులోచనాది స్త్రీ జనము చూచుచుండ గృహ ప్రాంగణమున ఇట్లు లిఖించెను—

"ఓ సులోచనా! రామలక్ష్మణులు అవతార పురుషులు. వారి మహిమా విశేషములు వర్ణింప ఆదిశేషునికి శక్యముగాదు. నా శిరము శ్రీరాముని చెంత నున్నది. నీకు నమ్మకము కలుగుటకై నా హస్త భాగము నీ యొద్దకు పంపబడినది! ఇది నిజము."

తన విభుడు వీరస్వర్గ మలంకరించెనని సులోచనకు నిజమేర్పడెను. వాసుకి తనయ అమిత దుఃఖాక్రాంతయై యెదగుద్దుకొనుచూ రోదించెను. పతిగత ప్రాణ సులోచన వ్యసన వ్యగ్రాంతయై విలపించెను. అట్లు శోకార్ణవమున మునిగి యున్న ఇంద్రజిత్తు భార్యను వోదార్చుటకు సఖీజనము బహు విధముల ప్రయత్నించెను. సులోచన మహాసాధ్వి, పతివ్రతా శిరోమణి జ్ఞాన సంపన్నురాలు. కాబట్టి త్వరలోనే ఆమె దుఃఖము నుండీ తేరుకొని భావి కర్తవ్యమును గురించి విచారించెను. తదుపరి ఆమె తన గృహమందున్న సర్వ సంపదలను దానము చేసి, పతి భుజదండమును వెంట తీసుకొని, బంగారు పల్లకీ యధిష్ఠించి మామ రావణుని ఇంటికి పోయెను.

"మామయ్యా! మీ కుమారుడు మేఘనాదుడు సంగ్రామమున లక్ష్మణుని చేతిలో వీరస్వర్గ మలంకరించెను. లంకేశా! మీరు జీవించి యుండగనే మీ కోడలికి వైధవ్యము లభించు దుస్థితి యేర్పడెను. నాకీ హస్తము ద్వారా సకల విషయములు బోధపడెను. అసురనాథా శ్రీరాముని యొద్ద ఉన్న నా నాథుని శిరము తెప్పించి నాకిప్పించ వలసినదిగా ప్రార్థిస్తున్నాను." అని ఆమె రావణునితో చెప్పుకొని కన్నీరు బెట్టుకొనెను.

"అమ్మా సులోచనా! కుంభకర్ణుడు, మేఘనాథుడు, అతికాయుడు, మహోదరుడు మున్నగు మేటి రణధీరులున్నారు గదా యను ధైర్యముతో నే నింతవరకు యుద్ధమునకు పోక ఉపేక్షించి యూరకుంటిని. అట్టి అసురాగ్ర గణ్యులు నర వానరుల చేత నిర్జింప బడిరని వినుటకే నాకు సిగ్గుగా నున్నది. అమ్మా పుత్రవధూ! నా బల పరాక్రమములు ప్రపంచమునకే తెలుసును, ఆ నరవానర కీటకములను నిముసములో నిర్జించి నీ మనస్సుకు సంతోష మొనర్తును." అని లంకాధిపతి సులోచనను ప్రగల్భములతో వూరడించుటకు ప్రయత్నించెను.

మదోన్మత్తుడై ఇంకనూ సత్యము గ్రహించ నేరక ప్రగల్భము లాడుచున్న మామగారితో ప్రతి వచనము లాడుట భావ్యముగాదని తలంచి



ఇంజనీర్లు :— "మనం ఆనకట్ట కట్టింది ఇక్కడేనటయ్యా?"
"నిన్నటిదాకా ఇక్కడే చూసినట్లు గుర్తుమరి"

# రామచరిత మానస్

సులోచన అక్కడ నుండి మండోదరి యొద్దకు పోయెను. మండోదరి కోడలికి ప్రాప్తించిన వైధవ్య స్థితిని చూడలేక పోయెను. ఆమె దుఃఖార్తయై యున్న కోడలిని అనేక విధముల వూరడించి— "ఓ కులవధూ ! మీ మామ బలగర్వితుడు. ఆసుర ప్రవృత్తిచే అహంకృతుడై యున్నందున సద్బోధనలతని చెవికెక్కకున్నది. ఆ నాడు నారదుడు చెప్పిన మాటలు నేడు నిజము గానున్నవి. రావణ రాజ్యము పతనమై రాక్షస కులము నశించుట నిక్కము. పుత్రీ ! కర్మ ఫల మెవరికిని తప్పింపరానిది. వివేకవంతురాల వగు నీవు జరిగిన దానికి దుఃఖించకుము. నీవు శీఘ్రమే శ్రీరాముయొద్దకుపోయి నీ ప్రాణేశ్వరుని శిరము తీసునికొనిచ్చి, పరలోక మందున్న నీ భర్తను కలుసుకొనుటకు ప్రయత్నించుము." అని బోధించెను.

పిమ్మట సులోచన అత్త పాదములకు ప్రణమిల్లి ఆమె ఆశీర్వాదములు తీసుకొని, లంకకు వెలుపల నున్న రామచంద్రుని స్కంధావారమునకు పయనమై చనెను.

లంకలో నుండి వానర కటకమువైపు పల్లకీ ఒకటి వచ్చు చుండుట కపులు చూచిరి. వారు— మేఘనాదుని మరణానంతరము రావణుడు బుద్ధి తెచ్చుకొని సీతాదేవిని శ్రీరామునికి సమర్పించుటకై పంపు చున్నాడని— భావించి సంతోషించిరి. సులోచన పల్లకీ దిగి సఖీజన పరివృతమై సీతానాధుని యొద్దకు పోయి అతని పాదపద్మములకు సాష్టాంగ ప్రణామము చేసెను. ఆ దేవ దేవుని దివ్య సుందర విగ్రహము దర్శించుకొని ఆమె లోచనములు సులోచనములయ్యెను. ప్రక్కనున్న విభీషణుడు శ్రీరామునికి సులోచన వృత్తాంతము తెలియ జేసెను.

దయానిధి దాశరధి ప్రసన్న చిత్తుడై "సుగుణవతీ ! సులోచనా ! నీ సచ్చరిత్ర, సౌశీల్యములు తెలుసుకొని నే నెంతయు సంతసించితిని. నేను నీ భర్తకు ప్రాణదానము చేసెదను, మీరిరువురు చిరకాలము లంకారాజ్య మేలుకొనుచూ సుఖంబున నుండుడు." అని పలికెను.

రాముని పలుకు లాలించి వానరులు బిత్తర పోయి ఒకరి నొకరు చూచుకొనిరి. మేఘనాధుడు పునర్జీవితుడైన వాడు పూర్వ వైరవమును విస్మరించునా ! దేవతలను దర్శించక వూరకుండునా ! విభీషణునికి చేసిన బాస యేమగును ! అను పలువిధ ప్రశ్నలప్పుడువారినోమవీధిలో ప్రత్యక్షమయ్యెను.

ఇంతలో సులోచన కేలుమోడ్చి సీతానాధుని కిట్లు విన్నవించెను— "ఓ జగత్పతీ ! మీ అపార కృపా కటాక్ష – వీక్షణములు నాపై ప్రసరించినందులకు నా జీవనము ధన్యమయ్యెను. ప్రభూ! నా నాధుడు స్వభుజ బలపరాక్రమముచే పదునాల్గు భువనములపై తన విజయ పతాకము ప్రతిష్ఠింప జేసుకున్న మేటి యోధుడు. ఆరణ ధీరుడు సమర ప్రాంగణమున లక్ష్మణమూర్తి వంటి సత్పాత్రునికి తన ప్రాణ ధనము దానము చేసి ఖ్యాతి గడించెను. అట్లు దానమివ్వ బడిన వస్తువును తిరిగి నేను బహుమతిగా పుచ్చుకొనుట భావ్యము గాబోదు. దేవా ! ఈ సాంసారిక జీవనమున కింతటితో స్వస్తి చెప్పి, యోగివరులు సమాధి ద్వారా మీ సత్పధమును సాధించుకొనునట్లు నేను నా పతితో సహగమనము చేసి మీసాన్నిధ్యము పొందుటకు అభిలషించుచున్నాను. జగన్నాధా ! భవదీయ ప్రాప్తికి ఇంతకంటే మంచి సమయము నాకు లభించుట దుస్తరము."

ఆ సాధ్వి సాధు వాక్కులకు సాకేతపతి సంతోషించి తథాస్తు పలికెను. సత్వరమే సుగ్రీవుడు స్వామి సంకేతము ననుసరించి ఇంద్రజిత్తు శిరము దెచ్చి నాగకన్య కప్పగించెను.

ప్రాణపతి ఖండిత శిరము చూచినపుడు సులోచన హృదయము క్షోభించి పోయెను. దుఃఖార్తయై దీన స్వరమున— "హా నాధా ! నా జీవనమూర్తీ !" యని యెలుగెత్తియేడ్చెను. చేలాంచలముచే నాధుని ముఖము తుడిచి హృదయమున కత్తుకొని పరివరి విధముల విలపించెను. తదనంతర మా సాధ్వి రామ విభీషులకు ప్రణమిల్లి ప్రాణేశుని శిరముతో బయలు దేరెను. విభీషణాదులు సులోచనను శిబిరమున కావలి వరకు సాగనంపి తిరిగి వచ్చిరి.

అప్పటికే రావణాది రాక్షస ప్రముఖులు మండోదరి మొదలగు అంతః పురాంగనలు నదీ సాగర సంగమస్థలికి వచ్చి ఆమె రాకకై నిరీక్షించు చుండిరి. సులోచనను జూచి అచట చేరిన అసుర మండలి శోక సంతప్తమాయెను. దశకంఠుడు దీనాతి దీనుడై కంట తడిబెట్టుకొనెను. పిమ్మట రక్షో వీరులు చందన గంధ సుగంధ ద్రవ్యములు సమకూర్చి, స్వర్గమునకు సోపానమో యన్నట్లు చితిపేర్చిరి.

తదుపరి వాసుకి కన్య సులోచన అత్తమామలకు ప్రణమిల్లి, ఆప్త జనులకు ధైర్య వచనములు పలికి, మిత్రుల యొద్ద సెలవు పుచ్చుకొని, ప్రాణవల్లభుని శిరము ఒడిలో నుంచుకొని భగవంతుని స్మరించుచూ చితిపై కూర్చొనెను. క్షణములో అగ్ని జ్వాలలా పతివ్రత స్థూల దేహమును దహించి వేసెను. సతీ సులోచన పతితో కూడ పరమ పదము చేరుకొనెను.

ఒక ముసలావిడ, వాళ్ల బ్బాయికి డబ్బులిచ్చి, పది గ్రాముల ద్రాక్షపండ్లు తీసుకొని రమ్మంది. కాని, ఆ అబ్బాయి తెచ్చిన ద్రాక్షపండ్లను తూకం వేయగా ఐదు గ్రాములే వున్నాయ్. ఆవిడ దుకాణదారుని వద్దకు వెళ్లి అడగ్గా, అతను, వాళ్లబ్బాయిని కూడా తూకం వేయమని సలహా ఇచ్చాడు.

## రావణుడు అహిరావణుని సహాయము కోరుట

ఇంద్రజిత్తు లోకవీరుడు. అతడు మరణించినందుకు లంకా వాసులు దిగులుగొని దుఃఖించిరి. రావణుడు మణిని పోగొట్టుకున్న సర్పము పగిది పుత్ర శోకార్తుడై పలువిధముల పరితపించెను. "వత్సా ! దేవతలను ధర్షించితివి, దిక్పాలురను ధిక్కరించితివి, జగజ్జెట్టివై లోకములను గడగడ లాడించితివి. నాయనా ! అట్టి అమేయ బల సంపన్నునివి నేడు విగత జీవుడవై వీర స్వర్గమలంకరించితివా! ధీరా ! నీ నిర్గమనముతో దనుజకులము ధైర్యహీన మయ్యెనే !" అని విలపించెను. రావణుడు శోక వ్యాకులితుడై తేజోహతుడయ్యెను. ఇక అంతఃపురాంగనల ఆక్రందనకే చెప్పుటకు శక్యముగాదు. ఆ రాత్రంతయూ లంకలోని ఆ బాల గోపాలము శోకార్ణవమున మునిగి యుండెను.

వ్యసన వ్యగ్రాంతుడగు దశకంఠునికి ఆ రాత్రి కడుపుకు అన్నము, కంటికి నిద్ర దూరమయ్యెను. రాత్రి నాల్గు ఘడియల కాలము గతించిన మీదట అసురేసునికి అహిరావణుడు జ్ఞప్తికి వచ్చెను. దశగ్రీవుడు తక్షణమే శివాలయమునకు పోయి శుచియై శివుని ఆరాధించ సాగెను.

"భవానీ ! రావణుని కనేక కుమారులు కలిగిరి. వారిలో అహిరావణుడొకడు. వీడు తల్లి గర్భము నుండీ ఇరువది సర్పములతో జన్మించెను. రావణుడు వీని పుట్టుకకు భీతిల్లి శ్వాసానను డను రాక్షసుని ద్వారా లంకకు నైఋతి భాగమున భూమిలో పాతి పెట్టించెను. ఆ శిశువు మన్ను తినుచూ భూమిని తొలుచుకొని పోయి ఒక నెల దినములకు సముద్ర తీరము చేరెను.

రాహువు తల్లి సింహిక ఆ బిడ్డ నెత్తుకొని పోయి తాను పెంచుకొను చుండెను. ఒకానొక దినము శుక్రాచార్యుడు ఛాయాగ్రాహిణి సింహిక ఇంట పెరుగుచున్న యీ బాలుని చూచి "సింహికా! వీడు దశగ్రీవుని తనయుడు. వీనికి అహి రావణుడని నామకరణము చేయుచున్నాను—" అని చెప్పి ఆమెకు వాని జన్మ వృత్తాంతము తెలియజేసెను. తన పుట్టుక రహస్యము తెలియగనే అహిరావణుడు ఖిన్నుడై సముద్రమున దూకెను.

సాగరమున మునిగి అహిరావణుడు అక్కడ నుండి చిన్నగ వితర లోకమందున్న భోగవతీపురము చేరుకొనెను. వాసుకి బావమరిది దర్వీకుడను రాజు ఆ పట్టణమును పాలించు చుండెను. ఆ నగరమందొక చోట జరుగుచుండిన పురాణ కథా కాలక్షేపమునకు అహిరావణుడు పోయేను. అప్పుడచట తపో మహాత్మ్యమును గురించిన ప్రసంగము జరుగు చుండెను. అది శ్రద్ధగా ఆలకించిన అహిరావణునికి తపస్సు చేయు సంకల్పమాయెను. అక్కడ నుండి నాడు కామదదేవి ఆశ్రమమునకు చని, అక్కడ నిష్ఠాగరిష్ఠుడై పధ్నాలుగు వేల సంవత్సరములు ఘోరమగు తపస్సాచరించెను. దేవి వాని దీక్షానిరతికి మెచ్చి ప్రత్యక్షమై వరమడుగుమని కోరెను. అహిరావణుడు ఆనంద విభోరుడై కరములు ముకుళించి— "తల్లీ! నా తండ్రి నన్నుతిరస్కరించి నన్ను అవమానించెను. అతడు నా బలమును గుర్తించి నన్నొకమారు యాచించవలయును. వెండియు నా కెవరివలనా మృత్యువు సంఘటిల్లకుండునట్లు వరము ప్రసాదింపుము." అని వేడెను.

"రావణా! త్రేతా యుగాంత మందు లంకేశుడు నిన్ను ప్రార్థించి నీ సహాయము నపేక్షించ గలడు. పోతే రెండవ కోర్కె కూడా నీకు సిద్ధించ గలదు. కాని ఒక్క వనచరుడు మాత్రము నా వర శక్తిని దిక్కరించగల సమర్థుడు. వాడును వాని ప్రభువు మినహా మరెవ్వరూ నిన్ను సంహరించ జాలరు. నీవు సకలైశ్వర్య సంపన్నుడవై చిరకాలము సుఖింపుము." అని దీవించి దేవి అంతర్ధాన మయ్యెను.

# రామచరిత మానస్

పిమ్మట కొన్ని శతాబ్దములు గతించెను. అహిరావణుడు వరగర్వితుడు, బలోద్ధతుడై వాడు చిన్నగ హింస కార్యములకు పూనుకొనెను. ఒకసారి వాడు నాగుల రేడు దర్వీకునిపై బడి వానిని ఓడించెను. పరాజితుడైన దర్వీకుడు శేష నాగుని సంప్రదించి అతని సమ్మతి మేరకు తన కూతురు కుందనిని అహిరావణున కిచ్చి అతనితో చెలిమి చేసుకొనెను. అపైన రావణాత్మజుడు భోగవతీ పురమును తన మామకు ఇచ్చివేసి తాను వనాంతరమందు కామదేవి ఆలయమునకు సమీపమున తొమ్మిది వేల యోజనముల విస్తీర్ణముగల ఒక మహా నగరమును నిర్మించుకొని అచ్చట స్వజన పరివార బంధు సమేతముగ సకల భోగములు అనుభవించుచుండెను.

"శైలజా! ఇదీ అహిరావణుని సంక్షిప్త చరిత్ర." అని చెప్పి శంకరుడు శంకరికి శేషించిన కథా భాగమిట్లు చెప్ప దొడంగెను.

ఆనాటి రాత్రి లంకలో శివాలయమందు అసుర నాథుడు అహిరావణుని స్మరించుచూ కూర్చొనియుండెను. ఆ సంగతి గ్రహించిన అహిరావణుడు సత్వరమే తండ్రి యొద్దకు వచ్చి నమస్కార పూర్వకంబుగా కుశల ప్రశ్న చేసి తనను పిలిపించిన కారణమేమని అడిగెను.

లంకేశుడు తనకు రామునికి జరుగుచున్న సంఘర్షణ వృత్తాంతమంతయు తనయునికి సంక్షిప్తముగా తెలియజేసిన పిమ్మట గద్గద స్వరమున ఇట్లు ప్రసంగించెను.

"నాయనా అహిరావణా! ఇంకనూ నా క్షేమ మడిగెదవా! కుశలమంతయూ గతించె, కొండల వంటి ధీరవీరులైన కుంభ కర్ణ మేఘనాద అకంపన అక్షయ కుమారులతోనె నా కుశల క్షేమము లన్నియూ సన్నగిల్లి పోయెను. పుత్రా! దిగ్గజమ్ము ల్లాంటి దానవ యోధు లొక్కొక్కరే ఆ సన్యాసుల చేతులలో హతులయ్యిరే! ఈ పరాభవము నేనెట్లు భరించగలను! దీనికి ప్రతీకార మాలోచించుటకై నిన్ను పిలిపించుటకు ప్రయత్నించితిని. నీవు నీ శక్తి సామర్థ్యములయూ ప్రయోగించి శత్రు సంహారము చేసి నాకు శాంతి సంఘటిల్ల చేయవలసిందని అర్థించుచున్నాను." అని పౌలస్త్యుడు ప్రార్థనా పూర్వకముగా పుత్రునితో మొరపెట్టుకొనెను.

రామునితో శత్రుత్వము రాక్షస జాతికి శుభకరముగాదని అహిరావణుడు ఆవేదనపడెను. ఈ అనర్థమును ఇప్పటికినీ అసురేశుడు అర్థము చేసుకొను స్థితిలో లేడు. కాబట్టి ఇక తానాచరించ వలసిన కార్యము తండ్రి అభిలాషను తీర్చుటొక్కటే మిగిలియున్నది. అని నిశ్చయించుకుని అహిరావణుడు తండ్రితో "— పితాజీ! మీ యాజ్ఞ చొప్పున రామలక్ష్మణులను దేవికి బలి యిచ్చి మీ ఋణము తీర్చుకొందును. తద్వారా మన జాతికి మంగళము, నాకు సత్కీర్తి సంఘటిల్ల గలదు, అదియే చాలు. నేను శత్రువులను తీసుకొని పోవునపుడు నీవొక వెలుగును చూడగలవు—" అని చెప్పి వాడు దశాననునియొద్ద సెలవు తీసుకొని వానర స్కంధా వారము వైపు పోయెను.

## అహిరావణుడు

## రామలక్ష్మణులను గొంపోవుట

ఆ రాత్రి అహిరావణుడు తన మాయా బలముచే ఆకసమంతటా కారుమేఘములు వ్యాపింప జేసెను. కాళరాత్రి కటిక చీకటి, కన్ను పొడుచుకున్నా కానరాని గాఢాంధకారము. శాఖాచర వీరులు జాగరూకులై సేనా శిబిరములకు కావలిగాయుచుండిరి. స్కంధావార ప్రవేశ ద్వారము యొద్ద వాయుపుత్రుడు వీరాసనాసీనుడై వేయి కండ్లతో నిశాచరుల జాడలు కనిపెట్టుచుండెను. ఆ నిశివేళ కపియోధుల కనుగప్పి కటకములో ప్రవేశించుట గాలునికైనా సాధ్యము గాదు. కానీ అహిరావణుడు ఆరితేరిన జిత్తులమారి. వాడు ఆంజనేయుని కనుగప్పుటకై విభీషణుని రూపుదాల్చి సునాయాసముగా లోనికి వెళ్లిపోయెను.

ఆ తంత్రజ్ఞుడట్లు లోన ప్రవేశించి రామలక్ష్మణులు శయనించియున్న శిబిరమును సమీపించెను. దానికి నలువైపుల సుగ్రీవ అంగద నల నీల జాంబవంతులాది సేనాపతుల గుడారములుండెను. నిశాటుడు నెమ్మదిగ శిబిరములోనికి పోయి, అందులో నిద్రించుచున్న శ్రీ దేవదేవుని దివ్య సుందర విగ్రహమును గాంచి భక్తితో ప్రణమిల్లెను. తదుపరి వాడు తన మంత్ర ప్రభావమునే వానర సేన నంతటినీ గాఢముగా నిద్రావశమగునట్లు చేసెను. నరాంతకుడంత యే మాత్రము విలంబనము చేయక నిద్రించుచున్న రాజకుమారిద్దరిని తీసుకొని అంతరిక్షమున కెగసి అదృశ్యుడయ్యెను. ఆ సమయమున ఆకాశమందు ఒక దివ్యజ్యోతి ప్రకాశించెను. దానిని చూచి రావణుడు రామలక్ష్మణులు అహిరావణునిచే గొంపోబడు చున్నారని ఆనందముతో వళ్ళు మరచెను.

శిబిరములో కోసల కుమారులు లేకుండుట చూచి కపులు రిచ్చగొనిరి. ఈ వార్త క్షణములో స్కంధవారమంతటా గగ్గోలు పుట్టించెను. ఆ కాళరాత్రిలో వేలాది వానర వీరులు దివిటీలు పట్టుకొని శిబిరమంతయు గాలించి రామలక్ష్మణులను గానక హతాశులై దిగులొందిరి.,— "గరుత్మంతా! నీరు లేని నది, చంద్రుడు లేని రాత్రి జీవుడు లేని దేహము వలె రామలక్ష్మణులు లేకున్నందుకు వానరుల ముఖములు వెలవెలబోయెను. స్కంధావారమంతయు నిముసలో శోకార్ణవ మయ్యెను"— అని కాకభుశుండి గరుడునితో పేర్కొనెను.

కపిరాజు సుగ్రీవుడు శోక వ్యాకులితుడై తన అనుచరులను వీక్షించి— "కపులారా! రామలక్ష్మణుల జాడ తెలియరాకున్నది. ఏదో మాయ జరిగినట్లున్నది. విధి కృత మెంత విపరీతమైనది! ఒక్క దశాననుడు తప్ప దనుజాతి సర్వము హతశేషమై యున్న ఈ అనుకూల సమయంలో ఎంత దారుణము సంఘటిల్లెను! మనము రావణుని సంహరించినను సీతకు శ్రీరాముని గురించి యేమి చెప్పగలము! హా విధీ!" అని వాపోయి సుగ్రీవుడు శోష వచ్చి మూర్ఛిల్లెను. (సశేషం)



మీరు సెన్సార్ బోర్డు మెంబరైనంత మాత్రాన యీ విధంగ యింట్లో క్యాలెండర్లన్నిటినీ కత్తిరించాలనుందా??

# ఎండమావులు

15 వ పేజీ తరువాయి

"జయా వయస్సులో నీకన్నా పెద్దదాన్ని. జీవితంలో అనేక సంఘటనలకు తలొగ్గి అనుభవాలు పెట్టని కోటలుగా నిర్మించుకుని జీవిస్తున్న మీ పెద్ద వదినను, నా దగ్గర నీకేమీ దాపరికం లేదుకదూ" అన్నది స్వాతి.

జయలక్ష్మి కళ్ళు జలజల కన్నీళ్ళను కార్చినయ్యి. ఆమె కన్నీళ్ళను తన పైట చెంగుతో తుడుస్తూ "ఏడుస్తున్నావా జయా, కొందరి ఆడవాళ్ళ జీవితాలు ఏడవటానికే ఏర్పడినయ్యి. నిజం చెప్పు జయా! నువ్వు మురహరిని ప్రేమిస్తున్నావా"

"వదినా" అంటూ స్వాతి వళ్ళో తలపెట్టి రెండు చేతుల్తోనూ ముఖం కప్పేసుకుని బావురుమంది జయలక్ష్మి. ఎంతో అధైర్య పడిందానిలా కుళ్ళి కుళ్ళి ఏడవసాగింది.

ఈ ఏడుపు విని కృష్ణమూర్తి వచ్చాడు. కళ్ళతోనే సంజ్ఞచేసి అవతలికి వెళ్ళి పొమ్మంది స్వాతి. ఇలాంటి వారి జీవిత ఘోష వింటూంటే ఏ భావాలు స్ఫురించి ముఖంమీదనే ఏ మాట అంటారో అని స్వాతి భయం. కృష్ణమూర్తి వెళ్ళిపోయాడు.

కన్నీళ్ళతో తడిసిన జయలక్ష్మి ముఖాన్ని పైకెత్తి తన హృదయం మీదికి లాక్కుని చేత్తో తలనిమురుతూ ఓదార్చసాగింది స్వాతి.

జడివాన కురిసి వెలిసినట్టుగ్గా కన్నీటి ధారలు వాటంతటవే ఆగి పోయినయ్యి. రోజంతా వాన కురిసి వెలిసిన శ్రావణ మాసపు నీలాకాశంలా ఉంది జయలక్ష్మి మనస్సు. ఆ ప్రశాంత వాతావరణంలో స్వాతి దరహాస వదనం తప్ప జయలక్ష్మికి ఇంకేమి కన్పించటం లేదు. ఆమె పరమేశ్వరి. తాను ఆమె భక్తురాలు అనుకుంది జయలక్ష్మి.

"మురహరిని ప్రేమిస్తున్నాను వదినా. కొన్నాళ్ళుగా నా ప్రేమ పైకి పొంగలేదు. నాలోనే ఇమిడి పోయింది. నా మనస్సు తెల్సుకుని ఎంతో ఆలోచించి ఒక నిర్ణయానికొచ్చి నిన్ను పెళ్ళి చేసుకుంటాను జయా అన్నాడు మురహరి. నా జీవితంలో అంతకన్నా నేను ఆశించవలసిందేమీ లేదు. అదే జరిగితే నా జన్మ తరించి ధన్యత చెందినట్లే. నీ ముందు ఏ అబద్ధమూ ఆడను వదినా. ఒక్క మాట. హద్దులు దాటి మేమెన్నడు ప్రవర్తించ లేదు" అన్నది జయలక్ష్మి.

జీవితంలో ఆశించని భయంకర వేదనా, దుఃఖమూ. భయమూ ఒక్కసారి పదకొండేళ్ళ క్రితం స్వాతిలో కలిగినయ్యి. ట్రైనింగు చదువుకునే రోజుల్లో రాజేశ్వరి ఇంట్లో జరిగిన సంఘటన అది. అలాంటి పరిస్థితి మళ్ళీ ఇన్ని సంవత్సరాలుగా ఎన్నడూ కలుగ లేదు. మళ్ళా ఈ నాడు అన్ని సంఘటిత శక్తులూ ఏకమైనట్లు అయింది. తుపానులో చిక్కుకున్న ఓడలా ఉందామె మనస్సు.

"జీవితంలో తెలీకుండా అనేక పొరబాట్లు చేస్తూంటాం జయా! దాని వల్ల మంచి జరిగినా చెడు జరిగినా మన జీవితానికి సంబంధించినదిగానే ఆ పర్యవసానం ఉండాలి గాని ఇతరుల్ని కష్ట పెట్టేదిగా ఉండకూడదు" అన్నది స్వాతి.

"కాని ఏ మానవునికీ అట్లా అనిపించదు. స్వార్థం కళ్ళు కప్పేస్తుంది. మనస్సును వశపర్చుకుంటుంది. హృదయంలో స్థానం ఏర్పరచుకుంటుంది. నువ్వు అన్నయ్యను పెళ్ళి చేసుకున్నావు. అన్నయ్యకు తల్లి దండ్రులతో తెగ తెంపులయి పోయింది. ఇది మరీ నీ ధర్మ సూత్రాలకు వ్యతిరేకంగా ఉంది. ఇందుకేమంటావు వదినా" అన్నది జయలక్ష్మి.

"నిప్పులో వేలు పెట్టాను కాలింది. నా చెయ్యి కాలిందని నేను తెల్సుకున్నప్పుడు అదే పని ఇంకొళ్ళు చేస్తున్నప్పుడు చూస్తూ పూరుకోవటం భావ్యం కాదేమో జయా."

ఇంతలో కృష్ణమూర్తి పిలవటంతో స్వాతి ముందు గదిలోకి వెళ్ళింది.

జయలక్ష్మి మనస్సు విచిత్ర గతిలో జీవిత గ్రంథంలోని పుటలు తిరగ వేస్తున్నది. మురహరితో తను ఎన్నో సార్లు ఎన్నో విషయాలు మాట్లాడింది. ఆ మాటల్లో ఎప్పుడూ అతను జ్యోతి ప్రస్తావనే తీసుకురాలేదు. మేనమామ కూతుర్ని చేసుకునే పక్షంలో తమ ఇద్దరి స్నేహం అంత దూరం తీసుకు రాలేకపోయేవాడేమో? ఈ భావన ఆమె హృదయంలో చెంగున ఎగురుతూ ప్రవేశించే సరికి ఆమె కళ్ళు రెండూ విచిత్రంగా మెరిశాయి. ముఖంలో దేదీప్యమానమైన ఒక ఆశా జ్యోతి వెలిసినట్లుగా ముఖ కవళికలు మారినయ్యి. స్వాతి కృష్ణమూర్తితో మాట్లాడి వచ్చేసరికి జయలక్ష్మి నవ్వుతూ ఆమె వైపు చూసింది.

"వదినా. మురహరి జ్యోతిని ప్రేమిస్తున్నాడని ఆమెనే పెళ్ళి చేసుకో గోరుతున్నాడనీ నీకు బాగా తెలుసా"

ఉక్కిరిబిక్కిరైంది స్వాతి. ఇలాంటి ప్రశ్నకు తను సమాధానం చెప్ప వలసి వస్తుందని ఆమె అనుకోలేదు. నిశ్చల భావంతో ఏదో ఆలోచిస్తూ కూర్చుంది స్వాతి. ఆమె మానసిక పరిధిలో ఈ ప్రశ్నకు వెంటనే సమాధానం దొరకలేదు. ప్రశ్నను అవతలకు నెట్టి ఒక పెద్ద నవ్వు నవ్వింది స్వాతి. అది సంతోషపూర్వకమైన నవ్వుకాదు. నిర్జీవమైన నవ్వుకాదు. పరిహాస పూర్వకమైన నవ్వూకాదు. ఒక జటిల సమస్యను ఎదుర్కొనేటప్పుడు ఇలాంటి సమస్యల్లో నేను పెద్దరికం వహించటమేమిటని నిర్లిప్తతా భావంతో నవ్విన నవ్వు అది. ఈ నవ్వు జయలక్ష్మి హృదయంలో పెనుగాలి లేపింది. ఈ గాలి దుమారం ఎప్పుడు సమసి పోతుందో ఆమె తెల్సుకోలేక స్వాతి ముఖంలోకి తేరిపార చూసింది.

పైట చెంగుతో నవ్వు ఆపుకోటానికి ప్రయత్నిస్తూ "జయా, ఇంక ఇవ్వాళకు వెళ్ళిరా, కాలగతే నీ మనస్సును మార్చుతుంది" అన్నది.

జయలక్ష్మి వెళ్ళింది.

* * *

కూల్ డ్రింకు షాపులోనుంచి వస్తున్న జయలక్ష్మినీ, మురహరినీ తాసిల్దారు గారు జీపులో వెళుతూ చూశారు. వారిద్దరూ ఆయనను చూడలేదు. సాయంత్రం ఆరు గంటలు దాటినా ఇంకా వడగాల్పులు తగ్గనేలేదు. సినిమాకు వెళదామన్నాడు మురహరి. నది వద్దకు వెళ్ళి ఇసుకలో కూర్చుందామన్నది జయలక్ష్మి.

ఇద్దరూ కృష్ణ వద్దకు వెళ్ళి కూర్చున్నారు.

# ఎండమావులు

"జ్యోతి మీ మేనమామ కూతురనీ, ఆమె నిన్ను ప్రేమిస్తున్నదనీ నాకెప్పుడూ చెప్పలేదేం మురహరి"

ఈ మాటలు వ్యంగ్యంగా, ఎగతాళిగా ధ్వనించి నయ్యి మురహరికి. ఆకస్మికంగా ఇక్కడకు వచ్చి సరదాగా ఆహ్లాదకరమైన కబుర్లు చెప్పకుండా జీవిత కోణాల్లోని అనవసరమైన ఒక మార్గాన్ని ఒక విభాగాన్ని వెలికి లాగి దాని నేదో సరిదిద్దే తీరున జయలక్ష్మి ఎందుకు మాట్లాడుతున్నదో అర్థం కాలేదతనికి.

"నేను జ్యోతిని ప్రేమించటంలేదు. ఏ సమయంలోనూ ఒక ఈడొచ్చిన పిల్లను గురించి నీతో మాట్లాడవలసిన సందర్భమూ, అవసరమూ నాకు ఇంతకు ముందెప్పుడూ కలగలేదు" అన్నాడు మురహరి ముభావకంగా. అతని కళ్ళు చెమ్మగిల్లి నయ్యి. ఆనంద మాధుర్యంలో నిమగ్నమై ప్రేమతో ఎదురుగా కూర్చొని మాట్లాడవలసిన మురహరి కళ్ళల్లో ఆ కన్నీటిని చూసే సరికి జయలక్ష్మి త్రుళ్ళి పడింది.

మళ్ళా వ్యధిత హృదయంతో అన్నాడు మురహరి.

"జ్యోతి నన్ను ప్రేమిస్తున్నదని ఇదమిద్ధంగా ఇప్పుడిప్పుడే తెల్సుకుంటున్నాను. ఆ పిల్ల ఎంతగా ప్రేమిస్తున్నదో, దానికి ద్విగుణీకృతమైన కోపంతో ఉన్నది మా అత్తయ్య. తమతో సరి తూగగల స్తోమత నాకు లేదని ఆవిడ ధృఢ నమ్మకం. మా మావయ్య కూడా కూతురు పక్షమే.కాని నా మనస్సు మాత్రం జ్యోతియందు వీసమైనా మొగ్గటం లేదు. ఇంత కాలంగా నా మీద నువ్వు చూపుతున్న శ్రద్ధా, ప్రేమ ఆదరాభిమానాలతో తలమున్కలుగా ఉన్నా నాకు జ్యోతిని గురించి ఆలోచించే అవుసరమే లేకపోయింది. నిజంగా జ్యోతి పిచ్చిపిల్ల. ఆ రకమైన సానుభూతి తప్ప ఆమె విషయంలో నేను ఆశించేదేమీ లేదు." అన్నాడు మురహరి.

జయలక్ష్మి సిగ్గుతో నదివైపు చూస్తూ కూర్చుంది. చల్లగాలికి రెపరెపలాడుతూ ముఖాన నాట్యం చేసే ఆమె ముంగురులను విచిత్రానుభూతుల్తో చూస్తున్నాడు మురహరి. విశాఖపట్నంలో ఉన్న జయలక్ష్మి ముఖంలోనూ, ఇప్పటి జయలక్ష్మి ముఖంలోనూ ఏదో తేడా ఉన్నట్లుగా తోచిందతనికి.

"జయా"

ఇటు తిరిగి చూసింది.

"నీలో ఈ సందేహాలు ఎందుకు కలిగినయ్యి. సందేహరహితమైన నా సమాధానం వినగానే నీలో ఏదో తెలీని ఆనందం దోబూచు లాడుతున్నట్లుగా నాకు కనబడుచున్నది. నేను జ్యోతిని పెళ్ళి చేసుకోవచ్చునని అంచనా వేసుకున్నావు కదూ."

"మేనరికం చేసుకోటంలో తప్పేముంది. ఆమె కన్య. అభమూ శుభమూ తెలియని అమాయుకురాలు. నిన్ను నమ్ముకుంది. బావనే పెళ్ళి చేసుకోవాలనుకుంది. నా సంగతి వేరు. నేను వితంతువును. నన్ను చేసుకోటానికి పెద్దలు ఒప్పుకోక పోవచ్చు. ప్రేమ అనేది పెన్నిధిలాంటిది కాదు. సాంఘిక కట్టు బాట్లు, విలువలూ, మర్యాదలూ ఇవే పెన్నిధిలాంటివి. జ్యోతిని చేసుకుంటే నీకు విలువ, మర్యాద ఎక్కువవుతుంది. తాసిల్దారుగారి అల్లుడవవుతావు. జ్యోతిలో ఏం చూసి నువ్వు ఆ పిల్లను ప్రేమించలేక పోతున్నావో నాకు తెలీటం లేదు. నన్ను చేసుకుంటే సంఘసంస్కరణ వివాహం చేసుకున్న వాడివవుతావు. అంత మాత్రం చేత నీ గౌరవ ఇనుమడించదు" అన్నది జయలక్ష్మి. ఆమె ముఖంలోని విషాదరేఖలు నిగ్గు తేలి, మేఘాలుగా మారి వర్షించినయ్యి.

"జయా" అంటూ ఒక్క అరుపు అరిచి ఆమెను పొదివి పట్టుకున్నాడు. ఆమె బావురుమని ఏడవసాగింది.

"ఏమిటిది జయా ఎవరేమన్నారు? నీలో అకస్మాత్తుగా ఈ మార్పు ఎందుక్కలిగింది? స్వాతి ఏమైనా అన్నదా"

ముభావకంగా అతని ముఖంలోకి చూసింది.

"అవును ఎందుకు అనదు? తన జీవితాన్ని ఒడుదుడుకులు లేకుండా గడుపుతున్న పతితురాలు. ఎన్ని కబుర్లయినా చెపుతుంది. ఆమె జీవితం కోసం కృష్ణమూర్తిని బలిపెట్టింది. ఆ పుణ్యాత్ముడు తల్లిదండ్రులకు దూరమై గుండె జబ్బుతో బాధ పడుతున్నాడు. ఈవిడ నాకు హితోక్తులు చెప్పబూనిందా, చాలు ఇక స్వాతి విషయం చెప్పకు" అంటూ ఆమె కన్నీళ్ళు తుడిచాడు మురహరి. ఆమె ముఖం వాడి పోయింది. విశాఖపట్నంలో ఉన్నంత వరకూ ఆమె హృదయం మురహరి విషయంలో ఒడ్డులు ఒరుసుకుని ప్రవహించే గంభీరమైన మహా నదిలా ఉన్నది. ఇక్కడికి వచ్చింతరువాత ఆ నదీ ప్రవాహపు వేగం కొంత తగ్గింది. ఇప్పుడు వైశాఖ మాసపు కృష్ణా నదిలా బక్క చిక్కింది. ముఖంలో మాత్రం శ్రావణ మాసపు మేఘాలు ద్యోతకమౌతూనే ఉన్నయ్యి. నిన్నటినుంచి ఆమె మనస్సు దారీ తెన్నూ లేని పాంథుని పాదయాత్రలా ఉన్నది. గమ్యం ఎక్కడకో తెలియదు. అసలు గమ్యస్థానం ఎప్పుడు చేరునో కూడా తెలీదు.

కన్నీటి చారికలతో తడిసిన ఆమె చెక్కిళ్ళను తుడుస్తున్న మురహరికి ఏదో అనిర్వచనీయమైన, బలీయమైన తీవ్ర వాంఛ శరీరంలో సుళ్ళు తిరిగింది. ఉద్రేకం అంచులు తట్టింది. అప్రయత్నంగా ఆమెను హృదయానికి హత్తుకుని తన పెదవులతో ఆమె చెక్కిళ్ళను స్పృశించాడు.

తోక తొక్కిన త్రాచులా లేచి నిల్చుంది జయలక్ష్మి. నిలువెల్లా కంపించి పోతున్నది ఆమె శరీరం. ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసాలు బుస కొడుతున్నట్లుగా ఉన్నయ్యి. నఖ్ఖు తెలియని కోపంతో కృద్ధురాలై పోయింది.

"మురహరీ ఇదా నీ కోరిక. జాగ్రత్త! హృదయమిచ్చిన స్త్రీలతో మమతలు తీర్చుకోటంతో సరిపోదు. ఆ మమతను శాశ్వతంగా నిలుపుకో కలిగిననాడే అది గౌరవ ప్రదమైన జీవితమవుతుంది. మానసిక వ్యధతో కుమిలి పోయే స్త్రీ హృదయం అర్థం చేసుకోటానికి ఇది సరైన మార్గమనుకుంటె నీ జీవితాన్ని నాశనం చేసుకున్నట్లవుతుంది. శలవు." అంటూనే వెనక్కు తిరిగి చూడకుండా వెళ్ళి పోయింది.

హతాశుడై చూస్తూ కూర్చున్నాడు. మురహరి.

## 29

ఆ రాత్రి తాసిల్దారుగారు మేనల్లుడినడిగాడు. "మురహరీ, నువ్వూ జయలక్ష్మి ఆ డ్రింకు షాపులో నుంచి వస్తున్నారు కదూ, అక్కడినుంచి ఎక్కడికి వెళ్లారు?"

"ఏం మావయ్యా ఇట్లా అడుగుతున్నారు."

"నా ఇంట్లో ఉంటూ, నా తిండి తింటూ ఉన్నంతకాలం నీ బాగోగులు విచారించవలసిన బాధ్యత నాకు ఎంతైనా ఉంది. ఫలాని తాసిల్దారుగారి మేనల్లుడు ఎవరో కాలేజీ అమ్మాయితో తిరుగుతున్నాడంటే నాకు మాత్రం నామర్దా కాదా" రెట్టించి అడిగాడు మళ్లీ.

"మావయ్యా అనవసరంగా ఉద్రేక పడకండి. ఈరోజున వెళ్లిపొమ్మన్నా వెళ్లిపోతాను. ఒక్క మాట. నాకు జ్యోతి నిచ్చి చేసి మీ అల్లుడు చేసుకోవా లనుకుంటున్నారు. ఆ ఉద్దేశ్యంతోనే ఇంతకాలం నుంచి మీరు నన్ను దగ్గరకు తీసి నా మంచి చెడ్డలూ, బరువు బాధ్యతలూ వహిస్తున్నారు. అందుకు సర్వదా కృతజ్ఞుడిని. కాని ఆ ఆశ మాత్రం పెట్టుకోవద్దని నా మనవి. జ్యోతిని నేను పెళ్లి చేసుకో దల్చుకోలేదు. నేను జయలక్ష్మినే పెళ్లి చేసుకో దల్చుకున్నాను. కోప గించుకోక నా కోరిక మన్నించండి." అన్నాడు మురహరి.

ఆయన తల నరికేసినట్లయింది. కప్పు కూలిపోయినట్లుగా కుర్చీలో కూర్చున్నాడు. ఆయన మనస్సులోని ఆశలన్నీ ఒక్కొక్కటే ఎగిరిపోసాగినయ్యి.

"అంతవరకూ వచ్చిందన్నమాట. ఈ సంగతి ఇంతవరకూ నాతో ఎందుకు చెప్పలేదు" మనస్సులోని వ్యధను వెనక్కు నెట్టి అన్నాడు

"అవుసరం లేకపోయింది. ఇప్పుడు మీరు అడిగారు గనుక చెప్పుకున్నాను" అన్నాడు మురహరి.

"జయలక్ష్మి ఎవరమ్మాయి. ఆమె తలిదండ్రులెవరు. కులగోత్రాలు, మాన మర్యాదలూ ఉన్న పిల్లేనా" ఈ ప్రశ్న అడుగుతుంటే ఆయన కంఠం పూడిపోయింది.

మేనమామ ఆ మాట అంటుంటే మురహరి మనస్సు ఉడికిపోయింది.

"ఈ కులగోత్రాల సమస్య, పట్టుదలా ఆ టీచరుగారు స్వాతికి పంక్తి భోజనం పెట్టి విందు చేసేటప్పుడు ఏమైందో" అన్నాడు మురహరి.

విస్తుపోయా డాయన.

"ఏమిటి మురహరీ నువ్వంటున్నది. స్వాతి ఏ కులస్థురాలు. నువ్వనేదేదో నూటిగా చెప్పరాదూ"

"సూటిగానే చెపుతున్నాను. స్వాతి హరిజన కులస్థురాలు. ఆవిడ మన జ్యోతికి వదినె. మీలాంటి పెద్దలే ఇలాంటి విషయాల్లో పట్టింపుల లేకుండా ప్రవర్తిస్తుంటే, సాటి కులస్థురా లయిన ఒక బాల వితంతువును నేను పెళ్లాట్టంలో తప్పులేదు. ఒక అభాగ్యురాలి జీవితానికి శాంతి సౌఖ్యాలను ఇవ్వటమే గాకుండా ఆమెను సుమంగళిగా స్వీకరిస్తున్నాను." అన్నాడు మురహరి ఆవేశంతో.

ఇదంతా ఏదో అర్థంలేని, అర్థంకాని అభూత కల్పన మాదిరిగా, కలగా కనిపించింది.

ఈ మాటలన్నీ పక్క గదిలో ఉండి వింటూనే ఉన్నది జ్యోతి. ఆమె హృదయం వెయ్యి ముక్కలయింది.

"జ్యోతి" కోపంతో బుసలు కొడుతూ పిలిచాడు కూతుర్ని.

భయంతో, నిరాశతో, నిస్పృహతో వణికిపోతూ వచ్చింది జ్యోతి.

"స్వాతి ఎవరు, ఏ కులస్థురాలు."

"అన్నీ బావే చెప్పాడుగా నాన్నా, ఆవిడ ఎవరైనా మనకు అనవసరం. ఒక మనిషియొక్క మంచితనాన్ని, మాట పొందికతనాన్ని, సత్ప్రవర్తనను కులగోత్రాల ప్రాతిపదికగా ఎంచకూడదు నాన్నా. కాకపోయినా మన ఇంట్లో ఏర్పడిన ఈ తుఫానులోకి ఆమెను ఈడ్చుకురావటం వెర్రితనమే అవుతుంది. తన దోషాన్ని కప్పిపుచ్చుకోవటానికి బావ ఎన్నో అప్రస్తుత వాక్యాలు చెప్పొచ్చు. నన్ను బావ చేసుకోలేకపోవటానికే, స్వాతి వదినె వ్యక్తిగత విషయాలకూ ఏమీ సంబంధంలేదు. ఆవిడను దూషించటం ఎందుకో నాకు అర్థం కావటంలేదు." అన్నది జ్యోతి మురహరివైపు చూస్తూ. ఆమె ముఖంలోకి చూడలేక తల వంచుకున్నాడు మురహరి.

"బావా" ఆప్యాయంగా అన్నది జ్యోతి.

"ఊ."

"నువ్వు జయలక్ష్మినే పెళ్లి చేసుకోవా లనుకుంటున్నావా."

"జ్యోతి ఏమిటా ప్రసంగం. ఎట్లా చేసుకుంటాడో నేనూ చూస్తాను" అన్నా డాయన.

"అంత కోప మెందుకు నాన్నా. నీ కోపం చూసి బావ తన మనస్సు మార్చుకుంటా డనుకున్నావా. ఏం బావా, నీ నిర్ణయం నేను తెల్సుకోవచ్చుగా."

"అవును జ్యోతీ. జయలక్ష్మినే చేసుకోవా లనుకుంటున్నాను. ఆమెను ప్రేమిస్తున్నాను. మా ఉభయులకూ ఇష్టమే."

"విన్నావుగా నాన్నా. కలసిన మనస్సులు విరుగవు. విరిగిన మనస్సులు కలువవు. బావను బలవంత పెట్టవద్దు." అని వెళ్లింది జ్యోతి. ఇదంతా అర్థంకాక తల ఎత్తుకుని హతాసుడై కూర్చుండిపోయాడాయన. మురహరి మెల్లిగా వెళ్లిపోయాడు.

"నేను నెత్తీ నోరూ బాదుకుంటూంటే విన్నారా, మేనల్లుడు మేనల్లుడంటూ మీ ఉబలాటమే గాని అత నేమయినా మంచి మర్యాదా



చూపించాడా మీయందు. ఇదంతా ఎవరో కాదు ఆ టక్కులాడి స్వాతి చేస్తున్నదే. ఈ రోజునుంచీ ఆవిడ నా గడప తొక్కటానికి వీల్లేదు. నా పిల్లలకూ ఈవిడ ప్రైవేటు అక్కర్లేదు. ఇంకా నయం. నా బిడ్డ గొంతు కొయ్యకమునుపే అన్ని విషయాలూ, కుండ పగుల గొట్టినట్లుగా తెల్సిపోయినయ్యి. ఇప్పటికయినా ఈ పద్మవ్యూహం నుంచి బయటపడ్డాం'' జ్యోతి తల్లి వచ్చి ఆయనతో అన్నది. ఈవిధంగా నైనా మేనరికం తప్పిపోయినందుకు ఆమె సంతోషపడ్డా కూతురు మనస్సు నిజంగా క్షోభిల్లుతున్నదని ఆమె మొదటి సారిగా తెల్సుకున్నది.

ఆవిడ మెల్లిగా జ్యోతి గదిలోకి వెళ్లింది. కళ్ళు మూసుకుని పడుకుంది జ్యోతి. కూతురి ముఖం లోని ఆవేదనా, దిగులూ, భయమూ స్పష్టంగా చూసిం దావిడ. జ్యోతి విషయంలో మొదటి సారిగా ఆమె హృదయం తరుక్కుపోయింది. మన స్ఫూర్తిగా బావను ప్రేమించి మనస్సులో నిలుపుకుని, హృదయపీఠంలో ప్రతిష్ఠించుకున్నది. ఈ పీఠాన్ని ఎప్పటి కప్పుడు కదిలిస్తూ మనసారా కూతుర్ని ఎప్పుడూ ఆ మూర్తిని ధ్యానించుకోనివ్వలేదు. అనుకూలమైన వాతావరణాన్ని ఆమె ఎప్పుడూ కలిపించలేదు. అపురూపమైన కూతురు మనస్సును ఆవిడ ఎప్పుడూ అర్థం చేసుకోలేదు. చిరకాల వాంఛితమైన తన అయిష్టతే ఇంత ఉపద్రవాన్ని తెచ్చిపెట్టిందేమోనని ఆవిడ ఇప్పుడు కుమిలిపోతున్నది. మేనల్లునిగా, కాబోయే అల్లునిగా మురహరిని ఆమె ఎప్పుడూ చూడలేదు. ఆ కారణం చేతనే మురహరి జ్యోతిని ప్రేమించలేక పోయాడేమోనని ఆమె ఇప్పుడు అనుకోసాగింది.

పక్కమీద కూర్చుని ఆప్యాయంగా జ్యోతి ముంగురులు సవరిస్తూ,

"జ్యోతీ'' అన్నది.

మెల్లగా కళ్లు తెరిచింది జ్యోతి. ఆమె కళ్లు ఎర్రబారినయ్యి. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు పొగలు గక్కుతున్నయ్యి. నుదుటిమీద చెయ్యివేసి చూసింది. పొట్టమీద చెయ్యివేసి చూసింది. వళ్లంతా మసిలిపోతున్నది.

"ఇంత జ్వరం పేలిపోతుంటే చెప్పనైనా లేదేం జ్యోతీ. నామీద ఇంత కోపమైతే నేనేం చేసేది జ్యోతీ.'' అన్న దావిడ.

"జ్వరం తగిలిందా అమ్మా, ఏమిటో నాకూ తెలీలేదు.'' అన్నది జ్యోతి.

"డాక్టరును పిలిపించమంటాను'' అంటూ మంచంమీద నుంచి లేచిందావిడ. తల్లి చెయ్యి పట్టుకుని విడువలేదు జ్యోతి.

"వద్దమ్మా ఒక్కపూట జ్వరానికి ఇంత హంగామా ఎందుకు. ఒక్కమాట అడుగుతా చెపుతావా అమ్మా'' తల్లి వళ్లో తల పెట్టుకుని పడుకుంది జ్యోతి. ఇదివరకు తన మనస్సులోని ఏ విషయాన్నయినా తల్లితో చెప్పటానికి బిడియపడేది. భయపడేది. తల్లి కల్పించిన వాతావరణమే అందుకు కారణం. ఈ రోజుతో ఆ భయం తీరింది జ్యోతికి.

"బావ అంటే నీ కెందుకమ్మా అంత కోపం. ఒక్కనాడయినా మర్యాదగా అతన్ని చూశావా. కనీసం ఆప్యాయంగా ఒక్కసారయినా అతని విస్తట్లో నువ్వు అన్నం పెట్టలేదు కదూ.'' తల్లి ముఖంలోకి సూటిగా చూస్తూ అడిగింది. ఆమె పైట చెంగుతో కళ్లు తుడ్చుకుంది.

"అవునమ్మా. మురహరిబావంటే ఎందుకో నాకు ఇష్టం ఉండేది కాదు. మన హోదాకు తగినవాడు కాదని నా భ్రాంతి. మేనరికానికి హోదాతోనూ, ధన ధాన్యాలతోనూ సంబంధ మేమిటనే జ్ఞానం నాకు లేకపోయింది. అదీగాక అతనూ చదువుకున్నవాడు. నిరక్షరకుక్షి కాదు. నీ మనస్సు తెలుసుకోలేక, నా అహంభావంతో నీ మనస్సును గాయపరిచాను. ఆదరణలేని అత్తతో అల్లుడుగా నేను పొందే గౌరవ మర్యాదలు ఏముంటయ్యని మురహరి నిన్ను చేసుకోదల్చుకోలేదేమో. ఈ స్థితికి తగిన వాతావరణం నేనే కల్పించాను జ్యోతీ, నేనే కల్పించాను'' అంటూ విచారపడసాగింది ఆవిడ.

కొంతసేపటికి తల్లి వళ్లోనే తల ఉంచి నిద్రపోయింది జ్యోతి. మెల్లిగా పక్కమీద పడుకోబెట్టిం దావిడ. ఆయన ఉన్నారేమో కూతురు జ్వరం సంగతి చెప్పుదా మనుకుంది. అదే సమ

యంలో స్వాతి వచ్చింది. భార్యాభర్తలిద్దరి దృష్టి స్వాతి మీదనే కేంద్రీకరించబడింది. ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

"చూడండి టీచరుగారూ పరిస్థితులు తెలియక పూర్వం పట్టింపు లుండవు. పరిస్థితులు తెలిసాక పట్టింపులకన్నా పర్యవసానమే ఆలోచించవసిన విషయం. ఇన్నాళ్లుగా మా కుటుంబంలో ఒకరుగా మీకూ తగిన స్థానం ఉంచుకున్నారు. నేటితో ఆ పరిస్థితులు తారుమారైనవి. ఇంక ఇన్ని మాటలూ అనవసరమే. ఈ రోజునుంచి పిల్లలకు ట్యూషను అక్కర్లేదు మా కుటుంబంతో మీరు చెయ్యగలిగిన స్నేహమూ లేదు. వెళ్లిరండి. ఒక్క మాట. మా జ్యోతిని కూడా మీరు మర్చిపొండి. ఇంక మా ఇంటికి మీరు రావద్దు. మీ ఇంటికి మా జ్యోతి రాదు." అన్నా రాయన.

స్వాతి మొఖం వెలవెల పోయింది. కాళ్లాడలేదు. భూమి కంపించి తాను అధఃపాతాళలోకానికి పోతున్నట్లనిపించింది. నాలుక తడారిపోయి వడదెబ్బ తగిలినవాళ్లలా పిడచగట్టుకు పోయింది. స్వేదబిందువులతో ముఖమంతా నిండిపోయి ఎంతో అలసట చెందిన దానిలా అయింది. ఆ పరిస్థితుల్లో ఏంమాట్లాడాలో ఆమె కేమీ తోచలేదు. 'జ్యోతిని ఒక్కసారి చూడనిస్తారా' అని అడగాలనుకుంది గాని అడగలేక పోయింది. గొంతు పెగిలి రాలేదు. మెల్లిగా వెనక్కు తిరిగి, వచ్చే రిక్షాను చెయ్యెత్తి ఆపి అందులో కూర్చుని ఇంటికి చేరింది.

అంతరాంతర కల్లోలపూరితమైన ఆమె హృదయంలో చెలరేగిన పెనుగాలి తాకిడికి ఆమె తట్టుకోలేక మంచంమీద వాలి చిన్నపిల్లలా వెక్కివెక్కి ఏడువసాగింది. ఈ పరిస్థితి ఏమీ కృష్ణమూర్తికి అర్థంకాలేదు. మెల్లిగా వెళ్లి ఆమె భుజం తట్టి ఏం జరిగిందని అడిగాడు.

కారణ మేమిటో తెలియుంది తను మాత్రం ఏం చెపుతుంది?

"స్వాతీ ఎందు కట్లా కన్నీరు పెట్టుకుంటావ్. ఎవరే మన్నారు. మన జీవితంలో కొత్తగా జరిగిన సంఘటనలేం లేవే" అన్నాడు.

"ఏమీ లేదండి. నా కేమీ ప్రమాదం జరగ లేదు. మీరు మనస్సులో బాధపడకండి. ఆయాసం వస్తోంది." అన్నది స్వాతి మంచంమీద నుంచే లేచి కూర్చుని. ఆమె ముఖం చూసేసరికి కృష్ణమూర్తికి ఖంగారు జాస్తి అయింది.

"ఎవరే మన్నారు స్వాతీ. నాకు చెప్పవూ" అన్నాడు మళ్లీ ఆయాసపడతూ.

"ఏమీ లేదండీ. తాసీల్దారుగారు ఇంకా ట్యూషను అక్కర్లేదు రావద్దన్నారు" అన్నది కళ్లు తుడ్చుకుంటూ.

"ఇంతమాత్రానికేనా స్వాతీ. వాళ్ళ ట్యూషను లేకపోతే మనం బ్రతకలేకపోతామా. దాని కింత విచార మెందుకు స్వాతీ, ఏమిటో అనుకున్నాను. పిచ్చిదానా" అంటూ నవ్వుతూ ఆమె బుగ్గలు తుడిచి ఆమె తలను తన గుండెలకు ఆనించున్నాడు. భర్త హృదయంలో కరిగిపోయింది స్వాతి.

* * *

"చిన్నతనంలోనే అభమూ శుభమూ తెలిని వయస్సులో భర్తను పోగొట్టుకున్న బాల వితంతువులు పునర్వివాహం చేసుకోవటం తప్పా శ్రీలక్ష్మీ" అన్నది జయలక్ష్మి.

"నువ్వెవరనైనా ప్రేమించి పెళ్లి చేసుకోవా లనుకుంటున్నావా జయా" అన్నది శ్రీలక్ష్మి ఆశ్చర్యంగా చూస్తూ. ఇవాళ హఠాత్తుగా ఈ ప్రశ్న ఎందుకు వేసిందో ఎంత ఆలోచించినా అర్థం కాలేదు.

"నా విషయమై కాదు. నీ ఉద్దేశ్యం అడుగుతున్నాను. అభిప్రాయాలు చెప్పటంలో తప్పేమీ లేదుగా." అన్నది జయలక్ష్మి.

"వైధవ్య ప్రేమ కూడా తప్పు కాకపోతే ఇంక తప్పుకాని దేముంది. నీ చదువూ సంస్కారమూ, డిగ్రీలు అవి తప్పు కాదని చెపితే ఇంక నాబోటిదాన్ని అడగవలసిన పనేముంది" అన్నది శ్రీలక్ష్మి.

జయలక్ష్మి ముఖం జేవురించింది. ఆమె ఆశించిన సమాధానం శ్రీ లక్ష్మి వద్ద నుంచీ రాదని తెల్సు అయినా తన మనస్సులోని భావాలను ఏదో రకంగా వ్యక్తపర్చాలి.

"నేను వితంతువుననీ, జీవితాన్నంతా మోడులా గడపవలసిందేననీ భగవంతుడు నా నొసట వ్రాశాడంటావు! కన్న తల్లిదండ్రులు దారిద్ర్య బాధ వల్ల చేసిన తప్పుకు శిక్ష అనుభవించమని కూడా ఈ పరమేశ్వరుడే వ్రాశాడా."

రైలు ప్రయాణం చేయదలచుకున్న ఒక ఆసామీ పెద్ద పెట్టె నొకదానిని తీసికొని, స్టేషనుకు వచ్చాడు. ఎలాగో ఒక పెట్టెలోదూరి, ఒక మహిళ కూర్చున్న సీటుకు పైన ఆ పెట్టె పెట్టాడు.

ఆవిడ : పెట్టె మీదపడితే ఎలాగా?

అతను : ఏం, ఫర్వాలేదు. అందులో పగిలిపోయే వస్తువులు ఏమీ లేవు!

మాధవ్ (మద్రాస్)

జయలక్ష్మి మనస్సును అర్థం చేసుకుంది. శ్రీలక్ష్మి. నిప్పులేందే పొగ రాదు. మనస్సులో ఆలోచన లేందే అభిప్రాయాలు పైకి చెప్పరు. ఒక నిర్ణయానికి రాందే అదే విషయాన్ని తర్కవాదనకు తీసుకురారు.

ఈ పరిస్థితులన్నీ అర్థం చేసుకుంది శ్రీలక్ష్మి.

"జయా, నువ్వు పసిపిల్లవు కావు. నీ బాగోగులు నువ్వు పూర్తిగా ఆలోచించుకునే ఒక నిర్ణయాని కొచ్చావు. ఇంతవరకూ వచ్చాక ఇంక ఇతరుల అభిప్రాయాలతో పనిలేదు. నీ జీవితాన్ని ఈ రకంగా ఒక మలుపుకు తిప్పుకుందామని నీ మనస్సులో అభిలాష ఉంటే ఎవరు కాదంటారు. పాప పుణ్యాం సంగతీ, సిద్ధాంతాల సంగతీ, ధర్మాధర్మాల సంగతీ మనస్సు ఒక రకమైన పరిణతి పొందే స్థితికి రానంతవరకే ఆచరణయోగ్యమైనది కానీ, మనస్సులో ఒక నిర్ణయం పాతుకుపోయాక ధర్మశాస్త్రాలను ఏకరువు పెట్టినా ఏమీ లాభం లేదు. ఏదయినా గుప్పెటలో వస్తువు మూసి ఉన్నంతవరకే దాని విలువ. గుప్పెట తెరిచాక ఎంత విలువగల వస్తువు కయినా ఏమాత్రం విలువా ఉండదు." అన్నది శ్రీలక్ష్మి.

జయలక్ష్మి ఉత్తేజితురాలైంది.

"అవును నిజమే, సంఘంలోని ప్రతి వాళ్ళూ తన బుద్ధిని వినియోగించి విమర్శిస్తుంటే సంఘమెట్లా నిలువలేదో, వ్యక్తిగత జీవిత విషయాల్లోనూ అంతే. అన్యాయాలు చెయ్యటం చేతనయినప్పుడు అలాంటి వ్యక్తులకి ఎదుటివారి హృదయాలను తెల్సుకునే అవసరం గాని, అనుభవం గాని ఉండదు. ఆ రీతిగానే ఒక సాంఘిక నియమానికి కట్టుబడి ఉండే వ్యక్తులకు ఎదుటివారి కష్టసుఖాలు అర్థంకావు: శ్రీలక్ష్మీ నేను కేవలం బహిరాకాంక్షలను మనస్సులో రేపుకునే ఈ నిర్ణయానికి రాలేదు. నువ్వు వితంతువువైనా నీ జీవితం వెళ్ళబుచ్చటానికి తల్లిదండ్రు లున్నారు. తోడబుట్టినవాళ్ళున్నారు. వాళ్ల నీడన నువ్వు తల దాచుకోగలవు. కాని, నాకా యోగ్యత లేదు. నేను ఎవరి నీడన ఉంటాను. కాలేజీ చదువుపూర్తయ్యాక ఉద్యోగం చేసుకున్నా, తింటూ కూర్చున్నా ఒంటరి జీవితాన్ని ఈ సంఘమూ, ప్రజలూ నన్ను గడపనిస్తారా? తమ అవసరాలకు నన్ను బలిచేస్తారు. నన్ను వంచించి అధఃపతితురాల్ని చేస్తారు. ఆ నికృష్ట జీవితం గడిపేకన్నా నా ఈ నిర్ణయమే సరైన నిర్ణయ మనుకుంటాను. ఏమంటావు శ్రీలక్ష్మి" అన్నది జయలక్ష్మి.

శ్రీలక్ష్మి మౌనంవహించింది [illegible] ఆమె నోటివెంట ఏ మాటా రాలేదు. ఏదో మాట్లాడుదా మను కుంటున్న సమయంలోనే జానకిరాం వచ్చాడు.

"జయా నువ్వు చెప్పిన మాటలన్నీ నిజమేనమ్మా, నేను సంపూర్ణంగా నీ అభిప్రాయాలతో ఏకీభవిస్తాను. ఆ అదృష్టవంతుడు జ్యోతి బావ, తాసిల్దారిగారి మేనల్లుడు మురహరి కదూ" అన్నాడు.

జయలక్ష్మి ఉదాసీనత వహించింది. ఆమె హృదయంలో వీస్తున్న తుఫానుగాలి సర్దుమణిగి, సన్నటి వానజల్లు పడుతున్నది. ఆ వాన జల్లులో తడుస్తున్నాడు మురహరి. శ్రీలక్ష్మి ఇదేమీ అర్థంకాక జానకిరాం వైపు చూసింది. కథంతా చెప్పాడు జానకిరాం.

జయలక్ష్మి హృదయాన్ని అర్థంచేసుకున్న జానకిరాం ఆమె కళ్లల్లో నీళ్లు చూసి ఆవేదన పడ్డాడు. ఈ తల్లిదండ్రులేని నిర్భాగ్యురాలికి ఒక తోడూ నీడా అవసరమే. ఇంతకాలానికి ఈ నిర్ణయానికి రావటం హర్షదాయకమే. సంఘాన్ని, సమాజాన్ని, సాంఘిక నైతిక విలువలను ఒకే దృక్పథంలో నిలుపుకుని చూస్తున్న శ్రీలక్ష్మికి, జయలక్ష్మికి పరిస్థితి అర్థంకాదు. జానకిరాం అర్థం చేసుకోగలిగినా, జయలక్ష్మి అభిప్రాయం సహేతుకమైనదైనా, మురహరినే జయలక్ష్మి ఎంచుకునేసరికి అతని మనస్సులో లీలగా జ్యోతి కనిపించింది. ఈ ఒక్క సమస్యనీ, పరిస్థితినీ ఆ పరమాత్ముడే విడదీస్తాడనే అభిప్రాయానికి వచ్చాడు.

"జయా ఆ పరమేశ్వరుడు నిన్ను రక్షించుగాక" అని కళ్ళు తుడ్చుకుని వెళ్లిపోయాడు. మనస్సులోనే హర్ష పులకాంకితమై అన్నగారికి నమస్కరించింది జయలక్ష్మి. (సశేషం)

అదే సమయంలో 'కనకం' వచ్చాడు. అతన్ని చూడగానే రు(దుడై పోయాడు అంబరం.

"ఛో! యిక్కడ్నించి ........ మళ్ళీ యే ముఖం పెట్టుకుని వచ్చావ్ ....... ? ఛో! నా కళ్ళ ఎదుట నుంచి తప్పుకో .......... ఛో!" నవనాడుల్ని కూడదీసుకుని ఆవేశంతో అరిచాడు.

కనకం — కళ్ళల్లో తిరిగిన నీళ్ళు ఎవరూ చూడకుండా చాటుగా తుడుచుకోలేక పోయాడు. కాని, రాజు దృష్టి నుంచి తప్పించుకోలేక పోయాడు.

"అంబరం ...... నీ దృష్టిలో నేను నీచుడ్ని. అవును. నీ కళ్ళముందు నిలబడేందుకు నిజంగానే నాకు ధైర్యం చాలడం లేదు. రాజు తప్పని సరిగా రావాలని పట్టుబడితే రాక తప్పలేదు. అంబరం నేనే నీ సంసారవిచ్ఛిత్తికి కారణమైన వాడినయితే నేను క్షమార్హుడ్ని కాను. కాని, అంబరం ... లలిత నిరపరాధి. ఆమెకింత ఘోరశిక్ష నెలావిధించగల్గావో నా కర్థం కాదు. జరిగింది యధాతథంగా ఏనాడో చెప్పి వుండేవాడ్ని. కాని, కాలం నాకు — అనుమతివ్వ లేదు. ఈ లోపులో చాలా జరిగి పోయింది. ఇప్పటికి నిన్ను క్షమాభిక్ష వేడుకునేందుకు వీలు చిక్కింది."

అంబరం మారుపల్కలేదు. ఎటో చూస్తున్నాడు.

"చూడు అంబరం. ఈ రోజు అటుయిటో తేల్చేయాలని, నీ విషాద జీవనం యింతటితో పరిసమాప్తి కాగా, మళ్ళీ నిన్ను మనిషిగా చేయాలని కనకాన్ని రప్పించాను. కొంచెం నువ్వు సావధానంగా వుంటే, ఆవేశపడనంటే కనకం కొన్ని విషయాల్ని నీతో చెప్పాలను కుంటున్నాను ........" రాజు తన చేతిలోని లలిత ఉత్తరాన్ని పరిశీలిస్తూ నచ్చచెప్ప చూశాడు

కన్నీళ్ళ పొరలో నుంచి మవునంగా రాజువైపు దృష్టి సారించి నిర్వికల్పంగా మీరేమి చెప్పినా నన్ను మభ్యపెట్టేందుకు చేసే కల్పనే అన్నట్టుగా చూశాడు.

"అంబరం ........ ఇందులో నిన్ను నమ్మించ డానికి నేనేదో చెప్తున్నాననుకోవద్దు. యదార్థాన్ని నీ కళ్ళముందు వుంచుతున్నాను. నీ స్నేహం పురస్కరించుకొని లలితను చూసేందుకుగాను మీ యింటికి వచ్చేవాడ్ని. లలిత మా బంధువుల్లోనిది కావడంతో ఆమె నాకు ముందుగానే తెలుసు. నన్ను లలిత ఇది వరలో నీ వివాహ పూర్వం బంధువుగా చూచినా అంత పరిచయం లేదు. లలిత సౌందర్యాన్ని, గుణ గణాల్ని ఆ పక్కింటివాళ్ళు చెప్పగావిని, నేను స్వయంగా చూసి ఆమెను తప్పకుండా నా దానిగా చేసుకోవాలనుకున్నాను. అలానే మా అమ్మతోను, నాన్నతోను చెప్పాను. కాని, ముందుగానే ఎప్పుడో ఏదో సంబంధం నిశ్చయించుకుని కట్నం కానుకలు మాట్లాడుకున్న మా వాళ్ళు అంగీకరించలేదు. దాంతో నేను యింటి నుంచి పరారయి పోయాను. మనశ్శాంతి కోసం వూళ్ళు తిరగాలనీ, తల్లి దం(డుల మీద ఏదో కసి తీర్చుకోవాలని నిశ్చయించుకున్నాను. కాని, లలిత తల్లిదం(డుల దగ్గరకు వెళ్ళి నేను మీ అమ్మాయిని చేసుకుంటానని అడగలేక పోయాను. దానికి కారణం ఇది వరలో నాకు పెళ్ళి నిశ్చయమై పోయినట్టు వాళ్ళకు కూడా తెలిసి ఉండడమే. ఒక రోజు ఏదో సినిమా చూస్తూ బయటికి వస్తుంటే లలిత కనిపించింది. కూడా ఎవరో ఉన్నారు. నేనంత పరిశీలనగా చూడలేదు బహుశా నువ్వే అయివుంటావు. దగ్గరకు పరుగెట్టు కెళ్దామని

# గతజల సేతుబంధనమ్

11 వ పేజీ తరువాయి

(పయత్నించాను. కాని జన సమూహం నాకు మళ్ళీ లలితను కనబడకుండా చేసింది. దాంతో ఇదే వూళ్ళో తిష్ఠ వేసుక్కూర్చున్నాను. నీకింకా గుర్తుందో లేదో నేను మీ ఇంటి గుమ్మంలో అడుగు పెట్టిన మొదటి రోజు మీ ఇంట్లో లలితను చూసి నిర్ఘాంత పోయాను. ఆ సమయంలో లలితను— నన్ను చూసి "మీరు పరస్పరం ఇది వరలో ఎరుగుదురా ?" అన్న నీ (ప్రశ్నకు నేను త్రుళ్ళి పడ్డాను. అప్పటికి గాని వాస్తవానికి రాలేక పోయాను. నాలో ఎన్నో కోర్కెల్ని, ఎన్నో సుఖ సౌఖ్య సంపదల్ని, బలవంతాన అణచి నేసి సుదూరమైన లలిత స్నేహాన్ని ఆ సమయంలో ఆలోచిస్తున్నాను. నీ అదృష్టాన్ని అభినందిస్తున్నాను. నేను పతితుడ్ని. అంబరం.... అదే దృష్టితో లలితను చూశాను. నన్ను చాలా మంది— మూతా



ఒక రైలుస్టేషనులో నాలుగు గోడ గడియారాలు వున్నాయి. నాలుగింట్లో ఏ రెండు గడియారాల్లో నైనా 'టైము' ఒక లాగా లేదు.

(ప్రయాణీకుడు : ఏ మండీ, స్టేషన్ మాస్టరుగారూ! తప్పు టైము చూపే నాలుగు గడియారా లెందుకు? ఇంతకీ ఏది రైటు?

స్టేషనుమాస్టరు : మా రైలు ఏ వేళకు వస్తే ఆ గడియారమే రైటు.

రమణారావు (మ(దాసు)

కోరు,' '(తాగుబోతు' అంటూ దీవిస్తుంటారు. అదీ నిజమే. దానికి కారణం లలితను నా భార్యగా పొందలేక పోవడమే అంటే నీకు ఎంతో ఆశ్చర్యంగా ఉండొచ్చు. నాలో నీచత్వానికి ఎప్పటికైనా లలితను బలిచేసి నా తృష్ణను తీర్చుకొని జన్మ సాఫల్యాన్ని కూర్చుకోవాలని ఎప్పుడూ ఉవ్విళ్ళూరే వాడ్ని. అందుకే నీతో బాగా స్నేహం చేశాను. కుత్సిత తత్త్వం, స్వార్థం నిండుకున్న మి(తత్త్వమది. రోజు రోజూ మీ ఇంటికి నా రాక పోకలు కాల నియమం లేకుండా ఎక్కువవుతుండడం నీకేం తెలియంది కాదు. బహుశా దుర్దినాలకు 'దశ' తోడుకాగా నా తొందర పాటు వల్ల హఠాత్తుగా— ఒకనాడు నా రాకకు కారణాల నూహించుకుని ఉంటావ్. గుండె (బద్దలై ఉంటుంది. కాని.... కాని....,"

"ఇంక నువ్వేమి చెప్పనక్కర్లేదు. నాకు తెలుసు. నమ్మించి నా జీవితంలో (ప్రవేశించి నన్ను అధః పాతాళానికి (తొక్కేసిన వారిలో మొదటిది 'అది' ఆ తర్వాత నువ్వు. నేను మీకెలాటి అపకారం చేశాను ? నన్నెందుకు చి(త్రవధ చేయడానికి పూనుకున్నారు ? నేను (బతకడమే మీకిష్టం లేకపోతే ఒక్కసారిగా నా గొంతు కత్తిరించ కూడదూ ? తడి గుడ్డతో గొంతులు కోసే మీకీ (క్రియ ఏ పాటిది ? ఎందుకు నన్నింకా ఏడిపిస్తారు ? నాకీ హింస సరిపోకనా మళ్ళీ మళ్ళీ పుండును రేపి బాధ పెడుతున్నారు ?"

చేతుల్లో ముఖాన్నుంచుకుని చిన్న పిల్లాడిలా ఏడ్చాడు అంబరం, అలానైనా కొంత పరితాపం నివారించ బడుతుందేమోనని.

రాజు అంబరాన్ననునయించడానికి (ప్రయత్నించాడు.

కనకం ఏమేమో చెప్పుకు పోతున్నాడు.

అంబరం అతను చెప్పేదేమిటో వినిపించుకునే స్థితిలో లేడు. తానొక రోజు కళ్ళారా చూచిన దారుణ సంఘటని, నీచ స్వభావాల (ప్రతి రూపాన్ని భావ పరంపరల్లో వెనక్కు పోయి చూస్తున్నాడు.

'తమ్ముడు పోయాడన్న టెలి(గాం అంది మనస్సు వికలమై పోగా, సాయం(త్రం ఆఫీసు నుంచి ఆదరా బాదరాగా ఇంటిని చేరుకుంటున్నాడు. అల్లంత దూరం నుంచే తన ఇంట్లోంచి బయటకు వచ్చే కనకాన్ని చూశాడు. తనులేకుండా కనకం తమ ఇంటికి ఎప్పుడూ వచ్చేవాడు కాదు. అయినా, తన కోసమే వచ్చి తాను లేక పోగా తిరిగి వెళ్ళిపోతున్నాడు కాబోలని సర్ది చెప్పుకున్నాడు. కనకం తన్ను చూడగానే కంగారు పడ్డాడు. కొంచెం కంపించాడు కూడా. నేరస్థునిలా భయపడ్డాడు. తను పలకరించాడు పరిశీలించి చూస్తూ, కనకం సమాధాన మిచ్చానని అనుకున్నాడేమో కాని, అతని కంపించే పెదవుల మీదుగా వచ్చిన పదోచ్చారణ అస్పష్టంగా విన్పించడం చేత తనకేమీ తెలియలేదు. మళ్ళీ పేరున పిలిచాడు. కనకం తిరిగి చూడనన్నా లేదు. విసవిసా నడచి వెళ్ళిపోయాడు. నడకలో కాళ్ళ తడబాటు అతని ఆందోళనను బాగా నిరూపిస్తోంది. ఈ వింత పరిణామానికి విస్తుపోతూ వడివడిగా నడచి ఇంట్లో చొరబడ్డాడు. లలిత టేబులు మీద తలుంచుకుని కుర్చీలో కూర్చుంది. జుట్టంతా రేగి ఉంది. పవిట తొలగి ఉంది. జాకెట్టు హుక్ విడింది. తన కంతకన్నా ఏం నిదర్శనం కావాలి ? ఇంట్లో అడుగు పెట్టగానే కాంచిన దృశ్యంతో అసలే— (ప్రియమైన తనంతటి తమ్ముడ్ని పోగొట్టుకుని చెల్లా చెదరైన మనసు మరీ ఘోరంగా పతనమై పోయింది. తల తిరిగి పోయింది. నిలువునా గడప లోనే కూలిపోయాడు. ఎంత సేపయ్యిందో ఏమో.... ? తాను కళ్ళు తెరచేటప్పటికి తన తల లలిత వడిలో ఉంది. ఒక (ప్రక్క రాజు, డాక్టరు ఉన్నారు. తాను లలిత వళ్ళో నుంచి తల (ప్రక్కకు తొలగించేందుకు (ప్రయత్నించలేదు. ఆ సమయంలో తనలో కల్గిన వింత మార్పుకు, ని(గహ శక్తికి, ఉపశమనానికి తనే ఆశ్చర్య పోయాడు. ఆ తర్వాత నాలుగైదు రోజులు ఏమీ జరగనట్టే తమ్ముడు పోయిన మిషతో తను స్వ(గామం వెళ్లి ... మానసికంగా ముడివేసి— లోలోపల హృదయంలో అగ్ని పర్వతాలు (బద్దలై పోతున్నా ఓర్చుకొని ఆమెను

పుట్టింటికి పంపాలని అతి వేర్పుగా చరించాడు. ఆఫీసుకు పోకుండా బీచ్‌లోనే కాలక్షేపం చేశాడు ఈ అయిదు రోజులు. ఆ రోజు సముద్రపు హోరులో తన రోదనం కలసి పోగా తన జీవితంలో తుఫాను రేగి నట్లయింది. ఆ తుఫానులో ఏ ప్రాణీ బలి కాకూడదు అనుకున్నాడు. తను లలితను ప్రాణాధికంగా ప్రేమించాడు. కులభ్రష్టుడై పెళ్ళి చేసుకున్నాడు. అందుకు ప్రతిఫలంగా లలిత తనను మోసగించిన విధానాన్ని తలచుకుంటే గుండె తరుక్కు పోతుంది. రంపాన వేసి కోస్తున్నట్టుగా అనిపిస్తోంది. సముద్రపు కెరటాలు తన్నాహ్వానిస్తూ చేతులు చాస్తున్నట్టుగా తోచింది. సర్వం త్యజించి జీవితంలో ఎవరినైతే నమ్ముకుని విశ్వాసంతో బ్రతుకుతున్నాడో వారే తన కెదురుగా నమ్మక ద్రోహం తలపెడితే ఇంకా ఎందుకు, ఎందుకు ఈ జీవితం ? తను ఎవరిని ఉద్ధరించగలడు ? అనే తలపుతో సముద్రంలోకి నడచి పోయాడు. వెనుక లలిత పిలుపు చూచాయగా వినిపించినా వెను దిరిగి చూడలేదు. కాని, తను చావలేదు. నీవు అప్పుడే ఈ పాప పంకాన్నుంచి విముక్తి పొంద లేదంటూ 'రక్షించింది' లలిత. జరిగిందాన్ని లలిత మరచి పోవాలని, ఆమెను గురించిన విషయం, 'ఒకనాటి సంఘటన' తన కేమీ తెలియనే తెలియదు అన్నట్టుగా భార్య వియోగ సహాయకంగా ఆమెకు ధైర్యాన్ని కలగ నిచ్చాడు. ఆ తర్వాత తన నిగ్రహ శక్తికి తానే ఆశ్చర్య పోయాడు. లలిత గర్భవతి కారణంగా భగవంతుడు తనలోని దుష్టశక్తుల్ని ప్రేరేపించలేదు అనుకున్నాడు. పది రోజులైన తర్వాత పురిటికని లలితను పుట్టింటికి పంపించేశాను. భారం తీరిపోయిందని, మనను తేలికైనదని భ్రమ పడ్డాను. అంతే, అదే తనకు— లలితకు చివరి చూపు. బిడ్డను కన్నదో, ఉన్నదో పూడిందో కూడా తనకు అక్కరలేదు. గుండె రాయిగా మారిం తర్వాత అది సామాన్యంగా కరుగుతుందా? కడుపు చించుకుంటే కాళ్ళ మీద పడుతుందని లోలోన కుమిలి పోతున్న ఎప్పటికో తనకు ఉపశమనం ?'

కనకం గట్టిగా ఏడ్చిన ధ్వనితో చలించాడు అంబరం. గతాన్ని విస్మరించి ప్రస్తుతానికి వచ్చాడు.

కనకం ఏడుస్తున్నాడు. రాజు అతన్ని ఓదారుస్తున్నాడు. అతనిప్పటి వరకు ఏం చెప్పాడో ఏమో తనకేమీ తెలియలేదు.

''అంబరం, లలిత మహా సాధ్వి. ఆమె యే పాపం ఎరుగదు. నా పశుత్వానికి బలికాకుండా ఆమె తప్పించుకుంది. ఒక్క చెంప పెట్టుతో నా నాడులు క్షీణించి పోయాయి. ఎన్నో నాళ్ళకు నే నాశించిన దానికి, నేను భ్రమసిన దానికి వ్యతిరేకంగా జరిగినందుకు, లలితను అంత నీచంగా వూహించుకున్నందుకు ఎంత లజ్జా క్రాంతుడనై పోయానో? నా క్రింది భూమి ఎందుకు కృంగి పోదు ? నేనెందుకు మట్టిలో కలిసిపోనా అనుకున్నాను. అవును నాలాటి పాపాత్ముడ్ని, నీచుడ్ని దాచుకుంటే భూమాత అపవిత్రం కాదా అని విమర్శించుకున్నాను. పిచ్చెత్తి నట్లయింది. నీవు పలకరించావు. ఏం చెప్పానో నాకే తెలియదు. పోయిపోయి రైలు పట్టాలని శరణం వేడాను. నా పాపానికి ప్రాయశ్చిత్తాన్ని కోరాను. ఆత్మహత్యా ప్రయత్నానికి గాను ప్రభుత్వం నన్ను జైలు కేసింది. నిన్ననే తిరిగొచ్చాను. అంతకన్నా నీకు నిదర్శనా లేవి కావాలి ? లలితలో నీ కింతకన్నా సుగుణాలేవి కనపించాలి ? ఇప్పుడు చెప్పు లలిత నీకెలాటి ద్రోహం చేసిందో, ఎలాటి అన్యాయం చేసిందో ? నన్ను క్షమించు అంబరం.... స్నేహాలకు విలువ తెలియక స్వార్థానికి మనుషుల్నుపయోగించుకో చూసిన నన్ను నువ్వేకాదు..., ఆ దేవుడు కూడా క్షమించడు.''

అంబరం కాళ్ళ మీది కొరిగి పోయాడు కనకం.

నిశ్చేష్టుడై, కర్తవ్య తామూఢుడై వెల్ల బారిన ముఖంతో విషాదంగా చైతన్య రహితంగా శూన్యంలోకి చూస్తుండి పోయాడు అంబరం.

బయట 'టెలిగ్రాం' అన్న పోస్టుమేన్ కేకకు రాజు కళ్ళు తుడుచుకొని పరుగెత్తుకెళ్ళి టెలిగ్రాం అందుకున్నాడు. వణకుతున్న చేతులో చించి—

"లలిత. . . . యి. . క. . లే. . దు'' . . . అంటూ గోడను చాటు చేసుకున్నాడు.

కుప్పలా కూలిపోయాడు అంబరం. ★

## రాజధాని కబుర్లు

9 వ పేజీ తరువాయి

గొప్పతనం తెలుసుకోవాలి. ఆయనకు తగిన సన్మాన చెయ్యాలి. అంతేగాని, కీర్తిశేషులు అయిన తర్వాత బహుమ తివ్వటం ఆయన గొప్పతనాన్ని శ్లాఘించటం, చాల విచారకరమైన విషయం. ఇకముందైనా 'సజీవులకు' కూడా ఇలాంటి బహుమతి లభించేటట్లు చూడాలని అన్నారు.

## నిజస్వరూపాలు

రాజ్యసభ ఎన్నికలఫలితాలు బైట పడ్డాయి. అనుకున్నట్లు కాంగ్రెసు సభ్యులు నలుగురూ గెలవనే గెలిచారు. కమ్యూనిస్టుపార్టీవా రయితే ఇద్దరి అభ్యర్థులను పోటీలో ఉంచారు. అతివాద, మితవాద వర్గాలుగా ఈ పార్టీ రెండు తునక లవుతోంది. ఒక్కొక్క వర్గం తమ అభ్యర్థిని గెలిపించుకొనేందుకు శాయశక్తులా పాటుపడ్డారు. మితవాద వర్గంవారి అభ్యర్థి చిట్టచివరకు గెలవట మయింది. ఇక రెండు వర్గాలవారు బహిరంగంగా విమర్శలు చేసుకోవటం వరకు వచ్చింది. బలాబలాలు చూసుకుంటున్నారు. అవసరమయితే ఇంకో పార్టీని స్థాపించటానికి కూడా అతివాద వర్గంవారు ఉద్యుక్తు లవుతున్నట్లు తెలుస్తోంది. కాంగ్రెసువారు తమ గ్రూపులను గురించి మామూలుగా చేస్తూ వస్తున్న ఆరోపణలే ఈ కమ్యూనిస్టుపార్టీలో కూడా ప్రవేశించినాయి. ఒక వర్గం వారు ఇంకో వర్గం వారిని అణగదొక్కటానికి ప్రయత్నం చేస్తున్నట్లు శ్రీ సుందరయ్యగారి ఆరోపణ. అది సత్యం కాదని నీలం రాజశేఖర రెడ్డిగారి ఖండన. బ్రిటిష్ ప్రభుత్వానికి, నలభై ఏళ్లనాడు, డాంగేగారు వ్రాశారన్న లేఖను గురించి మాట్లాడుతూ సుందరయ్యగారు, డాంగేగార్ని బ్రిటిష్‌వారి బంటుగా చిత్రించారు. ఇన్నాళ్ళ బట్టి ఆ లేఖ విషయం బైటపెట్టక పోవటానికి కారణం ఏమిటో ! లేకపోతే ఆయనకు తెలిసింది ఇవ్వాళేమో మరి ! పెకింగ్ కమ్యూనిజానికి సన్నిహితంగా ఉన్న శ్రీ పుచ్చలపల్లి సుందరయ్యగారి వర్గం అతి త్వరలోనే ఇంకో పార్టీని స్థాపించటం ఖాయమని అనుకుంటున్నారు. ఇంత తీవ్రమైన భేదాభిప్రాయాలు రావటం యిదే ప్రథమ మనుకుంటా. ఇకనుంచి, కాంగ్రెసులో గ్రూపు తత్వం ఉందని, విమర్శించే హక్కు ఈ కమ్యూనిస్టుపార్టీ కోల్పోయిందన్నమాట.

స్వతంత్రపార్టీవారి కయితే సొంతంగా అభ్యర్థిని నిలబెట్టి రాజ్యసభకు ఎన్నికచేసే బలం లేదు కాబట్టి, తమ సిద్ధాంతాలకు అనుగుణంగా ఇంకెవరైనా అభ్యర్థి ఉంటే సహాయపడటం సహజం. ఉన్న అభ్యర్థులలో బి. మహదేవసింగ్‌గార్ని బలపరిస్తే బాగుంటుందని వారు తీర్మానించుకున్నారు. కాని కొంతమంది ఈ అభ్యర్థి పట్ల తమ అసమ్మతిని బాహాటంగానే ప్రకటిస్తూ వచ్చారు. వారి ముఖ్య విమర్శ, సోషలిస్టు అభ్యర్థిని, ఏ పరిస్థితుల్లోనూ కూడా బలపరచకూడదని, ఇలాంటి పరిస్థితుల్లో వ్యక్తిగత స్వాతంత్ర్యానికి అవకాశం ఇవ్వాలని. కాని పార్టీవారు ఈ వాదాన్ని అంగీకరించలేకపోవటం వలన, మహదేవసింగ్‌గార్నే బలపర్చాలిందని ఆదేశించటం ఈ ఆదేశాన్ని అంగీకరించలేక కొంతమంది వ్యక్తులు స్వేచ్ఛాస్వాతంత్ర్యాల్ని ప్రకటించటం జరిగింది. దీంతో లేనిపోని తర్కవితర్కనలకు అవకాశం కలిగింది.

ఇక కాంగ్రెసుపార్టీ. రానురాను ఇదొక పెద్ద విరాట్ స్వరూపంగా తయారవుతోంది. ప్రస్తుతం ఇది 'బ్రహ్మ స్వరూపం'. బ్రహ్మానందరెడ్డిగారు ముఖ్యమంత్రి. బ్రహ్మయ్యగారు దీనికి అధ్యక్షులు. అధ్యక్షులవారు కూడా ఈ రెడ్డిగారివలెనే ఆ పీఠాన్ని అలంకరించగలిగారు. దీనిమీద ఆక్షేపణలు చెలరేగాయి. రెండు గ్రూపు లున్నాయని అంతా అనుకుంటున్నా, యేగ్రూపులో ఏ వ్యక్తు లున్నారో ఎవరికీ తెలియటం లేదుట. రాజకీయాల్లో శాశ్వత మిత్రత్వం, శాశ్వత శత్రుత్వం అంటూ ఏమీ లేదని, శ్రీ వి. బి. రాజుగారు ఒక సిద్ధాంతాన్ని లేవదీశారుట. దీంతో మరింత గందరగోళం, బుజాలు తడుముకోవటం ప్రారంభ మయిందని అనుకుంటున్నారు.

ఐ. ఎల్. ఎన్. ★

# షేక్స్పియర్ లండన్

## జె. పాట్రిక్ స్మిత్

విలియం షేక్స్పియర్ చనిపోయిన ఏభయి ఏళ్ల తర్వాత లండన్‌లో కట్టడాలు చాలామట్టుకు ఒక పెద్ద చిచ్చులో తగలబడి పోయాయి. ఈ చిచ్చు ఇంగ్లీష్ చరిత్రలోకెల్లా ప్రసిద్ధ మయినది. ఒక కొత్త రాజధాని నిర్మాణానికి దారి తీసింది. కాని, షేక్స్పియరుకీ, అతని సమకాలీకు లకీ తెలిసిన నగరం ఇంకా 'మెడివల్' (మధ్య) యుగపు గోడల మధ్య ఇరుక్కుని ఉన్నదే. ఎలిజ బెతెన్‌లూ, జాకొబియన్‌లూ ఒకరి నొకరు రాసు కుంటూ నడిచి వెళ్లిన ఇరుకు సందుల మీదకి పెక్క ఇళ్ల పై అంతస్తులు పొడుచుకు వచ్చేవి; మురికి కాలువలు తమ రోగాలతో నిండిన వాసనలు వెద చల్లేవి.

పూరిచుట్టూ ఉన్న పాత గోడలలో తొమ్మిది ద్వారాలు దొల్చారు. నది, ఒకేఒక వంతెన తప్పిస్తే నగరంలోకి ప్రవేశించాలంటే వీటి ద్వారానే ప్రవే శించాలి.

ఎలిజబెత్ I — కన్యగానే ఉండిపోయిన వర్జిన్ క్వీన్ — కాలంలో ఈ లండన్ మహానగరమే కాని చాలా అనారోగ్యకరమయిన చోటు. సంవత్సరాలు గడ చినకొద్దీ ఇంకా అనారోగ్యకరంగా తయారవుతూ వచ్చింది. షేక్స్పియర్ పుట్టిన సంవత్సరం (1564) లో జనాభా సుమారు 100,000 ఉండి ఉంటుంది కాని అతను తన మరణానికి కొన్ని ఏళ్ల ముందు స్ట్రాట్‌ఫర్డ్—అపాన్—అవన్‌కి తిరిగి వెళ్లేసరికి 250,000 కి పెరిగిపోయింది. అధికారులు ఊరి ఎల్లలు పెరగటానికి ఇష్టపడక పోయినా, ఈ జనాభా పెరగుదలని ఆపలేకపోయారు. లండన్ వాసులలో పేదవారికి అప్పటికే ఉన్న ఇళ్లలో ఇరకటమో లేక అవసరంగా నిర్మించిన వాటాలలో నివసించటమో తప్ప గత్యంతరం లేకపోయింది.

### ప్లేగ్

బిదవారిలాగే ప్లేగ్ ఎప్పుడూ కనిపిస్తూనే ఉండేది. జీవితంలో ఒక అంశం ఇది—మరణంలో కూడా. కొన్ని సమయాలలో అతి దారుణంగా విజృం భించేది. 1593—1603 మధ్య భయంకర వర్షాలలో షేక్స్పియర్ ఎందరో స్నేహితులనీ పరిచితులనీ కోల్పోయి ఉండాలి. నీటి సరఫరా చాలా అసంతృప్తికరంగా ఉండేది. 1614 లో హ్యూమిడ్‌ల్‌టన్ ప్రతిపాదించిన 'న్యూ రివర్ సిస్టమ్' అమలులోకి వచ్చేదాకా మంచినీరు సరిగ్గా దొరికేది కాదు.

ఈ 'నీచ' మయిన వీధులమీద 'పాత సెయింట్ పాల్స్' 'టవర్' ఉన్నతంగా పైకి ఎగసిపోయి కనిపించేది. ఇంగ్లండ్ రాజధాని యొక్క పాడుపడి పోతున్న 'కెథీడ్రల్' చర్చి ఇది. అప్పటివాళ్లు ఈ ఆలయాన్ని మైలపరిచేవారు కారేమో కాని అక్కడ ఏవేవో వ్యాపారాలు జరిగేవి: ఎల్లర వస్తువుల అమ్మకం కాడనుంచి దుస్తులు కుట్టడం దాకా, చట్ట సంబంధం కల పత్రాలు వ్రాయించు కొనటం కాడ నుంచి గేయం అమ్మటం దాకా.

1588 లో స్పెయిన్ నౌకాదళం, 'ఆర్మదా'ని ఇంగ్లండ్ చెల్లాచెదురు చేసింది. అప్పటినుంచీ ఈ దేశం చక్కటి శాంతి యుగాన్ని అనుభవిస్తూ వచ్చింది. ("స్లైపింగ్ టైం ఆఫ్ పీస్" అనే పద జాలం ఉపయోగించారు శ్రీ స్మిత్—అ.) ఈ యుగం యొక్క అశుభ్ర పరిస్థితిని మురగపెట్టిన, జ్వర గుణం కల, ఉజ్వల ప్రతిభ "ది గ్రేట్ ఎలిజబెత్ ఏజ్" అనే కథనం తర్వాత శబ్దాలలో రావటానికి కారణం. వాణిజ్యం వికసించి, ఐశ్వర్యంవల్ల సామా న్యులకీ అభిజాత్య వర్గాలకీ మధ్య ఒక రకమయిన మధ్య తరగతి ఏర్పడటం మొదలయింది. అప్పటి రవాణాశాఖ మంత్రికి రోడ్లని నింపివేస్తున్న కోచ్ బళ్ల రద్దీని అరికట్టటం పెద్ద పనిగా ఉండేదిట. ఇళ్లు బాగుపడి, కొత్త ఫాషన్‌లు పుట్టుకువచ్చి, అన్ని వర్గాలవారూ వినోదం కోసం తమ చుట్టూ కలయచూడటం ప్రారంభించారు.

### ది మిరకిల్ ఆఫ్ ది వరల్డ్

లండన్ బ్రిడ్జ 19 'ఆర్చ్' ల లోనూ ఎన్నో అంగళ్లు, ఇళ్లు ఉండేవి—ఈ వంతెననే 17 వ శతాబ్దంలో 'వర్తిలీ టుబి నంబర్డ్ ఎమంగ్ ది మిరక్‌ల్స్ ఆఫ్ ది వరల్డ్' అని వర్ణించారు. ఇంతే కాదు, తరచు దేశద్రోహుల తలల్ని కొతర వేసేవారు దీనిమీదనే. అప్పటిలో నది మీదుగా ఉన్న వంతెన అదొక్కటే. లండన్ నుంచి సౌతార్క్‌కి దారితీసేది ఈ బ్రిడ్జి.

1574 లో లండన్ ఆల్డర్‌మెన్ (స్థానిక పుర పరిపాలనాధికారుల వంటివారు) నాటకాలని 'సెన్సార్' చెయ్యపోయారు. అందుచేత నాటకాలవాళ్లు పూరి బయటికి షోర్‌డిచ్, బ్లాక్ ఫ్రయర్స్ (మొదటి పైకప్పు ఉన్న థియేటర్ ఇక్కడే నిర్మించారు) లోకి, ఏరు అవతల సౌతార్క్‌లోకి—సెన్సార్‌కి అధికారం లేనిచోట—వెళ్లిపోయారు.

బాంక్‌సైడ్ (సౌతార్క్) లోనే 'గ్లోబ్', 'స్వాన్', 'రోజ్' మొదలయిన 'ప్లే హవుస్' లు కట్టారు.

ఈ థియేటర్లు కోళ్ల పందాలు, ఎలుగుబంటి ప్రదర్శనలు జరిగే ప్రదేశాలలో పైకి లేచాయి. తక్కిన వినోదాలు జరిగే చోట్లలోనే అన్నమాట. ఆ రోజుల్లో 'లండనర్లు' 'హేమ్లెట్' వంటి 'ట్రాజిడీ' చూసి ఏ సంకోచమూ లేకుండా ముందే మరణశిక్షకి లోనయిన ఒక జంతువు హింస చూడ టానికి వెళ్లేవారు. ఇది అశుభ్రం, రోగమయం, క్రూరం అయిన యుగం; కాని ఇదే సౌందర్యం, పాండిత్యం కవిత్వంతో కూడిన భావన కల యుగం.

('హోవెల్ డ్రఫిన్ రివ్యూ', లండన్‌నుంచి) ★

# ఇరుగు పొరుగు భాషల చిత్రాలు

ఈ సంవత్సరం రాష్ట్రపతి పంచిపెట్టిన బహుమతుల వివరాలు సినిమా అభిమానులు వార్తాపత్రికలలో చదివే ఉంటారు. ఇక్కడ వాటిని తిరిగి పేర్కొనటం అనవసరం. కాని — వాటి మీద ఎవరి అభిప్రాయాలు వారి కుంటాయి. లలిత కళలకి సంబంధించినంత దాకా ( నేటి మన సినిమాలలో కళాంశాలు ఎంతో కొంత ఉన్నాయని ముందే ఒప్పు కుందాము) హెచ్చుతక్కువలు నిరూపించటం కష్టం (అని నా అభిప్రాయం.)



మలయాళనాయిక శాంతి.

అయితే " పోలిక " అంటూ ఉంది కాబట్టి దాని సహాయంతో కొన్ని అభిప్రాయాలు ధైర్యంగా బయటికి చెప్పెయ్యవచ్చు!

## క్లుప్తంగా చిత్రాల స్థాయి !

ఈ వ్యాసంలో కొన్ని తెలుగు సినిమాలని మరి కొన్నిటితో పోల్చటం నా ఉద్దేశ్యం కాదు. బహుమతులు పొందిన తక్కిన దక్షిణభాషల చిత్రాలు కొన్ని నేను చూడడం సంభవించింది కాబట్టి అరవ, కన్నడ, మలయాళ, చిత్రాల స్థాయి



మలయాళనాయిక అంబిక.

ఎలా ఉంటుందో నాకు చేతనయినంత మటుకు క్లుప్తంగా, వివరించడమే నా ఉద్దేశ్యం.

ఇరవై ఏళ్ళ క్రితం అరవ సినిమాలకన్నా తెలుగువి బావుండేవని అరవవాళ్లే అనటం నాకు గుర్తుంది. అప్పటి చిత్రాలు — రెండు భాషలవీ — చూస్తే ఈ మాట నిజమే, అనిపించేది. క్రమంగా, తమిళ చిత్రాలు బాగుపడి తెలుగు సినిమాలు చెడిపోయాయి అనే అభిప్రాయం 1960 ప్రాంతాలలో కొందరు వెలిబుచ్చారు. ఇదీ నిజమే అని నాకు



మలయాళనాయకుడు సత్యన్.

అనిపించింది. ప్రస్తుతం మనం 1964లో ఉన్నాము కాబట్టి పరిస్థితి మరికొంత మారి ఉంటుందని వూహించవచ్చు. మళ్ళీ పోల్చి చూస్తే అరవ చిత్రాలు మన వాటికన్నా దిగజారి పోయాయేమో అనే అనుమానం ( గట్టిగానే ) కలుగ్తుంది. నటుల విషయంలో ఇది మరీ నిజం అని దృఢంగానే చెప్పవచ్చు కూడా. ( సంగీతం మాత్రం అరవ సినిమాలలోనే బాగుంటోందని నా నమ్మకం— శ్రీ వి. ఎ. కె. రంగారావు గారి దృఢాభిప్రాయం



మలయాళ నాయకుడు ప్రేమ్‌నజీర్.



కన్నడ నటుడు అశ్వత్థ

ఏమిటో) ........ ఈ రెండు భాషల చిత్రాలని ఇంతకన్నా ఎక్కువ పోల్చటం అనవసరం.

ఇక కన్నడ మళయాళ చిత్రాల సంగతేమిటి ? వీటి ' చరిత్ర 'లు నాకు తెలియవు కాని ఇటీవల చూసిన కొన్ని కన్నడం, మలయాళం సినిమాలను మనసులో ఉంచుకుని నాకు తోచింది వ్రాస్తాను !

## పాతా, కొత్తా ?

కన్నడంలో ' సాంఘికాల ' కన్నా ' పౌరాణికా 'లే ఎక్కువగా విడుదల అవుతున్నాయని విన్నాను. పౌరాణిక చిత్రాలను గురించి నేను వ్రాయదలుచుకోలేదు కాని కన్నడ సాంఘిక చిత్రాలను కొన్నిటిని చూస్తే కొన్ని ఏళ్ల ( దశాబ్దాల ? ) క్రితం చూసిన తెలుగు సినిమాలు జ్ఞాపకం వచ్చాయి నాకు. ఇదేమంత విచారించతగ్గ విషయం అనుకోను. అసలు, సెట్టింగ్‌లకి సంబంధించినంత వరకూ మునుపటి తెలుగు చిత్రాలే నయమేమో అనిపిస్తుంది. (నేడు మన సినిమాలలో చూసే లాంటివి చాలా ధనవంతుల ఇళ్ళలోనే కనబడవు — ఆశ్చర్య పడనక్కరలేదు. బాగా డబ్బున్న వాళ్ళకే అప్పుడప్పుడు ' అభిరుచి ' అనేది ఉంటుంది. (వేషాల విషయంలోనూ ఇది కొంతదాకా నిజం అని నా అభిప్రాయం.)

కథా వస్తువు ఎన్నుకోవటంలో పాతకాలపు భావాల ప్రభావాలు ఉన్నట్లు అనిపించవచ్చుకాని ' ముందంజ ' వేసినాయనుకున్న తెలుగు, అరవ సినిమాలలోని — (1) భార్యలు భర్తల కాళ్ళమీద పడటం — సెన్సారువాళ్ళు ఎలా ఒప్పుకుంటారో అర్థం కాదు. (2) పెళ్ళిళ్ళు చుట్టాల మధ్యనే అవటం. (3) నాయకులందరూ, ఇంచుమించు, జమీందార్ల తాలూకువారవటం. (4) సేవకులని అతి వినయం (!) ప్రవర్తన కలవారినిగా చూపటం., ఇవన్నీ చూస్తే ఆధునిక దృక్పథం ఎవరికి ఎంత మాత్రం అలవడిందా అనే సంశయం కలుగక మానదు.

**శ్రీ అశ్వత్థ**

ఇక నటీనటుల సంగతి చూద్దాము. 'హీరోయిన్లు ' కొందరు తెలుగు తమిళ చిత్రాలలో వేసే వారే. తక్కిన ఇద్దరిలో ప్రత్యేకమైన ప్రతిభ ఏదీ

## ఇరుగుపొరుగు భాషలచిత్రాలు

కనిపించదు. నేను చూసిన కన్నడం సినిమాలలో మూడువంతులపైన వాటిలో ఒకే నటుడు హీరోగా వేశాడు. ప్రత్యేకత ఏమీలేక పోయినప్పటికీ గొంతుక చించుకుని అరవటం, ముఖం చిట్లించుకొని ఏడవటం, కళ్ళు తిప్పటం లేకపోవటం కొంచెం తెరపి కల్గించినట్లే ఉంటుంది. తెలుగు తెర మీద శ్రీ ఎస్. వి. రంగారావు వలెనె అశ్వత్థ అనే నటుడు వివిధ పాత్రలని ధరిస్తూ ఉంటాడు. శ్రీ రంగారావు వలెనే ఈయనా నిజమైన ప్రతిభ కలవాడని నేననుకుంటాను.



కన్నడనాయకుడు రాజ్ కుమార్.



కన్నడ తార లీలావతి.

క్రమంగా కన్నడ చిత్రాలూ తెలుగు, అరవంవి లాగే సాంకేతికంగా బాగుపడి ఇతరత్రా చెడిపోతా యేమో, చెప్పలేను.

కేరళలో ఉన్నంతమంది చదువుకున్నవారు భారత దేశంలో ఏ రాష్ట్రంలోనూ లేరన్న విషయం అందరికీ తెలిసిందే. అందుచేత, మలయాళ చిత్రాలు తక్కిన దక్షిణ భారత భాషా చిత్రాల కన్నా కొంచెం అభివృద్ధిచెంది ఉండటం ఆశ్చర్యం కలిగించ నక్కరలేదు. అయితే, నీటి 'స్థాయి' అంత చదువుకి తగినట్లు ఉన్నదా అని అడిగితే సమాధానం చెప్పటం కష్టం. ఛాయాగ్రహణం, సంగీతం, వేషం ఈ మూడిటి విషయంలోనూ ఇవి తప్పక మిగతా భాషల సినిమాలకన్నా బాగా ఉంటాయని చెప్పవచ్చు. కథావస్తువు ఎన్నికలో ఎటూ చెప్పటం కష్టం. కాని ఈ ఏడు రాష్ట్రపతి బహుమతి పొందిన 'నినమ నింజ కాల్పాడుకల్' చిత్రం తీసుకోండి. దేశభక్తి ప్రచారం కొంచెం ఎక్కువ మోతాదులోనే ఉన్నప్పటికీ చిత్రంలోని సన్నివేశాలు కొన్ని చాలా సున్నితంగా, నేర్పుగా తీశారనిపిస్తుంది, చూసినవాళ్ళకి. ఛాయాగ్రహణం నిజంగా బాగా ఉందని నేను అనుకుంటున్నాను.

### లావు, తక్కువ

నటీనటుల విషయం తీసుకుంటే, లావు తక్కువ ఉండటం చేతనో, సామాన్యంగా కనిపించే దుస్తులు వేసుకొనటం వల్లనో, లేక నిగ్రహంతో అభినయాలు చెయ్యటం చేతనో కాని ఇతర భాషల చిత్రాలలో అగుపించే నాయికా నాయకుల కన్నా ఆకర్షణీయంగా కనిపిస్తారు. ఇంత కన్నా ప్రత్యేకంగా వీరిని గురించి వ్రాయ నక్కరలేదు.

ఒకటి మాత్రం స్పష్టంగా చెప్పాలి. అన్ని మళయాళం సినిమాలూ 'నినమునింజ కాల్పాడుకల్' (రక్తసిక్తమయిన కాలి గుర్తులు) స్థాయిలోనే ఉండవు. కొన్నిటిలో భరించలేని 'డ్యూయెట్లూ' 'డాన్సులూ' ఉంటాయి. కాని పాత్రలు అతి సామాన్య వర్గాలకు చెందిన వారినిగా చూపటం, విపరీతమైన కేకలు, వికృతమైన అభినయాలూ చూపించక పోవటం, సెట్టింగులు కూడా కొంచెం కాకపోతే కొంచెం వాస్తవిక జీవితానికి సంబంధించిన వాటిలాగ ఉండటం, అతి మంచి, అతి చెడ్డ విరివిగా చూపక పోవటం, ఇవన్నీ; తెలుగు సినిమా లకి విముక్తి ఎప్పుడా అనిపించేట్లు చేస్తాయి.

వి. రామారావు.

## అవీ - ఇవీ - అన్నీ

### ఎన్. టి. రామారావు ఢిల్లీ ఉత్సవాలకు . . .

నర్తనశాల అర్జునుడిగా 'లవకుశ రాముడిగా' '63 సంవత్సరాన్ని నిస్సందేహంగా దోచుకున్న శ్రీ ఎన్. టి. రామారావు, సర్టిఫికేట్ చూరగొన్న తమిళ 'కర్ణ' లో కృష్ణునిగా కూడా రాణించాడు. సచిత్ర వారపత్రికలో ఉత్తమ నటునిగా పాఠకుల ఆదరాభిమానాలను చూరగొన్న ఈ ప్రముఖ నటుడు పోయినేడాది సాంఘికాల మీద ధ్వజమెత్తి నిల్చిన పౌరాణికాలకు ప్రతినిధి అయ్యాడు. శ్రీ రామారావు నభినందిస్తూన్నప్పుడే పాఠకులకు కృతజ్ఞతాభినందనలు తీసుకువచ్చి అందిచ్చే బాధ్యతను కూడా పుచ్చుకున్నాను కనుక, 'సచిత్ర వారపత్రిక' పాఠకులు స్వీకరించవల్సింది.

ఈ నెల మూడో వారంలో ఢిల్లీలో జరుగనున్న అవార్డు ఉత్సవాలలో శ్రీ ఎన్. టి. ఆర్. పాల్గొనబోతున్నారు.

హైదరాబాద్‌లో ఎన్. టి. ఆర్. ఎస్టేట్‌లో 'రామకృష్ణ' పేరిట ఆధునికమైన 70 మి. మీ. పెద్ద తెర సినిమా థియేటర్ కట్టడానికి పూనుకుంటున్న శ్రీ రామారావును, పన్నెండు లక్షల దాకా కాగల దీనికి పూనుకున్నారే ? అక్కడ స్టూడియో కడితే పరిశ్రమకు పెట్టుబడి కాగలదేమో నన్నాను నేను.

పరిశ్రమకు కేవలం "కట్టడమే" "పెట్టడమే" పెట్టుబడి కాదని—వాస్తవానికి ఇంత వ్యయమైన, మరింత ప్రయాస అయినా ఈ 'పెద్ద తెర థియేటర్' రాజధానికి శోభ కాగలదని — శ్రీ రామారావు ఉద్దేశం. కేవలం పరిశ్రమ పెట్టుబడితోనే కాదు, పలుకుబడి, పరికరాలు, పదిమందీ కలిసి—'కలిసి పనిచేసే' అవకాశాలు ఉంటే తప్ప— నిలదొక్కుకొని పుంజుకోదని శ్రీ రామారావు అభిప్రాయమైనట్లు మా సంభాషణలవల్ల నాకు అనిపించింది. అహర్నిశలు కేవలం ప్రధాన నటునిగానే గాక ఈ పరిశ్రమలో ఇతరత్రా అనేక 'భూమిక' లను నిర్వహిస్తున్న శ్రీ రామారావు అనుభవం— ప్రస్తుతం తెలుగు చిత్ర పరిశ్రమకు సంబంధించిన—పలుమందిని కలవర పెడుతున్న — అనేక ప్రశ్నలకు అవసరమైన సమాధానాలను ఇవ్వగలదని మన మనుకోడంలో ఆశ్చర్య మేమీ లేదు. శ్రీ రామారావుకి క్షణం తీరిక లేనంత పని ఉన్నా— "నటించడం—ప్రేక్షకుల ప్రశంసల మేరకు మరింతగా బాగా నటించడం" ప్రధానాశయంగా —రాణిస్తున్న ఈ నటుని ఎట్ల—'పరిశ్రమ—నటుడు' 'నటుడు— పరిశ్రమ' "దేని వెనుక ఏది?" "దేనివల్ల ఏది ?" అనే ప్రశ్నలకు నిపులమైన, సకారణమైన సమాధానం ఇవ్వవల్సిన బాధ్యతయే గాక, పదహారేళ్ల అనుభవం తర్వాత ఆ సమాధానం ఇవ్వగల శక్తి సామర్థ్యాలు కూడా పూర్తిగా ఉంటాయని విజ్ఞులు భావించకపోరు కదా ? అంచేత ఈ ప్రశ్న చిన్నది కాదని దీని సమాధానం కూడా అంతకంటే చిన్నది కాదని శ్రీ రామారావు భావించడంవల్ల, మా పాఠకులకు త్వరలోనే చాలా 'సంగతులు' ఆయన ద్వారా అందించగలమని అనుకుంటున్నాము. అవార్డు ఉత్సవం నించి తిరిగి నస్తూనే శ్రీ రామారావు ఆంధ్రసచిత్ర వారపత్రిక పాఠకులకు చలనచిత్ర పరిశ్రమ "ఇవాళేలా ఉంది? ఎక్కడుంది ?ఎంచేత?" అన్న సందేహాలకు తనసమాధానాలు ఇస్తారని 63 సం. లోని ఈ నటుని విజయాలను అభినందించ వెళ్లిన నేను — పాఠకులకు ప్రత్యభినందలు ప్లస్ మరిన్ని త్వరలో తెలియగల సంగతులు తేగలిగామని అనుకుంటున్నాను.

వీరాజీ.

## తుషార బిందువులు

శ్రీ కె. ఆర్. కె. మోహన్ సంకలనం తుషార బిందువులు అనే వివిధ రచయితల కథల సంపుటి వెల 2 రూ. లు గలది మా కార్యాలయం చేరింది.

## అక్కినేని నాగేశ్వరరావుకి బొంబాయి ఆంధ్రుల సన్మానం

బొంబాయి ఆంధ్రమహాసభ, ఆంధ్రా ఎడ్యుకేషన్ సొసైటీవారు మహాసభ ఆవరణలో ప్రముఖ తెలుగు నటుడు, శ్రీ అక్కినేని నాగేశ్వరరావు, అమెరికా ప్రభుత్వ ఆహ్వానం మీద అమెరికా సందర్శించు సందర్భమున వారి గౌరవార్థం సన్మాన సభను ఏర్పాటు చేశారు.

ఆనాటి కార్యక్రమమునకు బొంబాయి పుర పాలకసంఘ మేయరు శ్రీ ఇ. ఎ. బండూక్‌వాలా అధ్యక్షత వహించారు.

శ్రీ నాగేశ్వరరావుకు, మహాసభ కార్యదర్శి శ్రీ ప్రసాద్ స్వాగతము చెప్పారు.

అమెరికా వెళ్ళి ఏమిచేయుదురనే ప్రశ్నకు శ్రీ నాగేశ్వరరావు సమాధానమిస్తూ వారి సినిమా, "టెలివిజన్, నాటకరంగం మొదలగునవి చూచుట, ప్రముఖ కళాకారులను కలుసుకొనుట, వారి పరిస్థితులను తెలుసుకొనుట మొదలగునవి చేయవలెనని యున్నది. ఇదియే నా ముఖ్య ఉద్దేశ్యము. అంతకంటే ప్రస్తుత మేమియు చెప్పలేనని" చెప్పిరి.

ప్రముఖ చలనచిత్ర కళాకారులు శ్రీ పృథ్వీరాజ్ కపూర్ మాట్లాడుతూ శ్రీ నాగేశ్వరరావుని 14 ఏండ్ల క్రితం కాకినాడలో ఒక నాటక సమావేశంలో కలుసుకొనుట సంభవించినదని చెప్పిరి. శ్రీ రావు ఒక్క తెలుగు చలనచిత్ర కళాకారునిగానేకాక యావద్భారత చలనచిత్ర కళాకారునిగా అమెరికా ప్రభుత్వం గుర్తించి ఆహ్వానించుట ముదావహమని చెప్పిరి.

అమెరికా ప్రభుత్వ సాంఘిక సాంస్కృతిక సమాచార డైరెక్టర్ శ్రీ లోవెల్ కూడా మాట్లాడారు.

బొంబాయిలోని పెక్కు సాంఘిక సాంస్కృతిక సంఘములు తమ సంతోషమును వెలిబుచ్చుతూ శ్రీ నాగేశ్వరరావుకు పుష్పమాలలు వేసిరి.

సభానంతరము సాంస్కృతిక కార్యక్రమము ఏర్పాటు చేయబడినది. ★



లలితకళానికేతన్ నాటకపోటీలో ఉత్తమ నటుడుగా ఎన్నికయిన శ్రీ ఆర్. పి. చలం బహుమతి ప్రదాత శ్రీ గుత్తా రామినీడు (ఫిలిం డైరెక్టరు) ఉత్తమ నటిగా ఎన్నికయిన కుమారి సీత.

చిత్ర సమీక్ష:

## ఈస్ట్‌మన్ కలర్ చిత్రం అమరశిల్పి జక్కన్న

[మాటలు: సముద్రాల రాఘవాచార్య; పాటలు : సముద్రాల, దాశరథి, నారాయణరెడ్డి; సంగీతం : ఎస్. రాజేశ్వరరావు, నృత్యాలు : హీరాలాల్, చోప్రా, దండాయుధపాణి, సరస; స్టూడియో : విక్రమ్, సంయుక్త దర్శకులు : ధర్మరాజు, దయాసాగర్; నిర్మాత, దర్శకుడు : ఛాయాగ్రహణ పర్యవేక్షణ : బి. ఎస్. రంగా; నటీనటులు : సరోజాదేవి, నాగేశ్వరరావు, రేలంగి, గిరిజ, సూర్యకాంతం, తదితరులు.]



"అమరశిల్పి జక్కన్న చిత్రం"లో నాగేశ్వరరావు.

"సంకల్పమొక మహత్తర శక్తి. అది ఒక్కొక్కమారు నవీన ప్రయోగాలకు, నవ్యసృష్టికి నాందిగా నిలుస్తుంది.

తెలుగులో తొలుతగా ఈస్టుమన్ కలర్ చిత్రాన్ని నిర్మించాలన్న శ్రీ బి. ఎస్. రంగాగారి సంకల్పానికి ఆచరణ తోడునీడగా నిలిచింది. ఫలితమే "అమం, శిల్పి జక్కన" చిత్ర నిర్మాణం.

కథావస్తువు రమ్యమైనది. భారతీయ చరిత్రనే తీర్చి దిద్దుతూ, శిల్ప శాస్త్రానికి ఒరవడి పెట్టి, ఆధునిక కళా విన్యాసానికి ఆదర్శంగా నిలిచిన మహాశిల్పి జక్కన్నయొక్క జీవిత చిత్రణయే ఈ చిత్రం.

మల్లన్న వృద్ధ శిల్పి. శిల్ప చాతుర్యంలో ఆరితేరినవాడు. కాని, అంధుడు కావటంవల్ల ఉన్న ఒక్క కొడుకు జక్కన్నను చెంతనే ఉంచుకొని, అతనికి కూడా శిల్పశాస్త్రంలోని మెళకువలను చెపుతూ కాలక్షేపం చేస్తూ ఉంటాడు.

జక్కన్న లేబ్రాయంలోనే శిల్పశాస్త్రాన్ని కూలంకషంగా తెలిసికొంటాడు. తండ్రి సలహాతో ఉత్తమ శిల్పాల నిర్మాణానికి పూనుకొని, కృతకృత్యు డవుతాడు.

ఒకనాడు తను శిల్పాలను చెక్కుకొంటూ ఉండగా, ఆ మార్గాన ఎండలో వెళుతున్న 'మంజరి' అనే సుందరిని చూస్తాడు. అవ్యాజమైన అనురాగంతో, ఇంటికి వచ్చి జక్కన్న మంజరి శిల్పాన్ని చెక్కుతాడు. ఆ శిల్పాన్ని చూచిన మంజరి మోహపరవశురాలై పోతుంది. ఆమె మనస్సు అవ్యక్తమైన అనురాగంతో నిండిపోయి, జక్కన్నకు అర్పించుకొంటుంది. జక్కన్న కూడా మంజరి లోని సౌందర్యాన్ని చూసి, ముగ్ధుడయి, ఆమె తల [illegible] తలపోస్తాడు.

మంజరి తల్లి 'రాజం' ఈ సంగతి వింటుంది. తన కుమార్తె [illegible] "రాళ్ళు చెక్కుకొనే వాని" వలపు ఉండటం ఆవిడకు మనస్కరించదు

# అమరశిల్పి జక్కన్న

ఇది ఇలా ఉండగా, జక్కన్న చెక్కిన మంజరి శిల్పాన్ని చూచిన గోపదేవ మహారాజు ఆ శిల్పాన్ని కోరుతాడు కాని, జక్కన్న తిరస్కరిస్తాడు. "మంజరి శిల్పాన్నే గాక, మంజరినే పొందాలన్న వాంఛ", ఆ రోజునుంచీ గోపదేవునిలో ప్రబలమవుతుంది . వెంటనే 'మంజరి' తల్లి 'రాజం' ను పూరడిస్తాడు 'రాజం' మంజరిని పూరడించడానికి ప్రయత్నించి విఫలురాలవుతుంది

మంజరి మేనమామ పన్నిన ఉపాయంతో జక్కన్న, మంజరుల వివాహం జరిగిపోతుంది. మొదట మల్లన్న అందుకు వ్యతిరేకించినా, తరువాత అంగీకరిస్తాడు

గోపదేవుని కసి చల్లారదు 'మంజరి' ని ఒంటరిగా రాజం ఇంటికి రప్పించి, భయపెట్టి, బెదిరించి, నృత్యం చేయిస్తాడు. అది చూచిన జక్కన్న, నిజం తెలియక ఖిన్నుడయి, వూరు విడిచి వెళుతాడు వూరూరా తిరిగి బేలూరు చేరుకొంటాడు అక్కడ రామానుజ స్వామి కటాక్షమూ, తదుపరి రాజాశ్రయమూ లభిస్తాయి. బేలూరు దేవాలయపు నిర్మాణపు పనికి ఒప్పుకొన్న జక్కన్న అక్కడి శిల్పులకు ఆచార్యత్వం వహిస్తాడు కూడా

గోపదేవుని విషచూపుల బారినుంచి తప్పించుకొనేందుకు, మంజరి ఆత్మహత్యా ప్రయత్నం చేస్తుంది నీట మునిగిన మంజరి, అలల ధాటికి వడ్డుకు కొట్టుకుని వస్తుంది జాలర్లు ఆమెను కాపాడుతారు అక్కడ ఆమె మగపిల్లవానిని ప్రసవిస్తుంది అతడే డంకన్న

కొన్ని సంవత్సరాలు గడుస్తాయి తిరునాళ్లలో తప్పిపోయిన డంకన్న చివరకు తాత మల్లన్న ఇంటికే చేరుకొంటాడు ఎవరో గుర్తు తెలియని ఆ పసివానికి మల్లన్న ఆశ్రయం యిచ్చి, శిల్ప విద్యలన్నింటినీ నేర్పుతాడు శిల్ప శాస్త్రంలోని ఆరోహణ, అవరోహణలను డంకన్న పూర్తిగా అవగాహన చేసుకొంటాడు మల్లన్న పుత్ర వియోగాన్ని నివారించేందుకు, డంకన్న, జక్కన్నను వెదుకుతూ వెళ్లి, బేలూరు చేరుతాడు.

'మంజరి' కూడా బేలూరులో జక్కన్నకు హితోపదేశం చేసిన శ్రీ రామానుజాచార్యులను కలిసికొంటుంది ఆయన,బేలూరు మహాదేవాలయాన్ని నిర్మిస్తున్న జక్కన్న ఏకాగ్రత చెదరకుండా ఉండేందుకై, జక్కన్నను కలవవద్దని మంజరికి సలహా ఇస్తాడు ఆ సలహానుపాటించిన మంజరి, వెంటనే జక్కన్న జీవితంలోకి తిరిగి ప్రవేశించలేకపోతుంది. బేలూరు దేవాలయం నిర్మాణం పూర్తవుతుంది జక్కన్నను వెదుకుతూ అక్కడకు వచ్చిన డంకన్న, దేవాలయ నిర్మాణంలోని లోపాన్ని సూచించటంలో కథ మరో మలుపు తిరుగుతుంది డంకన్నకు అక్కడ సమాదరం లభిస్తుంది చివరకు, అందరూ ఏకమై, చెన్న కేశుణ్ణి కీర్తించటంతో కథ ముగుస్తుంది

చరిత్రాత్మకం కావటమే కథలోని ముఖ్యమైన ఆకర్షణ సముద్రాల వారి మాటలు, కేవలం రత్నాల మూటలే. అన్నీ పాటలు బాగానే ఉన్నాయి బి.

ఎస్ రంగా గారి ఫోటోగ్రఫీ అత్యున్నత ప్రమాణా లను విశదీకరిస్తుంది శ్రీ హీరాలాల్ నిర్వహించిన నృత్యాలలో 'వెరైటీ' కనుపిస్తుంది బేలూరు మొదలైన ఔట్‌డోర్ దృశ్యాలు కమనీయంగా ఉన్నాయి సెట్టింగులలో 'శిల్పం' దాగిఉన్నది

మంజరిగా, సరోజాదేవి నటన తారాపథాన్ని అందుకొంది ప్రియురాలుగా, నర్తకిగా, భార్యగా, తల్లిగా నటించిన సరోజాదేవి నటనలో ఏ లోపమూ లేదు జక్కన్నగా శ్రీ నాగేశ్వరరావు నటన (మేకప్ లోపాలు మినహాయిస్తే), మరో సోపానాన్ని అందు కొంది హరనాన్ డంకన్నగా బాగా సరిపోయాడు రామానుజస్వామిగా ధూళిపాళ నటన బాగున్నది, కాని ఎందువల్లనో ఆ పాత్రలో దివ్యత్వం ఉట్టిపడటం లేదు రేలంగి, గిరిజల హాస్యం బావుంది

మేకప్ విషయంలో మరికొంత శ్రద్ధ వహించి ఉంటే బాగుండేది చిత్రం ఈస్టుమన్ కలర్‌లో తీయటంవల్ల, చిత్రానికీ, మేకప్‌కూ సమన్వయం కుదరలేదు

కొన్ని దర్శకత్వపు లోపాలు లేకపోలేదు నీటి మడుగులో దూకిన మంజరి, సముద్రపు వడ్డున తేలటం, ఇరవై సంవత్సరాల కథ గడిచినా రేలంగి, గిరిజల పాత్రలలో మార్పు రాకపోవటం, అనవసర మయినచోట నృత్యాలను చొప్పించటం—ఇలాంటివి. కాని, విశేష మేమంటే, ఈ చిన్న లోపాలు చిత్ర గమనానికి ఆటంకాలుగా నిలవలేదు

ఏమైనా, జయప్రదంగా సినిమా తీయటం, ఒక యజ్ఞంగా పరిణమిస్తున్న యీ రోజుల్లో. సాహసంచేసి 'ఈస్టుమన్ కలర్' లోనే చిత్రాన్ని నిర్మించి, ప్రభుత్వమువారి ప్రశంసాపత్రాన్ని కూడా అందుకొన్న శ్రీ బి ఎస్ రంగా అభినందనీయులు

వాశిరాజు ప్రకాశం ★

## సినిమా వార్తలు

13 వ పేజీ తరువాయి

"ఏమ్! ఏమిటా తలతిరుగుడు మహారాణి వారికి సరిగా సమాధానం చెప్పు"

"చెప్పున్నాగా"

"నీ పేరేమి?"

"అదే— అనవసరం"

"కట! కటా! ఏలనా తిరస్కారము—"

"జగజ్జాణా! మహామాయా! వెళ్ళి, వడ్డింపండి" మంత్రి సేవకులను ఆజ్ఞాపిస్తుంది వాళ్ళు అనవసరం దగ్గరకు వెళ్తారు

"అలా చూస్తారేం? తెండి"

సేవకులు అనవసరాన్ని కొడతారు

"ఫడేల్ ఫడీ వడ్డనంటే ఇదా — నే నింకా అన్నదనుకున్నా — కొట్టకండి — కొట్టకండి. అందమైన చేతులు కందిపోతాయ్"

"ఇప్పుడు చెప్పు నీ పేరేమిటి?"

"అనవసరం"

"ఊఁ యింకా ముదరపాకం తగిలించండి"

"ఒద్దొద్దు — నీ పాకంతో నేనీ లోకమే విడచిపోయేటట్టుంది"

"ఊ అలా దారికి రా— యిప్పుడైనా చెప్పు. నీ పేరు?"

"అమ్మా — నాన్న పెట్టిన పేరే నాకిది మా అమ్మకు మాట పదకొండు మంది పిల్లలు పుట్టితే— ఇక నాకు పిల్లలు అనవసరం అని మా అమ్మ భీష్మించుకు కూచుంది. అనుకోకుండా అప్పుడు నేను పుట్టాను. అందుకు నాకు అనవ సరం అని పేరు పెట్టారు"

రాణీగారితో సహా సభికులందరూ నవ్వుతారు

"నవ్వు నవ్వు మీరు నవ్వకూడదమ్మా"

"కట కటా! వాడంత ముచ్చటగా మురిపా లొలికించ— నవ్వకుండా ఉండు టెట్లు — మంత్రీ ఏలనో — నా ఉల్లమే పల్లవించు చున్నది"

సభలోవారంతా "అనవసరం — అనవసరం" అంటూ ఒకసారికి పదిసార్లు అనుకుంటూ నవ్వు కుంటారు

"నవ్వు — ఎద్దు — అలా నవ్వురేమిటి - అనవసరంగా— నా పేరైతే అనవసరం కాని ఎప్పుడో — ఒకప్పుడు మీ అందరికి వస్తుంది నా అవసరం—"

"ఏమైనా సరే— రాజ శాసనం ధిక్కరించి నువ్వి సీమలో ప్రవేశించడమే పెద్ద తప్పు"

"ఫడేల్ ఫడీ— అది తెలియక పొరబట్టి వచ్చాను

తెలుసుంటే వచ్చేందుకు నేనేమైనా తెలివి తక్కువ వాణ్ణా!"

"కట! కటా! నీ తెలివికి నే నచ్చితిని నీ యుక్తికి నే మెచ్చితిని"

"ఫడేల్ ఫడే! ఇకనేం నన్ను ఒదిలి పెట్టేయండి"

"ఓ అలాగే పంపిస్తాం— జగజ్జాణా — మహా మాయా—"

"వీళ్ళేందు మళ్ళా— రాక్షసుల్లా"

"నిన్ను మర్యాదగా సాగనంపద్దా మరీ"

అనవసరం మహారాణి ఒకరి నొకరు కళ్ళతో చూసుకుంటారు

"ఆగండి— మహారాణీ వారి తీర్పు కావాలి ఊ చెప్పండమ్మా— మహారాణీ!"

"ఓ— ఏమది?"

"తీర్పు చెప్పండమ్మా!"

"నేనే చెప్పవలయునా ఎలా చెప్పను మహామంత్రీ వాడి— వాడి కన్నులు నావంక వేడి వేడిగా చూచుచుండ మంచులా నా మనసెందుకో కరగిపోవు చున్నది ఎదలో ఏదో తెలియని గిలిగింతలు కదలగా నేనెట్లు శిక్షించను మహామంత్రీ"

"ఏమ్ బందీ! ఏమిటా కారం కళ్ళు దించుకో.... ఇప్పుడు చెప్పండమ్మా".

"అపరాధిని... మహామంత్రీ మరల వాడు నా వంకే చూచు చున్నాడు"

"ఏమ్ బందీ! మర్యాదగా తల దించుకొంటావా లేక తలే తీయించమంటావా?"

"తీయించటమెందుకు—నేనే దించుకుంటాను"

"అపరాధిని ఊరవతల కారాగారంలో బంధిం చండి" అనవసరం రాణి మొఖంలోకి చూస్తాడు. రాణి "చంపకండి" అంటుంది

ఈ హాస్య సన్నివేశం "శ్రీ సింహాచల క్షేత్ర మహిమ" చిత్రంలోనిది ఈ సన్నివేశంలో రేలంగి, గిరిజ, మోహన ఉన్నారు వారు కాక ఇంకా కాంతా రావు, కృష్ణకుమారి, నాగయ్య, చలం, రాజనాల నల్లరామూర్తి, రాజబాబు, సూర్యాకాంతం మొదలగు వారున్నారు

మాటలు పాటలు — రాజశ్రీ, సంగీతం— టి వి. రాజు, ఛాయ ఆర్. మధు, కళ— బి ఎస్ కృష్ణ, నృత్యం— చిన్ని సంపత్, కూర్పు— మార్తాండ్, స్టుడియో— విజయా— వాహినీ, కథ— దర్శకత్వం బి వి ప్రసాద్, నిర్మాతలు— యస్ డి కోమలత అండ్ శ్రీ వెంకటేశ్వర ఫిలిం కంపెని ప్రయివేట్ లిమిటెడ్



"దేశద్రోహులు చిత్రం"లో రేలంగి, ఎన్. టి. రామారావు.

## "ఈడూ - జోడూ" ఉత్తమకథ

మద్రాసు ఫిలిం ఫ్యాన్సు అసోసియేషన్‌వారు 1963వ సంవత్సరంలో విడుదల లయిన చిత్రాల్లో ఉత్తమ చిత్రకథగా శ్రీ పినిసెట్టి శ్రీరామ మూర్తి వ్రాసిన తిలక్ చిత్రం "ఈడూ—జోడూ"ను ఎన్నుకున్నారు.

సి. ధర్మారావు ★

# సుశీల గ్రహించిన సత్యం-23 - దేవిక




శేఖర్ ఆవేశంలో ఆమె భుజాలు పట్టుకున్నాడు.

స్టేషనులో ఎవ్వరూ కనుపించలేదు కాని రోడ్డు మీదకు వచ్చేసరికి. ..










సుశీల ఆశ్చర్యపోయింది మోహనే ఎందుకు ఎలా వచ్చాడో ఆమెకు అర్థం కాలేదు.






Edited, Printed and Published by S. Radhakrishna at the AndhraPatrika Press, 6 &7 Thambuchetty Street Madras-1. Phone, 22244 & 23713. Chief Editor S. Sambhu Prasad.



ఈ అమ్మాయిలకి పన్నెండేసి సంవత్సరాలే వయసు అంటే మీరు నమ్మగలరా ?

